# అపరాధ పరిశోధన

రు. 5.50 డిసెంబర్ 82

సప్లిమెంట్ 108



అపరాధ పరిశోధన అనుబంధం—108

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## గజదొంగ
రచన : వసుంధర

## బ్లాక్ టైగర్
రచన : వాణిశ్రీ

## అది కక్ష - ఇది శిక్ష
రచన : సికిందర్

## బస్సు దోపిడి
రచన : టెంపోరావ్

అపరాధ పరిశోధన సప్లిమెంట్—108
డిసెంబర్, 1982
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ షిలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# గజదొంగ

## వసుంధర

"ఎలాగైనా సుందరి అదృష్టవంతురాలు—" అంటూ సంతోషంగా అన్నాడు పార్వతీశం.

"ఆ విషయం ఈనాడంటున్నారు మీరు. పుట్టినప్పుడే గ్రహించాను నేను—" అంది మాలతమ్మ.

పార్వతీశం, మాలతమ్మ భార్యాభర్తలు. ఇద్దరు మగ పిల్లలు పెద్ద చదువులు చదువుకుని దూరప్రాంతాల మంచి ఉద్యోగాలు చేస్తున్నారు. వారివద్ద ఉన్నదల్లా ఒక్కగా నొక్క కూతురు. ఆమె పేరు సుందరి. సుందరి బియ్యే చదువుతున్నది.

సుందరి రెండో అన్నకంటె ఏడేళ్ళు చిన్నది. అందుకని ఆమె ఆ యింట్లో అల్లారుముద్దుగా పెరిగింది. అలాగని ఆమె రణపెంకి కాదు. పెంకితనం ఉన్నా అది ఆడపిల్లలకు అందాన్నిచ్చేటంత మాత్రమే ఉన్నది.

చూస్తూ చూస్తూ కూతుర్ని పెళ్ళిచేసి మరో యింటికి పంపేయలేక పార్వతీశం కాస్త జాప్యం చేశాడు. కానీ

తన కళ్ళముందే కూతురికంటే చిన్నవాళ్లు పెళ్ళిళ్ళు అయి పోతూంటే ఆయనకు కాస్త బాధకలిగింది. ఏ వయసులో జరుగవలసిన ముచ్చట ఆ వయసులో జరగాలి. ఆడ పిల్లన్నాక ఎలాగూ గడపదాటి వెళ్ళక తప్పదు. అటు వంటప్పుడా మెకు వయసు ముదరనివ్వడమెందుకు?

అలాగని సుందరి వయసేమీ ముదరలేదు. పదహారో ఏట ప్రారంభం కావలసిన పెళ్ళిప్రయత్నాలు పద్దెనిమిదో ఏట ప్రారంభమయ్యాయి.

సుందరి అందంగా ఉంటుంది. చక్కటి అంగ సౌష్టవం. తెలివితేటల కారణంగా ఆమె కళ్ళలో ప్రత్యేకమైన చురుకుదనం కనబడుతుంది.

పార్వతీశం వెతికి వెతికి మంచి సంబంధమే పట్టాడు.

వరుడి పేరు సత్తిబాబు. చూడ్డానికి అందంగా ఆకర్షణీయంగా ఉన్నాడు. నాగార్జున సాగర్‌లో జూనియర్ ఇంజనీరుగా ఉంటున్నాడు. మనిషి చలాకీగా ఉంటాడు. పెళ్ళిచూపులకు వచ్చినప్పుడతడు తెలుగు సినిమా హీరోల్లా బిగుసుకుపోకుండా హిందీ సినిమా హీరోల్లా ఫ్రీగా ఉన్నాడు.

పార్వతీశానికి వరుడు నచ్చాడు. వరుడికి పిల్ల నచ్చింది. అప్పటికప్పుడు పెళ్ళిమాటలు జరిగాయి.

మగపెళ్ళివారు పాతికవేల రూపాయలు కట్నం అడిగారు. పిల్ల మెడలో కనీసం అయిదు తులాల బంగారం ఉండాలన్నారు.

పార్వతీశం పేదవాడు కాదు. అలాగని కూతురికి పాతికవేల కట్నం ఇచ్చుకోలేడు. ఆయన తన కొడుకులకు నామమాత్రంగా కట్నం తీసుకున్నాడు. ఆ కట్నం డబ్బు ఆ పెళ్ళి ఖర్చులకే సరిపోయింది.

కూతురి పెళ్ళికి ఆయన పదివేలు కట్నమివ్వాలను కున్నాడు. అయిదు వేలు లాంఛనాలనుకున్నాడు. పదివేలు పెళ్ళిఖర్చులనుకున్నాడు. ఈ పాతిక వేలూ ఎలాగో అలా సమకూర్చగలననుకున్నాడు. ఆయనవద్ద పదిహేను వేలు క్యాషు సిద్ధంగా ఉన్నది. కొడుకులిద్దరూ చెరో అయిదు వేలూ అప్పుగానైనా పుట్టించగలరని ఆయన నమ్మకం.

ఇప్పుడు పెళ్ళివారు కట్నమే పాతిక వేలు అడుగు తున్నారు. అయిదు తులాల బంగారం గురించి బాధ లేదు. అది పిల్ల మెడలో ఉండనే ఉన్నది. కానీ కట్నం పాతిక వేలంటే పెళ్ళి ఖర్చులు కనీసం మరో పదిహేను వేలుంటాయి. అనగా అప్పు చేయవలసిన మొత్తం పాతిక వేలు అవుతుంది.

అయితే సుందరి ఆయనకు ఒక్కగా నొక్క కూతురు. ఈ సంబంధం చేస్తే కూతురు సుఖపడుతుందన్న నమ్మక మాయనకున్నది. అందువల్ల కొద్ది క్షణాలు మాత్రం ఆలోచించి పెళ్ళివారి షరతులకు అంగీకరించి పంపేశాడు పార్వతీశం.

పెళ్ళివారు వెళ్ళిపోయాక ఇంట్లో ఈ విషయమై చర్చలు ప్రారంభమయ్యాయి.

"ఎలా తెస్తారండీ అంత డబ్బు?" అంది మాలతమ్మ.

"ఎలాగో తెస్తాను. ఒక్కగా నొక్క కూతురు. చూస్తూ చూస్తూ పదిహేను వేలకోసం రాజాలాంటి సంబంధం వదులుకుంటానా?" అన్నాడు పార్వతీశం.

సుందరి తలిదండ్రులపైన అంతెత్తున విరుచుకుపడింది.

నాకేం అందం లేదా, చదువు లేదా, కట్నం పేరు చెప్పి నన్నిలా అవమానిస్తారా, ఈ సంబధానికి ఒప్పు కునేందుకు వీల్లేదు—అన్నదామె.

తండ్రి ఎంత చెప్పినా ఆమె శాంతపడలేదు. అందుకు కారణముంది.

తను చాలా గొప్పదాన్ననీ తనకోసం పురుషులు ఎటువంటి త్యాగం చెయ్యడానికైనా సిద్ధంగా ఉన్నారనీ సుందరికో అభిప్రాయం ఏర్పడి బలపడింది. అందుకు కారణం బయటప్రపంచంలో ఆమె వెంటబడే యువకులు, ఆమెకు వచ్చే ప్రేమలేఖలు. ఆమె క్రీగంటి చూపుల కోసం తహతహలాడే ఎందరో యువకులామెకు ఉత్తరాలూ రాశారు. కలుసుకుని మాట్లాడ్డానికి ప్రయత్నించారు.

సుందరి ఎవరినీ పట్టించుకోలేదు. తనవెంటబడేవారినీ, తనకు వచ్చే ప్రేమలేఖల్నీ — తన గొప్పతనానికి కొలబద్దలా చూసుకుంటోందామె.

"నిన్ను చూడగానే నేను పోగొట్టుకున్నదేదో దొరికినదనిపించింది. నీ కోసం ఏమైనా చేస్తాను. నీ పరిచయ భాగ్యం నాకు కలగనివ్వు—"

"నువ్వు అసమాన తేజోరాశివి. నీ ముఖంవంక చూసే శక్తి కూడా నాకు లేదు. నీ పాద స్పర్శ కలిగితేచాలు— ఈ జీవితానికింతకుమించిన అదృష్టం లేదనుకుంటాను-..."

"ఎందుకీ అర్థంలేని చదువులు? అందమైన ఈ ప్రపంచంలో ఆనందంగా విహరించవలసిన ఈ వయసును చదువుల పేరుతో వృధాచేస్తున్నామని నాకు అనిపించింది. నువ్వు ఊఁ అంటే మన పెళ్ళి జరుగుతుంది. ఆ తర్వాత మనం కాలేజీ వదిలిపెట్టి కాశ్మీరు వెళ్ళిపోదాం."

ఇలాంటి ఉత్తరాలు చాలా వచ్చాయి సుందరికి. వీటికామె రెస్పాన్సు ఇవ్వనూలేదు. వీటినామె తలిదండ్రులకు చూపనూ లేదు.

ఇప్పుడు ఓ సత్తిబాబు పాతికవేలు కట్నం ఇచ్చే

మాటైతేనే తనను పెళ్ళాడతానంటున్నాడు. లేని పక్షంలో తనను నిరాకరిస్తాడు.

సత్తిబాబుకు తన గొప్పతనం నిరూపించుకోవాలని సుందరికి అనిపించింది. అప్పుడామె తన వెంటబడే యువకుల గురించి ఆలోచించింది.

వారిలో చాలామంది విద్యార్థులు.

విద్యార్థులనామె ప్రేమించదల్చుకోలేదు. వాళ్ళూ చదువుకుంటున్నారు. తనూ చదువుకుంటోంది. వాళ్ళను ప్రేమించి తన జీవితంలో ఎలా స్థిరపడుతుంది?

ఆమెపట్ల ప్రేమను ప్రకటించినవారిలో ఇద్దరు కాలేజీ లెక్చరర్సు కూడా ఉన్నారు. వారిలో ఒకాయన బాగుండడు. రెండో ఆయన చాలామందికి ప్రేమలేఖలు రాసినట్లు తెలిసింది.

సత్తిబాబుమీద యేర్పడిన కసి తర్వాత సుందరి దృష్టిలోనికి వచ్చినవాడు చిన్నారావు.

చిన్నారావు కాలేజీ విద్యార్థి కాదు. ఏదో ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం. అతడామెకు తమాషాగా తటస్థపడ్డాడు.

ఓ రోజు బస్‌స్టాపులో అతడు, ఆమె మాత్రం ఉన్నారు.

"ఏమండీ మీ పేరు సుందరికదూ—" అన్నాడతడు.

"మీకెలా తెలుసు?" అన్నదామె ఆశ్చర్యంగా.

"మీ పుస్తకాలమీద చూశాను—" అన్నాడతడు.

సుందరి పలకరింపుగా నవ్వి ఊరుకుంది.

"నా పేరు చిన్నారావు. నేనుద్యోగం చేస్తున్నాను. నెలకు ఏడువందలయాభై రూపాయలు వస్తుంది. ఇంకో ఏడాదిలో ప్రమోషన్ కూడా వస్తుంది. అప్పుడు నెలకు

వెయ్యి రూపాయలు జీతం అవుతుంది—"

సుందరికేం చెప్పాలో అర్థంకాలేదు.

"మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నానండీ — నాకు మీ రెంతో నచ్చారు. మీకూ నేను నచ్చినమాటైతే మీ యింటికి వెళ్ళి మీ నాన్నగారిని కలుసుకుంటాను—" అన్నాడతడు.

అతడంత సూటిగా మాట్లాడ్డం సుందరికి ఆశ్చర్యాన్నీ, ఇబ్బందినీ కలిగించింది. ఏమనాలా అనుకుంటూండగా బస్సు వచ్చింది.

ఆ తర్వాత చిన్నారావామె వెంట చాలా సార్లు పడ్డాడు. తన ప్రేమగోడు వెళ్ళబుచ్చుకున్నాడు.

అతడు పొగుడుతూంటే ఆమెకు ఎంతో బాగుండేది. కానీ అతడలా వెంటబడడం ఆమెకు నచ్చలేను. మొదటిదామె అతడికి చెప్పలేదు. రెండోది చెప్పింది.

"నేను మీ వెంటపడడం మానలేను. మీరు అవుననేనా అనండి. కాదనేనా అనండి. అప్పుడు వెళ్ళి పోతాను—" అన్నాడు చిన్నారావు.

"కాదు—" అనేసింది నిర్దాక్షిణ్యంగా సుందరి.

"వెంటబడ్డ మగాడిని ఆడది కాదు అని చెప్పే పద్ధతి అది కాదు—" అన్నాడు చిన్నారావు.

"మరేమిటి?" అడిగిందామె.

"చెంపదెబ్బ లేదా చెప్పుదెబ్బ!" అన్నాడతడు.

సుందరి నివ్వెరపోయింది. అతడు మరీ ఇలా అంటాడని ఆమె అనుకోలేదు. అలాంటివాడికి చెంపదెబ్బ లేదా చెప్పు దెబ్బయే సరైన సమాధానం.

కానీ ఎలా?

సుందరి సంస్కారం అందుకు సహకరించలేదు.

"ఇలాగనడానికి మీకు సిగ్గులేదూ?" అన్నదామె.

"ప్రేమ అహాన్ని చంపేస్తుంది. అహం పోయాక ఇంక సిగ్గేమిటి?" అన్నాడు చిన్నారావు.

సుందరికి ఏంచేయాలో తెలియలేదు.

"చూశారా — మీకు తెలీకుండానే మీరు నన్ను ప్రేమిస్తున్నారు. అందుకే నన్ను కొట్టలేకపోతున్నారు" అన్నాడు చిన్నారావు సంతోషంగా.

"కొట్టలేకపోవడం నా సంస్కారం. వెంటబడకుండా ఉండడం మీ సంస్కారాన్ని నిలబెడుతుంది-" అంది సుందరి.

"మీకింకా వివాహంకాలేదు. అంతవరకూ వెంటబడే హక్కు నాకుంది. ఆ తర్వాత వెంటబడితేనే మీరు నా సంస్కారాన్ని గురించి మాట్లాడాలి—" అన్నాడు చిన్నారావు.

సుందరికి ఏమనాలో తెలియలేదు. పెళ్ళికాని ఆడపిల్ల వెంటబడడం ప్రతి యువకుడి హక్కు అంటున్నాడు చిన్నారావు. ఆ హక్కు గురించి తనకు తెలియదని చెప్పి ఊరుకున్నదామె.

చిన్నారావామెను ఇంచుమించు ప్రతి రోజూ చూస్తూనే ఉండేవాడు. ఒంటంగా దొరికితే మాట్లాడే వాడు. లేని పక్షంలో ఊరుకునేవాడు. అతడి ప్రవర్తనలో సంస్కారం కనబడేది. మాట్లాడినపుడల్లా అతనామెను పొగిడేవాడు. ఆ పొగడ్తల్లోనూ సంస్కారముండేది.

సత్తిబాబు పాతికవేలు కట్నం అడగ్గానే కలిగిన ఆవేశంలో సుందరి చిన్నారావును ప్రేమించాలని అనుకుంది. ఆమె అతడికి తెలియకుండానే కొంత పరిశోధన చేసి తన గురించి అతడు చెప్పుకున్నవన్నీ నిజమేనని

గ్రహించింది. అతడా ఊళ్ళో ఒంటరిగా ఉంటున్నాడు. అతడి ఉద్యోగం ప్రయివేటు కంపెనీలో నే అయినప్పటికీ దానికి రక్షణ ఉన్నది.

తానిక చిన్నారావుని ప్రేమించడంలో తప్పుగానీ, నష్టంగానీ లేదని ఆమె నిర్ణయించుకుంది.

ఒకరోజున అతడితో — "ఎందుకిలా మీరు రోజూ నా వెంటబడతారు?" అనడిగింది.

"మీరంటే నాకిష్టం—" అన్నాడతడు.

"ఇష్టమైతే వెంటబడతారా?"

"ప్రస్తుతానికి అంతకుమించి ఏం చేయాలో నాకు తెలియడంలేదు—"

"ఇప్పుడలాగే అంటారు. వెంటబడతారు. తీరా వ్యవహారం పెళ్ళిదాకా వస్తే అప్పుడు కట్నాలు, లాంఛనాలు అంటారు—...."

చిన్నారావు నవ్వి—"మీరు నన్ను ప్రేమిస్తున్నానని ఒక్క ముక్క చెప్పండి. చాలు. ఆ తర్వాత మన పెళ్ళి అయ్యేవరకూ నేను మీ వెంటబడను—" అన్నాడు.

"ఏం చేస్తారు?" అన్నదామె.

"మీ నాన్నగారిని కలుసుకుంటాను. మన ప్రేమ గురించి చెబుతాను—"

"మా నాన్నగారిని కలుసుకోండి. మన ప్రేమ గురించి మాత్రం చెప్పకండి. మీ ప్రేమ గురించే చెప్పండి—"

"అంటే?"

"నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. ఆ కానీ సంగతి మీరు మా నాన్నగారికి చెప్పకూడదు—" అంది సుందరి.

చిన్నారావుకు కలిగిన ఆనందమింతా అంతా కాదు. అతడా రోజునే పార్వతీశాన్ని కలుసుకున్నాడు. తన్ను

తాను పరిచయం చేసుకున్నాడు.

"ఇంతకూ నువ్వొచ్చిన పనేమిటి?" అన్నాడు పార్వతీశం.

"కాలేజీకి వెడుతూండగా చాలాసార్లు మీ అమ్మాయిని నేను చూశాను. ఆమె అంటే ప్రేమ కలిగింది. నన్నూ, నా భార్యను పోషించుకోడానికి ఉద్యోగముంది నాకు. నా పెద్దలు నా ఇష్టాన్ని కాదనరు. నాకు పైసా కట్నం అక్కర్లేదు. సింపుల్ గా రిజిస్ట్రారాఫీసులో పెళ్ళి జరిపిస్తే చాలు—" అన్నాడు చిన్నారావు.

"అమ్మాయి నువ్వంటే ఇష్టపడిందా?" అన్నాడు పార్వతీశం తాపీగా.

"ఏమో—నాకా విషయం తెలియదు. వయసులో ఉన్న ఆడపిల్లను పలకరించి ఇలాంటి ప్రశ్నలు వేయడం భావ్యం కాదనిపించింది. ఆమెను నేనెన్నడూ పలకరించలేదు. ఆమెతో మాట్లాడలేదు...." అన్నాడు చిన్నారావు.

పార్వతీశం అప్పుడతడి కులం, గోత్రం అడిగాడు.

అతడు చెప్పిన వివరాలన్నీ విని — "నువ్వు చాలా మర్యాదస్థుడిలాగున్నావు. అందుకే నీకు నేను మర్యాదగా చెబుతున్నాను. నువ్వు పెళ్ళికి వేరే పిల్లను చూసుకో. కట్నం లేకుండా పెళ్ళిచేసుకుంటానంటే చాలామంది నీ కోసం ఎగబడతారు. నీ దురదృష్టంకొద్దీ నేనలాంటివాణ్ని కాదు—" అన్నాడు పార్వతీశం.

"నాలో ఏం లోపం కనిపించింది మీకు?" అన్నాడు చిన్నారావు.

"నీలో లోపమేం లేదు. మాది సంప్రదాయం గల కుటుంబం. ఉన్నది ఒక్కగానొక్క ఆడపిల్ల. కట్న

మిథ్యాగల స్తోమత ఉన్నది. తరతరాలుగా వస్తున్న సంప్రదాయాన్ని వదులుకుని వర్ణాంతర సంబంధం చేయడం నాకిష్టంలేదు—....."

"ఈ రోజుల్లో కూడా మీరలాగంటే ఎలా?" అన్నాడు చిన్నారావు.

"రోజులు పెద్దగా మారాయని నేననుకోను. నేనెరిగి నా బంధువుల్లో యెవ్వరూ వర్ణాంతర వివాహం జరిపించలేదు—" అన్నాడు పార్వతీశం.

"కానీ మీరు అమ్మాయి సుఖం కూడా ఆలోచించుకోవాలి. అన్నివిధాలా నా సంబంధం మంచిది—ఒక్క కులం సంగతి మర్చిపోతే!" అన్నాడు చిన్నారావు.

పార్వతీశం లోపలకు వెళ్ళి ఓ ఫోటో తెచ్చాడు. అది సత్తిబాబుది!

"ఇది చూడు. ఇందులోని మనిషి నీ కంటే గొప్పగా ఉన్నాడు. పైగా ఇతడు ఇంజనీరు. నేనీ సంబంధాన్ని అమ్మాయికి స్థిరపరిచాను. ఇక్కడ అన్నీ కలిశాయి—"

"అన్నీ కలిసినా మనసు సంగతి ఆలోచించాలి మీరు. నాకూ కట్నమిస్తానంటూ సంబంధాలొస్తున్నాయి. కానీ నేను మీ అమ్మాయిని ప్రేమించాను. అందుకే కట్నం కూడా వద్దంటున్నాను...."

"నువ్వు కట్నం వద్దంటున్నావు. నేను నువ్వే వద్దంటున్నాను...."

"నా ప్రేమ బలమైనది. మిమ్మల్ని ఒప్పించేదాకా నేనిక్కణ్నించి కదలను—"

"చూడు మిస్టర్ చిన్నారావ్! నువ్వు మర్యాదస్థుడివి కదా అని నేనూ మర్యాదనిచ్చి మాట్లాడాను. నీ మర్యాద నువ్వు నిలబెట్టుకో. నీ సంబంధం మాకు వద్దు.

నువ్వికవెళ్ళవచ్చు—" అన్నాడు పార్వతీశం.

చిన్నారావు వెళ్ళిపోయాడు.

ఈ సంభాషణంతా సుందరి వింటోంది. తండ్రి మూర్ఖత్వం ఆమెకు చాలా చిరాకును, విచారాన్ని కలిగించింది.

"ఎవరండీ అతడు?" అంది మాలతమ్మ.

చిన్నారావు గురించి చెప్పాడు పార్వతీశం—"అడ్డమైనవాళ్ళకూ నా కూతుర్నిచ్చి పెళ్ళిచేయడానికి నేనేమైనా గతిలేనివాడిననుకున్నాడేమో—తల తాకట్టు పెట్టయినా అమ్మాయికి ఇంజనీరు సంబంధం చేస్తాను తప్పితే ఇలాటి చచ్చు సంబంధాల జోలికి వెళ్ళను—"

ఆ రోజు సుందరి ఇంట్లో కాస్త గొడవచేసింది. అది తన పెళ్ళికి సంబంధించిన విషయమన్న సిగ్గును కూడా ఆమె విడిచిపెట్టింది.

చిన్నారావు సంబంధానికి ఒప్పుకుంటే తండ్రికి నలభైవేలు ఆదా అవుతుంది. కులం, మతం అన్నవి మనిషి ముఖంమీద రాసి వుండవు. అవి మనిషి ఆలోచనల్లోంచి పుట్టుకొచ్చిన అర్థరహిత భావాలు. మనుషులంతా ఒక్కటేనన్న భావం ఇంకా ఇప్పటికీ ఈ దేశంలో కలగని కారణంగానే — ఇక్కడి ప్రజలిలా అవస్థపడుతున్నారు. పాతికవేలు కట్నంతో పెళ్ళిని ముడిపెట్టి సుందరిని అవమానించాడు సత్తిబాబు. చిన్నారావా అవమానాన్ని తొలగించాడు. అన్నివిధాలా చిన్నారావు ఉన్నతుడు.

తండ్రి ఆమె ఆలోచనలన్నిటినీ కొట్టిపారేశాడు. సంప్రదాయానికి మించింది లేదన్నాడు. కులం తేడా రావడంవల్ల వీళ్ళిద్దరూ ఎలావున్నా—వీళ్ళకు పుట్టబోయే

సంతానం చాలా ఇబ్బందిపడాలన్నాడు. తన అనుభవం ముందు సుందరి అనుభవం చాలదన్నాడు.

"సత్తిబాబు నన్ను పాతికవేలతో కలిపి ప్రేమిస్తున్నాడు. చిన్నారావు నన్ను నన్నుగా ప్రేమిస్తున్నాడు—" అంది సుందరి.

"నిన్ను నిన్నుగా అతడేం ప్రేమించడంలేదు. ఇదే అందంతో నువ్వే వేశ్య యింటనో పుట్టివుంటే అతడు నీ గురించి పెళ్ళి అన్న ఆలోచన కూడా రానిచ్చేవాడు కాదు. అతడు నీ వెనుకనున్న కుటుంబ సంప్రదాయాన్నీ, నీ సంస్కారాన్నీ నీతో కలిపి చూస్తున్నాడు. ప్రేమ అన్నది ఓ క్షణంలో పుట్టేది కాదు. అలా జరిగినా ఓ చూపులో పుట్టిన ప్రేమ ఓ మాటతో పోతుంది. ఎన్నో రోజుల అనుబంధంతో కలిగిన ప్రేమ శాశ్వతమైనది. ఆ ప్రేమ ఎన్ని తప్పులనైనా క్షమించగలుగుతుంది—" అన్నాడు పార్వతీశం.

ఆయన్ను సమర్థిస్తూ మాలతమ్మ కూతుర్ని తిట్టింది. అప్పుడు పార్వతీశం—"దానినేమీ అనకే! దాని పెళ్ళికి మనమేదో కష్టపడిపోతున్నామని దాని బాధ. అది సుఖంగా వుండాలి కానీ నలభైవేలో పెద్ద లెక్కకాదు నాకు. అవసరమైతే నాలుగు లక్షలైనా తెచ్చి దానికి మంచి సంబంధం తేగలను. తలిదండ్రుల ప్రేమను అది అర్థం చేసుకోలేకపోతోంది. అంతే!" అన్నాడు.

తలిదండ్రుల ప్రేమను సుందరి అర్థం చేసుకుంది. కానీ తన ప్రేమను వారు అర్థం చేసుకోవడంలేదన్నది ఆమె బాధ. ప్రేమతో వారు తన కోసం త్యాగం చేయాలను కుంటున్నారు. కానీ వారి ప్రేమను తను అంగీకరిస్తే అది స్వార్థం అవుతుంది. అదా మెకు ఇష్టంలేదు.

తలిదండ్రుల ఇష్టానికి వ్యతిరేకంగా ఆమె చిన్నా రావును పెళ్ళిచేసుకోవాలని నిర్ణయించుకుంది.

మర్నాడు చిన్నారావామెను కలిశాడు.

"మీ మాట విని మీ నాన్నగారిని కలుసుకుంటే నాకు అవమానం ఎదురయింది. మీకు ముందే సంబంధం నిశ్చయమయిందని ఎందుకు చెప్పలేదు?" అన్నాడతడు కోపంగా.

"మీరు నన్ను ప్రేమిస్తున్నానని చెప్పారు. కానీ ఒక చిన్న సంఘటనతో అప్పుడే మీకు నామీద కోపం వచ్చేసింది. ఇంతేనా మీ ప్రేమ?" అంది సుందరి.

చిన్నారావు తడబడి — "మీరు నాతో ఆడుకుంటున్నారేమోనని అనుమానం వచ్చింది. అసలు నాకలా అనుమానం రావడం పెద్ద తప్పు. అందుకు మిమ్మల్ని మన్నించమని అడుగుతున్నాను...." అన్నాడు.

అతడి సంస్కారం ఆమెను ముగ్ధురాల్ని చేసింది. అప్పుడామె సత్తిబాబు సంబంధం గురించి చెప్పి— "నాన్నగారు తనాడబ్బును పోగుచేయగలననే అనుకుంటున్నారు. నాకది ఇష్టంలేదు. నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను—తలిదండ్రుల్ని యెదిరించి అయినా సరే...." అంది.

చిన్నారావు చాలా సంతోషించాడు.

"తన ప్రయత్నాలు సఫలంకావని నాన్నగారు గుర్తించే రోజొస్తుంది. అంతవరకూ మన ప్రేమ వ్యవహారం రహస్యంగా వుంచుదాం. ముందు దెబ్బలాడినా తర్వాత నన్నెవ్వరూ ఏమీ అనరు. మా ఇంట్లో నా మాట కాదనేవారు లేరు—" అంది సుందరి.

ఆ రోజునుంచీ వాళ్ళిద్దరూ రహస్యంగా కలుసుకుం

టూండేవారు. క్రమంగా వారి మధ్య ప్రేమ ద్విగుణీకృత మయింది. ముఖ్యంగా సుందరికి చిన్నారావుపట్ల ఆకర్షణ మరీమరీ పెరగసాగింది.

ఇద్దరూ ఒకరులేనిదే ఒకరు బ్రతికలేమని నిర్ణయానికి కూడా వచ్చారు.

అప్పుడు అనుకోనిది జరిగిపోయింది.

పార్వతీశం పెదనాన్న ఒకడు పోయాడు. ఆయన పేరున చాలా ఇన్సూరెన్సులున్నాయి. అందులో ఒక దానికి పార్వతీశం నామినీ. ఆ విధంగా ఆయనకు అనుకోకుండా పదిహేనువేలు వచ్చాయి.

పార్వతీశం తండ్రి చాలామందికి నోట్లమీద అప్పులిచ్చారు. దురదృష్టవశాత్తూ అవన్నీ కోర్టు లావాదేవీల్లో ఇరుక్కున్నాయి. ఉన్నట్లుండి ఆ సమస్య పువ్వులా విడిపోయింది. వాటిమీద వచ్చిన డబ్బును ముగ్గురన్నదమ్ములు సమంగా పంచుకున్నారు. ఆ విధంగా పార్వతీశానికి మరో ఇరవై వేలు వచ్చాయి.

ఈ విధంగా డబ్బు సమస్య పువ్వులా విడిపోయింది.

"ఎలాగైనా సుందరి అదృష్టవంతురాలు—" అంటూ సంతోషంగా అన్నాడు పార్వతీశం.

"ఆ విషయం ఈనాడంటున్నారు మీరు. పుట్టినప్పుడే గ్రహించాను నేను—" అంది మాలతమ్మ.

## 2

"ఇదీ పరిస్థితి. ఇప్పుడు మనమేం చేయాలి?" అంది సుందరి.

చిన్నారావు ఆలోచనలోపడ్డాడు — "రేపే వెళ్ళి పెళ్ళిచేసుకుందాం. ఆ తర్వాత యెవరూ మనల్నేమీ చెయ్యలేరు...."

సుందరి కాస్త భయపడింది. కానీ అదే చేయాలని ఆమె అనుకుంటోంది. అంత డబ్బు చూస్తూ చూస్తూ సత్తిబాబు పాలబడడం ఆమెకిష్టంలేదు. ఆ డబ్బంతా తండ్రికే మిగలాలి.

అయితే ఆ డబ్బుమీద ఏ మాత్రమూ మోజు చూపకుండా అంతా తనకోసమే ఖర్చు చేయాలనుకుంటున్న తండ్రి ఈ అఘాతాన్ని భరించగలడా? ఆ డబ్బు మిగలడం ఆయనకు సంతోషాన్ని కలిగించగలదా?

"రేపే పెళ్ళి చేసుకుందాం. ఆ తర్వాత యెవరూ మనల్నేమీ చెయ్యలేరు...." అని చిన్నారావు ప్రోత్సహిస్తున్నాడు.

ఒకప్పుడు తండ్రికి అంత డబ్బు పోగుచేయడం సాధ్యపడుతుందా అని తను భయపడింది. అందుకే చిన్నారావుని ప్రేమించి తండ్రికి సాయపడాలనుకుంది. తండ్రికి సాయపడాలనే ఆమె చిన్నారావును ప్రేమించింది.

కానీ ఇప్పుడు తండ్రికి డబ్బు అవలీలగా సమకూరింది. అదంతా సుందరి అదృష్టమని ఆయనంటున్నాడు. అదే నిజమేమో-ఆ అదృష్టాన్ని తను కాలరాసుకుంటోందేమో!

చిన్నారావును పెళ్ళిచేసుకుంటే తండ్రి షాక్ తింటాడు. ఇప్పుడు చిన్నారావును పెళ్ళిచేసుకోవాలనుకుంటే అదాయనకు సాయపడడం అనిపించుకోదు. ఆయనమీద దెబ్బతీసినట్లు అనిపిస్తుంది.

ఏం చేయడం?

ఇంత సమస్య యెందుకు వచ్చిందంటే ఇప్పుడామె చిన్నారావును ప్రేమిస్తోంది. అతడు లేనిదే జీవితం లేదనుకుంటోంది.

కానీ డబ్బులేనప్పుడే చిన్నారావును నిరసించిన పార్వతీశం——ఇప్పుడీ పెళ్ళికి ఒప్పుకుంటాడా?

ఒప్పుకోడని ఆమెకు తెలుసు.

చిన్నారావును వదులుకోలేదు. తండ్రికి బాధ కలిగించ రాదు.

ఎలా?

చిన్నారావుతో—"రేపే అనకు. ఇంట్లో మనకు అను కూల వాతావరణం సృష్టించగలనన్న నమ్మకం నాకు వుంది. ఒక్క వారం రోజులు ఆగు...." అన్నదామె.

# 3

ఆ రాత్రి మాలతమ్మ పిండివంటలు చేసింది. ఇంట్లో పెద్దపండుగలా వుంది.

"అసలీరోజే ఉత్తరం వ్రాయాలని ఉంది నాకు. కానీ రోజు మంచిది కాదు. మనం రాసినవేళా-వాళ్ళందుకున్న వేళా కూడా మంచిది కావాలి. అందుకే ఉత్తరం రాయను. మంచిరోజు చూసి నేను బయల్దేరి వెడతాను. మంచి ఘడియల్లోనే వాళ్ళను కలుసుకుంటాను. తాంబూ లాలకు ఆహ్వానిస్తాను. దాంతో పాటే కట్నం ఇచ్చేస్తాను—" అన్నాడు పార్వతీశం ఉత్సాహంగా.

మరోసారి మాలతమ్మ కూతురి అదృష్టాన్ని పొగిడింది.

సుందరికి మాటలు సుతరామూ నచ్చలేదు. ఆమెకు ఉత్సాహంగా కూడాలేదు. తల్లిదండ్రులు దేనికి వ్యతి రేకంగా ఆలోచిస్తున్నారో అదే తను చేయాలనుకుం టోంది. అందువల్ల పర్యవసానమేమిటి?

ఈ యింట్లో ఆనందాన్ని తను తుడిచిపెట్టివేస్తుందా?

సుందరికి మనఃస్థిమితంగా లేదు. ఆ రాత్రి ఓ పట్టాన ఆమెకు నిద్రపట్టలేదు. పట్టక పట్టక అర్ధరాత్రి వేళ నిద్ర

పడితే యెవరో లేపారు. ఓ పట్టాన అప్పుడామెకు మెలకువరాలేదు. విసుక్కుంది. గారాంచేసింది. గింజు కుంది. ఆఖరికామెకు లేవక తప్పలేదు. లేచి కనులువిప్పి తెల్లబోయింది.

తన్ను నిద్రలేపింది తలిదండ్రులుకాదు. ఒక అపరిచితుడు.

ఎత్తుగా, బలంగా వున్నాడు. బుగ్గమీసాలు.

"నేనెవరో తెలుసా?" అన్నాడతడు.

కంఠంలో ఆకారాని కుండవలసిన గాంభీర్యం లేదు.

సుందరి తల అడ్డంగా ఊపింది.

"పోనీ గజేంద్రసింగ్ పేరు విన్నావా?"

ఉలిక్కిపడింది సుందరి. ఆ పేరునామె విని ఉన్నది. గజేంద్రసింగ్ పేరు తెలుగుదేశంలో రెండేళ్ళుగా మారుమ్రోగిపోతున్నది.

పేరుమోసిన గజదొంగ అతడు. చాలా తెలివిగా పథకాలువేసి వేలకు వేలు, లక్షలకు లక్షలు కాజేసేవాడతడు. అతదేయింట అడుగుపెడితే ఆ యింట లక్ష్మి నిలవదు. అతడు పరమ కిరాతకుడనీ ఎలాంటి ఘోర కృత్యానికైనా వెనుదీయడనీ అంతా చెప్పుకుంటారు.

సుందరి భయంగా అతడివంక చూసింది. అప్పుడతడు ఆమె కంటికి రాక్షసుడిలా కనిపించాడు.

"నాతోరా!" అన్నాడు గజేంద్రసింగ్.

"ఎక్కడికి?" అంది సుందరి భయంగా.

"చెబుతాను. నాతోరా-" అన్నాడు గజేంద్రసింగ్.

సుందరి ఆలోచిస్తోంది. ఎవడీ గజేంద్రసింగ్. ఎందుకిక్కడికి వచ్చాడు? ఎలా వచ్చాడు?

ఆమె ఆలోచిస్తూనే అతడి ననుసరించింది.

ఇద్దరూ ఓ గదిలోకి వెళ్ళారు. అందులో రెండు కుర్చీల్లో పార్వతీశం, మాలతమ్మ బంధింపబడి ఉన్నారు.

"ఇదిగో—మీ కూతుర్ని కూడా తీసుకుని వచ్చాను" అన్నాడు గజేంద్రసింగ్ ఆమె తలిదండ్రులతో.

"ఎందుకు?" అన్నాడు పార్వతీశం.

"మీ యింట్లో నాకు పెద్దగా డబ్బేమీ దొరకలేదు. అయినా డబ్బు దొరుకుతుందని రాలేదు నేను. బ్యాంకులో ఎంత మొత్తం ఉందో నాకు తెలుసు. ఈ మధ్యనే నీకు అయాచితంగా ముప్పైఅయిదు వేలరూపాయలు వచ్చాయి. నీ దగ్గర వేరే పదిహేనువేల రూపాయలున్నాయి. అనగా మొత్తం యాభై వేలు. ఆ డబ్బు నాక్కావాలి. ఇప్పటికిప్పుడు బ్యాంకులో డబ్బు ఎలా ఇవ్వగలవు? అందుకని నేను నీకు రేపటిదాకా టైమిస్తున్నాను. నువ్వు నాకు డబ్బిచ్చేదాకా హామీగా నాతో నీ కూతుర్ని తీసుకుని వెడుతున్నాను—" అన్నాడు గజేంద్రసింగ్.

"పెళ్ళికావలసిన పిల్ల. దాన్ని నీతో తీసుకువెళ్ళకు" దీనంగా అర్థించాడు పార్వతీశం.

"పెళ్ళికావలసిన పిల్ల కాబట్టే ఈమెను తీసుకు వెళ్ళడం—" అన్నాడు గజేంద్రసింగ్ నవ్వుతూ.

"నీకీ డబ్బు ఇస్తే దాని పెళ్ళి ఆగిపోతుంది—" అంది మాలతమ్మ.

గజేంద్రసింగ్ నవ్వాడు—"ఇలాంటి కబుర్లకు నేను లొంగను. నాక్కావలసింది డబ్బు. పెళ్ళి పేరుతో ఓ యువకుడా డబ్బును దోచుకునిపోతే మీకది అభ్యంతరం లేదు. కానీ నేను తీసుకుంటే దాన్ని దోపిడీ అంటారు. అనుకోండి. కానీ ఒక్కమాట. ఈ గజేంద్రసింగ్ చేయి మంచిది. ఎలాగూ ఈ డబ్బును పిల్ల పెళ్ళికి వాడాలను

కున్నారు. ఈ డబ్బు అక్కర్లేకుండా నే పిల్ల పెళ్ళి జరిగి పోతుంది. ఈ రోజు నేనన్నాను. ఆ మాట తప్పక జరుగుతుంది. అప్పుడీ డబ్బు ఒక పెళ్ళి ఆర్భాటానికీ, ఒక కుటుంబపు విలాసాలకీ కాక ఎందరో అభాగ్యుల జీవితాలు నిలబెట్టడానికి ఉపయోగపడుతుంది—"

గజేంద్రసింగ్ తన ఆశయ సాధన గురించి ఉపన్యాస మిచ్చాడు.

దేశంలో ఎందరో దరిద్ర నారాయణులున్నారు. వారి దుస్థితిని కళ్ళారా చూస్తూ కూడా పట్టించుకోనివారు ఎందరో ఉన్నారు. అలాంటివారిని ఆదుకోనడం కోసం గజేంద్రసింగ్ పూనుకున్నాడు. అతడికి నా అన్నవారెవ్వరూ లేరు. అనుచరులెవ్వరూ లేరు. ఒక్కడంటే ఒక్కడు.

"మీ దగ్గర నేను తీసుకుంటున్న ఈ డబ్బు సత్కార్యాచరణకు చందా అన్నమాట! మీ డబ్బు నా వద్దకు చేరగానే ఎందరో అభాగ్యుల ఆశీర్వాదాలు మీకు లభిస్తాయి. మేలు జరుగుతుంది—"

"యాభై వేల రూపాయలు చందా—" అంది మాలతమ్మ.

"మా కొంప మునిగిపోతుంది. అయిదు వేలుతీసుకుని మమ్మల్ని వదిలిపెట్టు—" అన్నాడు పార్వతీశం.

"నావద్ద బేరాలుండవు...." అన్నాడు గజేంద్రసింగ్ "రేపు నువ్వు బ్యాంకుకు వెళ్ళి మొత్తం డబ్బు విత్ డ్రా చేసి చంచలా థియేటర్లో నాకు సాయంత్రం ఏడింటికి బాల్కనీ క్లాసులో అందచేస్తే — నువ్వింటికి వెళ్ళేసరికి నీ కూతురుంటుంది. నువ్వు పిచ్చి పిచ్చిగా ప్రవర్తించినా పోలీసులకు తెలియబర్చినా—నీ కూతురు ప్రాణాలతో

నిన్ను చేరదు—"

కాసేపు పార్వతీశం గజేంద్రసింగ్‌ను వేడుకున్నాడు. ఏమీ ప్రయోజనంలేదు.

సుందరి ఈ చోద్యమంతా చూస్తోంది. ఆమెకు ఏం చేయాలో పాలుపోవడంలేదు. బుర్ర బొత్తిగా పని చేయడంలేదు. ఈలోగా గజేంద్రసింగ్ ఆమెను సమీపించి ఏదో రుమాలు నామె ముక్కువద్ద బలంగా అదిమాడు. సుందరికి క్షణాలమీద స్పృహ తప్పింది. ఆమె కుప్పలా నేలకూలింది. తర్వాత అతడు అదేపద్ధతిలో పార్వతీశానికీ, మాలతమ్మకూ స్పృహ తప్పించి వాళ్ళ కట్లు విప్పి—ఇద్దర్నీ మంచంమీదకు చేర్చాడు. తర్వాత సుందరిని ఎత్తుకుని బయటకు వెళ్ళిపోయాడు.

## 4

మర్నాడుదయం మెలకువ వచ్చినాక పార్వతీశం, మాలతమ్మ రాత్రి జరిగినదంతా నెమ్మదిగా గుర్తుచేసుకున్నారు.

"ఇప్పుడేం చేయాలి? యాభై వేల రూపాయలంటే మాటలు కాదు. ఎలా వదులుకుంటాం?" అన్నాడు పార్వతీశం.

పోలీసులకు ఫిర్యాదివ్వడం గురించీ, డిటెక్టివులను నియమించడం గురించీ ఇద్దరూ కాసేపు చర్చించారు. అందువల్ల ప్రయోజనముంటుందని ఇద్దరికీ తోచలేదు.

"పేరుమోసిన డిటెక్టివులే ఇంతవరకూ అతడి ఆరా తీయలేకపోయారు. మనకంటే గొప్పవాళ్ళే అతడి దోపిడీని అరికట్టలేకపోయారు. మనవల్ల ఏమవుతుంది? చెప్పిన ప్రకారం ఆ డబ్బివ్వలేకపోతే ఆ మ్మాయి ప్రాణాలకే ముప్పు కలగొచ్చు—" అని ఇద్దరికి అనిపిం

చింది.

చివరకి పార్వతీశం చంచలా థియేటర్లో అన్నకైముకి గజేంద్రసింగ్ కి యాభై వేలూ అందచేశాడు. గజేంద్ర సింగ్ దర్జాగా డబ్బందుకుని — "ఓ పావుగంట ఆగి ఇంటికి వెళ్ళు, నీకు శుభమవుతుంది—" అన్నాడు.

పార్వతీశం అలాగే చేశాడు. ఇంటికి వెళ్ళేసరికి గుమ్మం లోనే సుందరి కనబడింది. ముందాయనకు కలిగిన సంతోష మింతా అంతా కాదు. సుందరి ఆయనకు ముఖం చూపించి వెంటనే లోపలకు వెళ్ళిపోయింది.

పార్వతీశం లోపలకు వెళ్ళాడు. భార్య చాలా దిగులుగా ఉంది. ఆమె ముఖం చూడగానే ఆయనకూ యాభై వేల సంగతి గుర్తుకొచ్చి ముఖం దిగులుగా అయి పోయింది.

"ఒకటికాదు, రెండుకాదు-యాభై వేలు! ఎవరికైనా బాధగానే ఉంటుంది. ఏం చేస్తాం? పిల్ల ప్రాణాలు నిల బడ్డాయి. అందుకే మనం సంతోషించాలి...." అన్నాడు పార్వతీశం నిస్పృహగా.

"అదికాదండీ—" అంది మాలతమ్మ.

సుందరి డబ్బుకంటే విలువైనదాన్నే పోగొట్టుకుంది. గజేంద్రసింగ్ ఆమె శీలం దోచాడు.

"ఏమిటన్నావ్?" పార్వతీశం నిలువునా కూలబడి పోయాడు.

భార్యాభర్త లిద్దరూ కాసేపు మాట్లాడుకోలేదు. ఇద్దరికీ మతిపోయినట్లు అనిపించింది.

"ఇప్పుడేమిటి చెయ్యడం?" అంది మాలతమ్మ కాసే పటికి తేరుకుని.

"వెధవ..డబ్బుకి డబ్బూ కాజేశాడు...." అన్నాడు

పార్వతీశం పళ్ళు పటపటలాడిస్తూ.

"అంతా మన దురదృష్టం. జరిగిందానికిప్పు డెవర్నో అనుకుని ఏం ప్రయోజనం? ముందేం చేయాలన్నది ఆలోచించాలి—" అంది మాలతమ్మ.

అవును. ఇప్పుడేం చేయాలి?

సుందరికి అర్జంటుగా పెళ్ళిచేయాలి. లేకపోతే ఏ ప్రమాదమైనా జరగవచ్చు.

సుందరికి అర్జంటుగా పెళ్ళిచేయాలంటే డబ్బు కావాలి. ఉన్నట్లుండి తను బికారి అయిపోయాడు. కూతురి పెళ్ళి ఎలా చేయగలడు — ఇదీ పార్వతీశం ఆలోచన.

"పోనీ ఆ అబ్బాయితో ఒకసారి మాట్లాడితే?" అంది మాలతమ్మ.

"ఏ అబ్బాయి?" అన్నాడు పార్వతీశం.

"అతడి పేరు చిన్నారావని గుర్తు...."

పార్వతీశానికి చిన్నారావూ గుర్తువచ్చాడు. అతడిని తనన్నమాటలూ గుర్తుకు వచ్చాయి.

"వాడా? వాడికీ మనకూ కులం కలవదు...."

"చెడిన పిల్లని కులంవాడెలా చేసుకుంటాడండీ-...."

"బాగుంది. చెడిందని దాని ముఖంమీద రాసుందా ఏం?"

"ఈ రోజు కాకపోతే కొద్ది నెలల్లో కనపడవచ్చు...."

"ఏమన్నావ్?" అన్నాడు పార్వతీశం.

కులం కుదరని పెళ్ళిచేయడానికి ఆయన ఇష్టపడలేదు. అవసరమైతే పిల్ల చేత మందులు మింగిద్దామని అన్నాడు.

ఆ రాత్రంతా సుందరి వేరే ఏడుస్తూ కూర్చోవడం గమనించి ఆయన తనలో తను నిట్టూర్చాడు.

రెండు రోజుల అనంతరం పార్వతీశం ఇంటికి పోలీసులు వచ్చారు. అందుకు కారణం గజేంద్రసింగ్. గజేంద్రసింగ్ ఉత్తమాయాశయాలతో దోపిడీలు, దొంగతనాలు కొనసాగిస్తున్నాడు. అతడు చేసిన ప్రతి దొంగతనం వివరమూ ప్రచురించే పత్రిక ఒకటివుంది. తన పేరుతో ఇతరులు దుష్కార్యాలాచరించకుండా ఉండడం కోసం అతడు తీసుకున్న నిర్ణయమిది. అతడివద్ద ప్రత్యేకమైన సీలు ఉన్నది. ఆ సీలును తనకు చిహ్నంగా ఉపయోగిస్తూ అతడా పత్రికకు ఉత్తరం వ్రాస్తాడు. ఉత్తరంలోని వివరాలు వార్తగా ప్రచురణ అవుతాయి.

పార్వతీశం ఇంట ఏ పద్ధతిలో దొంగతనం జరిగిందో పత్రికలో వార్తగా వచ్చింది. పోలీసులు ఆమాత్రంకోసం వచ్చి ప్రశ్నలువేసి వెళ్ళారు.

దీని గురించి పార్వతీశం ఎక్కువగా కలవరపడలేదు. అతడి దిగులంతా కూతురి భవిష్యత్తు గురించి. సుందరిని తీసుకువెళ్ళి సుమారు ఒకరోజంతా తన దగ్గరుంచుకున్నట్లు గజేంద్రసింగ్ పత్రికకు వ్రాశాడు. ఆ వార్తకిప్పుడు బహుళ ప్రచారం లభించింది.

"మీరు కులం గిలం అంటూ కూర్చోకండి-ఆ చిన్నారావు సంబంధం సిరపర్చి దీనిపెళ్ళి చేయండి—" అని మాలతమ్మ గోల పెట్టింది.

పార్వతీశం కూడా కొంత దిగివచ్చాడు. అయితే చిన్నారావుని కలుసుకుని మాట్లాడడానికాయనకు మొహమాటంగా ఉంది.

మాలతమ్మ ఈ విషయం కూతురితో చెప్పి—"అతడంటే మోజుపడ్డావుకదా-పోనీ అతడినే పెళ్ళాడవచ్చు. నీకు అతగాడితో మాట్లాడే ధైర్యముందా?" అడిగింది.

ప్రయత్నిస్తాను—అంది సుందరి. ఇదంతా దేవుడిచ్చిన వరంలాగున్నదామెకు.

## 5

"మన సమస్యకు గజేంద్రసింగ్ ద్వారా చక్కని పరిష్కారం దొరికింది. నాన్నగారు కట్నమివ్వాలనుకున్నారు. నేను నువ్వు కావాలనుకున్నాను. డబ్బు గజేంద్రసింగ్ పట్టుకుపోయాడు. నాకు నువ్వు దొరుకుతున్నావు. మన పెళ్ళికి చచ్చినట్లు పెద్దలొప్పుకుంటున్నారు—" అంది సుందరి.

"నిజంగానా?" అన్నాడు చిన్నారావు సంతోషంగా.

"ఊఁ" అంది సుందరి.

"ఇంత త్వరగా ఒప్పుకోవడం నాకు చాలా ఆశ్చర్యంగా వుంది—" అన్నాడు చిన్నారావు.

"అందుకు నేనో ట్రిక్కు చేశాను—" అంది సుందరి.

"ఏమిటది?"

"గజేంద్రసింగ్ నా శీలం దోచాడని చెప్పాను. ఏ క్షణంలో ఏ ప్రమాదం జరుగుతుందోనని మా వాళ్ళు హడిలిపోతున్నారు. వీలైనంత తొందరగా నా పెళ్ళి జరిపించేయాలని తాపత్రయపడుతున్నారు—" అంది సుందరి హాయిగా నవ్వుతూ.

ఉన్నట్లుండి చిన్నారావు ముఖం అదోలాగై పోయింది.

"అవునూ — నిన్ను వాడు కూడా తీసుకెళ్ళి ఓ రోజంతా ఉంచుకున్నాడు కదూ—" అన్నాడు చిన్నారావు సాలోచనగా.

"అవును — అదే మనకుపయోగపడింది—" అంది సుందరి.

"వాడు నిన్నేలా చూశాడు?" అన్నాడు చిన్నా

రావు.

"ఏం?" అంది సుందరి అనుమానంగా.

"ఏకాంతంలో ఉంటే నాకే నిన్నేదో చేయాలని పిస్తుంది. వాడి ప్రవర్తన గురించి—ముఖ్యంగా ఆడవాళ్ళ విషయంలో— నేను చాలా చెడ్డగా విన్నాను. అందుకని అడుగుతున్నాను—" అన్నాడు చిన్నారావు.

"యాభై వేలు పట్టుకుపోయాడని అనుకోవాలిగానీ లేని పక్షంలో ఆ గజేంద్రసింగ్ చాలా మర్యాదస్థుడని చెప్పుకోవాలి—" అంది సుందరి. అలా అంటున్నప్పుడామె కనులలో అమాయకత ప్రతిఫలించింది.

చిన్నారావు తమాషాగా నవ్వి-"నువ్వెన్ని అబద్ధాలు చెప్పినా నమ్ముతాను. కానీ గజేంద్రసింగ్ లాంటి దొంగను పట్టుకుని మర్యాదస్థుడంటే మాత్రం భరించలేను. వాడి గురించి నేను చాలా చాలా విన్నాను...." అన్నాడు.

"అయితే ఏమంటావ్?" అంది సుందరి.

"గజేంద్రసింగ్ నా ఆశలు భగ్నం చేశాడు. ఇంక నేను నిన్ను మరిచిపోక తప్పదు—" అన్నాడు చిన్నారావు.

"ఏమన్నావ్?" అంది సుందరి కోపంగా.

"నువ్వేమీ అనుకోనంటే ఒక చిన్నమాట అడుగుతాను—"

"అడుగు—" అంది సుందరి.

"గజేంద్రసింగ్ తో ఒకరోజంతా నువ్వు ఏకాంతంగా ఉన్నావంటే—నీ పవిత్రత కాపాడబడ్డం కష్టమని నా అనుమానం. అయినా నేను నిన్ను నమ్ముతాను. ఒక రాత్రి మనమిద్దరం ఏకాంతంగా ఉండే అవకాశం కల్పించు. అప్పుడు నా ప్రవర్తన ఎలా వుంటుందో, నీ

రిసాన్నిన్సు ఎలా వుంటుందో పరీక్షించుకుందాం. నన్ను నేను నిగ్రహించుకోలేకపోతే ఆ గజేంద్రసింగ్ ఎలాగూ నిగ్రహించుకోలేడని అనుకోవచ్చు. అప్పుడు బహుశా నేను నిన్ను బలవంతం చెయ్యవచ్చు. నన్ను కూడా నువ్వు ప్రతిఘటించలేని పక్షంలో ఆ గజేంద్రసింగ్‌ను ఎలాగూ ప్రతిఘటించలేకపోయావని అర్థమవుతుంది—" అన్నాడు చిన్నారావు.

"నన్ను ప్రేమిస్తున్నానంటూ నా చుట్టూ తిరిగిన నువ్వు ఈ రోజు నన్ను పరీక్షించాలనుకునే స్థితికి వచ్చావా?" అంది సుందరి నిట్టూర్చుతూ.

చిన్నారావు నిర్మొహమాటంగా చెప్పాడు.

"నువ్వెలాగైనా అను. పడతాను. మన ఏకాంతానికి ఏర్పాట్లు చెయ్యి—ప్లీజ్!" అన్నాడు.

"ఛీ—నీలాంటివాణ్ని ప్రేమించాననుకోవడంకంటె- కట్నానికి అమ్ముడుపోవడమే మంచిది—" అంది సుందరి.

"గజదొంగలో ఓ రోజంతా గడిపావు. నాతో ఏకాంతానికి బెదురుతావేం?" అన్నాడు చిన్నారావు కోపంగా.

అప్పటికి అర్థమయింది సుందరికి.

చిన్నారావు తన శీలంపాడయిందనే నమ్ముతున్నాడు. ఎలాగూ తమ వివాహం జరుగదు. ఒక్క అవకాశం ఆమె ఇవ్వరాదా అని ఆలోచిస్తున్నాడు.

"ఆ గజదొంగకున్న సంస్కారం నీకున్నదనిపించడం లేదు. వాడునన్ను ఆడదానిలా కాక అతిథిలా చూశాడు. ఓ ఆడది సాటి ఆడదాన్ని ఆదరించినట్లు ఆదరించాడు. కానీ నువ్వలా కాదు. ప్రేమ పేరుతో నిన్ను నువ్వు వంచించుకోవడమేకాక నన్ను కూడా వంచించాలను

కుంటున్నావు. నీ వం టి వా డి తో ఏకాంతం చాలా ప్రమాదం—" అంది సుందరి.

"ఇంకా నీకు ప్రమాదముందా?" అన్నాడు చిన్నారావు.

"అసలు ప్రమాదం నీలోనే ఉంది—" అంది సుందరి—"నీతో ఏకాంతం వస్తే—నేనో నువ్వో చావక తప్పదు—"

# 6

సుందరి అదృష్టవంతురాలని మరోసారి ఋజువయింది.

గజేంద్రసింగ్ కు సంబంధించిన వార్తను సత్తిబాబు చదివాడు. అందులోని వాక్యం అతడిని కదిలించింది.

"ఓ యువకుడి దోపిడీకీ, ఓ కుటుంబం విలాసానికీ ఉపయోగపడనున్న ఈ యాభై వేలూ నేను అభాగ్య జీవులకోసం ఉపయోగిస్తాను" అన్నాడు గజేంద్రసింగ్.

నిజమే — ఒక్క పెళ్ళి పేరు చెప్పి యాభై వేల రూపాయల ఖర్చు ఎందుకు? ఆర్భాటంగా పెళ్ళి జరిపితే అందువల్ల బాగుపడేది ఎవరు?

తన గురించి పార్వతీశం అంత డబ్బు కూడబెట్టాడు. ఆ డబ్బు యెలాగూ ఆయనకు నిలిచేదికాదు. తనిప్పుడాయన కూతుర్ని పెళ్ళిచేసుకుంటే ఆ డబ్బుపోయిన దుఃఖంనుంచి ఆయన తేరుకోగల్గుతాడు.

తొలిచూపుల్లోనే సత్తిబాబుకు సుందరి నచ్చింది. తండ్రి కట్నమడిగితే — పార్వతీశం ఇస్తానంటే అతడు సరేనని ఊరుకున్నాడు. కానీ ఇప్పుడా కట్నం కారణంగా ఈ పెళ్ళి ఆగిపోవడం అతడికిష్టంలేదు.

గజేంద్రసింగ్ తనని దోపిడీ దొంగతో పోల్చాడు. ఆ పోలిక సుందరిలో నాటుకుని ఉంటుంది. ఆమె తన

గురించి అలా అనుకునేందుకు వీల్లేదు.

కట్నాల పేరుతో ఆడపిల్లల తలిదండ్రుల్ని దోపిడీ చేసే గజదొంగల జాబితాలోకి తనూ చేరకూడదని సత్తిబాబుకు అనిపించింది. ఈ అభిప్రాయాన్నతడు తండ్రికి తెలియబర్చాడు.

సత్తిబాబు తండ్రి కలవరపడ్డాడు.

"మగపిల్లవాడికి తండ్రి ఆస్తిలో వాటా వస్తుంది. ఆడపిల్లకు రాదు. అందుకని కట్నం అన్న ఆచారం వచ్చింది-" అంటూ తండ్రి అతడికి నచ్చచెప్పబోయాడు.

"కొందరు తండ్రులు పిల్లలకు బాధ్యతలే తప్ప ఆస్తుల నివ్వరు. అలాంటప్పుడు ఆడపిల్ల వివాహమైనాక కూడా తండ్రి బాధ్యత తీమకోగల్గుతోందా?" అంటూ ఎదురు ప్రశ్న వేశాడు సత్తిబాబు.

సత్తిబాబు తండ్రికి ముగ్గురు మగపిల్లలు. ఆయన పిల్లలకు చదువు చెప్పించాడు తప్పితే ఆస్తి ఏమీ మిగల్చలేదు. అంతా ఉద్యోగాలు చేస్తున్నారు. ఆడపిల్లలుద్యోగాలుండి కూడా కట్నం బారినుండి తప్పించుకోలేకపోయారు. ఉద్యోగం చేస్తూ కూడా తండ్రి నెప్పుడూ ఆదుకోనూ లేదు. వాళ్ళు ఆదుకోవాలని ఆయన అనుకోనూ లేదు. పైగా ఆడపిల్ల సొమ్ము ఆశించకూడదని శాస్త్రం చెప్పేవాడు.

సత్తిబాబు మాటలకు తండ్రి ఏమీ మాట్లాడలేక పోయాడు. పార్వతీశంవల్ల మగపిల్లలకు సంక్రమించే ఆస్తి ఏమీ లేదు.

సత్తిబాబులో తండ్రిని ఒప్పించగల బలం ప్రవేశించింది.

ఫలితంగా సుందరికీ అతడికీ చాలా సింపుల్‌గా

వివాహం జరిగిపోయింది. బంధువుల్ని పిలవడానిక్కూడా సత్తిబాబు అంగీకరించలేదు.

సత్తిబాబు ఈ వివాహానికి అంగీకరించిన రోజున సుందరి ప్రత్యేకంగా చిన్నారావును కలుసుకుని చెడామడా తిట్టింది. కసితీరా మాటలంది.

"మా నాన్న చెప్పినవన్నీ నిజం. నీవంటివాడి ప్రేమ కబుర్లు నమ్మరాదు. మా సంప్రదాయం కాపాడబడింది. కుటుంబ గౌరవం నిలబడింది. ఆయన కోరిక తీరింది. నీలాంటి దుర్మార్గుడి బెడదకూడా వదిలింది. ఒక ఇంజనీరు భార్యననిపించుకోగల్గుతున్నాను. నా అదృష్టం గొప్పది" అన్నదామె.

## 7

వివాహమైన తొలిరాత్రి సుందరి భర్తను పొగడ్డంలో గడిపింది. ఆమె పొగడ్తలకు అతడు ఎంతగానో సంతోషించాడు.

మగాడికి ఓ నిజం తెలియదు. ఒక ఆడదాని పొగడ్తలతడికిచ్చే తృప్తిని ఈ ప్రపంచంలో మరేదీ ఇవ్వలేదు. ఆడది మగాణ్ని పొగడాలంటే అదేం పెద్ద కష్టంకాదు. ఆమె చాలా అల్ప సంతోషి. ఆమె కోరుకునేది కేవలం అభిమానం.

"మీ నాన్నగారు పాతికవేలు కట్నం అడిగారు. లాంఛనాలన్నారు. బంగారమన్నారు. అన్నీ కాదని మీరు నన్ను చేసుకున్నారు. మీలో ఇంత మార్పెందుకొచ్చింది?" అని ఆశ్చర్యంగా అడిగిందామె భర్తను.

"నీకోసం. అంతే!" అన్నాడు సత్తిబాబు.

తమ భావి జీవితం గురించి వాళ్ళిద్దరూ ఎన్నో పథకాలు వేసుకున్నారు. అంతా రంగుల కలలాగే వారికి

తో నున్నది.

"అల్లుడు ఏదో రోజున నానుంచి ఆ పాతికవేలూ పొందితీరుతాడు. ఇది నా జీవితాశయం—" అన్నాడు పార్వతీశం. ఆ మాటలు భర్తకు చెప్పింది సుందరి.

"నాకాయన డబ్బుమీద ఆశలేదు. నా ఆశలన్నీ నీమీదే! నీతో జీవితంమీదే!" అన్నాడు సత్తిబాబు. సుందరి చాలా సంతోషించింది.

అయితే ముందున్న ప్రమాదం గురించి ఆమెకు ఏమాత్రమూ తెలియదు.

# 8

సరిగ్గా సత్తిబాబు ఆఫీసుకు వెళ్ళిన గంటకు ఎవరో ఇంటి తలుపు తట్టారని తీసింది సుందరి. ఎదురుగా చిన్నారావుని చూసి దిమ్మెరపోయింది .

"నీ ముఖం చూస్తూనే తెలుస్తోంది. మీ కాపురం పచ్చగా ఉన్నదని...." అన్నాడు చిన్నారావు.

"ఎందుకొచ్చావ్?" అంది సుందరి అయిష్టంగా.

"నా ముఖం చూస్తే తెలియడంలా—" అన్నాడు చిన్నారావు.

ఆమె అతడిని లోపలకు రానిచ్చింది.

"న్యాయానికి మనిద్దరకూ పెళ్ళికావలసింది. నీ గురించిన నిజం తెలిసి నేను పెళ్ళిచేసుకోలేదు. తెలియక సత్తిబాబు చేసుకున్నాడు. కానీ నాకు నీమీద భ్రమ పోలేదు. ఒక్కసారి నీతో గడిపిపోదామని వచ్చాను..."

"యూ....—" అంది సుందరి.

"అలా కోపగించుకోకు. గజేంద్రసింగ్ నిన్ను రేప్ చేసిన విషయం నాకు తెలుసు. అది నీ భర్తకు చెప్పకుండా ఉండాలంటే అందుకు నీ శరీరం లంచంగా

ఇవ్వాలి—"

"అదంతా నీ భ్రమ. గజేంద్రసింగ్ కూ నాకూ ఏ విధమైన సంబంధంలేదు...." అంది సుందరి.

"అలాగే అనుకో. కానీ నేను చెప్పవలసింది నీ భర్తకు చెబుతాను. నిజానిజాలు అతడు నీ తలిదండ్రుల నించే తెలుసుకుంటాడు—...."

సుందరి ఉలిక్కిపడింది. దుర్మార్గుడైన ఈ చిన్నారావును మంచివాడనుకుని భ్రమపడి — అతడిని పెళ్ళి చేసుకోవాలనుకుని — అతడికోసం యింట్లో దారుణమైన అబద్ధం చెప్పింది. ఆ అబద్ధాన్ని తలిదండ్రులు నమ్మారు. చిన్నారావు అసలు రంగును బయటపెట్టింది. తన తలిదండ్రులు కోర్టు పక్షులు కారు. సత్తిబాబు నిలదీస్తే వారు నిజాన్ని దాచలేరు. అయితే వారనుకునే నిజం నిజం కాదు.

"ఆలోచిస్తున్నావా?" అన్నాడు చిన్నారావు.

"నిన్ను గెటౌట్ అనడానికి మాత్రం ఏ ఆలోచనా అక్కర్లేదు—...." అంది సుందరి తీవ్రంగా.

"నేను ఆశావాదిని. అప్పుడే నీ విషయంలో తొందర పడదల్చుకోలేదు. నీకు రెండ్రోజులు టయిమిస్తున్నాను. పెళ్ళికి ముందే శీలం చెడినదానివి. పతివ్రతలా కబుర్లు చెప్పకు—...." అని వెళ్ళిపోయాడు చిన్నారావు.

సుందరి ఆలోచనలోపడింది. ఆమె మనసునిండా దిగులు చోటుచేసుకుంది. ఇలా జరుగుతుందని ఆమె అనుకోలేదు.

సత్తిబాబుపైన ద్వేషంతో తను చిన్నారావును ప్రేమించనారభించింది. ఇప్పుడు సత్తిబాబును ప్రేమి

న్తూంటే చిన్నారావు ప్రతిబంధకమయ్యాడు.

చిన్నారావులో దృఢ నిశ్చయం కనబడుతోంది.

అతడికి లొంగిపోతే.

ఊహే వెగటుగా తోచిందామెకు. యెవరైనా చిన్నారావును చంపేయగలిగితే బాగుంటుంది. తనే ఆ పనిచేస్తే!

ఇంటికి వచ్చినపుడు ఏ పాలలోనో ఇంత విషం కలిపి యిస్తే....

సుందరికి చిన్నారావును చంపాలనే ఉంది కానీ పట్టుబడిపోతానన్న భయం ఆమెను బెదిరిస్తోంది.

ఆ సాయంత్రం సత్తిబాబు ఓ విశేషంతో వచ్చాడు. అది సుందరినింకా భయపెట్టింది.

గజేంద్రసింగ్ ఓ యువతిని దారుణంగా బలవంతంచేసి చంపాడట. వార్తాపత్రికలో మొదటి పేజీలో వేశారీ వార్తను.

అది చదివి వణికిపోయింది సుందరి. గజేంద్రసింగ్‌కు స్త్రీ వాంఛ అధికమనీ దొరికిన ఆడదాన్ని వదిలిపెట్టడనీ క్రూరంగా హింసించి మరీ వదుల్తాడనీ—అతడి గురించి చాలా దారుణంగా రాశారందులో.

సత్తిబాబు ఆమెకావార్త చెప్పలేదు. అతడాఫీసు నుంచి వచ్చేటప్పుడు వార్తాపత్రిక కొని తీసుకువస్తాడు. అలాగే ఈ రోజూ తెచ్చాడు. వార్తలనామెతో చర్చించే అలవాటు అతడికి లేదు. ఇంకా పెళ్ళయిన కొత్త. సత్తిబాబుకు పెళ్ళాంతో సరదాగా గడిపే దెలాగో తెలుసు.

తనకుతానై ఆ వార్త గురించి చర్చించే ఉద్దేశ్యం

సుందరికి లేదు. భర్త నా వార్త అంతగా ఆకర్షించక పోవడం కొంతలో కొంత మేలనుకుంది.

## 9

రెండ్రోజుల తర్వాత మళ్ళీ చిన్నారావామెను కలుసుకున్నాడు.

"చూశావుగా నీ గజేంద్రసింగ్ చరిత్ర! ఏ కారణం వల్లనో నీ భర్తను అసలు విషయం ఆకర్షించలేదు. ఒక్కసారి అతడిలో అనుమాన పిశాచి ప్రవేశించిందంటే నీకింక జీవితాంతం నరకమే!" అన్నాడతడు.

"నన్ను వదిలిపెట్టు. నీకోసం ఇంకేమైనా అడుగు-" అంది సుందరి. ఇప్పుడామె గొంతులో ధైర్యంలేదు.

"నాకింకేమీ వద్దు. నువ్వే కావాలి—" అన్నాడు చిన్నారావు.

గెటౌట్, షటప్ లాంటి పదాలుపయోగించలేక పోయిందామె. నిస్సహాయంగా అతడివంక చూస్తూ—"జీవితాంతం నన్నిలా వేధిస్తావా?" అనడిగింది.

"జీవితాంతం వేధించను. ఒక్కసారి....ఒక్కసారి చాలు...." అన్నాడు చిన్నారావు.

అతడి మాటలు వింటూంటే అసహ్యం వేసిందామెకు. అయినా ఆ అసహ్యాన్నణచుకుని — "ఇప్పుడలాగే అంటావు...." అంది.

"నువ్వే చూస్తావుగా—" అంటూ అతడామెను సమీపించాడు.

"ఇప్పుడు వద్దు. మళ్ళీ రెండ్రోజులాగిరా" అందామె.

"ఎందుకని?"

"నా మనసేమీ బాగాలేదు. ముందు నేను మానసికంగా అందుకు సిద్ధపడాలికదా!" అన్నది సుందరి.

"నువ్వు మానసికంగా అందుకు సిద్ధపడుతున్నట్లు నాకు సాక్ష్యం కావాలిగదా!" అన్నాడు చిన్నారావు.

"అంటే?"

చిన్నారావు చటుక్కున ఆమెను దగ్గరగా లాక్కొని పెదాలను చుంబించి—"ఒక్కసారిగా మారడం నీకూ కష్టం. మన మధ్య ప్రారంభంకానున్న ప్రేమకాండకీ రోజు శంకుస్థాపన జరుగుతోంది-" అని వెళ్ళిపోయాడు.

ఒకరకమైన అసహ్యభావంతో సుందరి వళ్ళు కంపించింది. అతడిని తను వారించలేకపోతోంది.

నిజానికి తను ఏ తప్పూ చేయలేదు. వివాహానికిముందు తన శరీరం మలినం కాలేదు. కానీ ఆ విషయం భర్త నమ్మాదేమోనని తను భయపడుతోంది. ఆ కారణంగా తనిప్పుడు నిజంగా తన శరీరాన్ని మలినం చేసుకుంటోంది.

విషయమంతా భర్తకు చెబితే....?

సుందరికి ఏ మాత్రమూ ధైర్యం చాలలేదు.

అయితే ఆ సాయంత్రం భర్త తీసుకువచ్చిన వార్తా పత్రికలో గజేంద్రసింగ్ కు సంబంధించిన మరో వార్త ఉన్నది. ఆ వార్తలో ఆశ్చర్యానందాద్భుత రసాలు నిండివున్నాయి.

గజేంద్రసింగ్ నేరాలు చేస్తాడు. తనుచేసే ప్రతి నేరాన్నీ పత్రికలకు తెలియబరుస్తాడు. అతడు స్త్రీని గౌరవిస్తాడు. స్త్రీపై అత్యాచారాన్ని సహించడు. తను అత్యాచారం చేయడు సరిగదా ఎవరైనా స్త్రీపై అత్యాచారంచేస్తే వారిని క్రూరంగా శిక్షిస్తాడు. కొద్ది రోజులక్రితం తన పేరుతో ఒక అబలపైన జరిగిన అత్యాచారం అతణ్ని ఆగ్రహోదగ్రుణ్ని చేసింది. అతడా వ్యక్తిని వేటాడి, చంపి సాక్ష్యాధారాల యింట వదిలి

పోలీసులకు తరం వ్రాశాడు. తన పేరును అత్యాచారాల కుపయోగించుకునే వారికా శవం హెచ్చరిక అని కూడా చెప్పాడు.

ఈ వివరాలన్నీ చదివి సుందరి ఆనందంతో గాలిలో తేలిపోయింది.

చటుక్కున ఆమె భర్త వద్దకు తీసుకువెళ్ళి ఆ వార్త చూపించింది.

అతడది చూసి—"ఈ వార్త లేకున్నా గజేంద్రసింగ్ సచ్ఛీలతను నేను నమ్ముతాను—...." అన్నాడు.

అప్పుడు సుందరికి కలిగిన ఆశ్చర్యమింతా అంతా కాదు.

"గజేంద్రసింగ్ మీకు తెలుసా?" అన్నదామె.

"ఊఁ."

"అతడితో మీకెలా పరిచయమైంది—...." అంది సుందరి కుతూహలంగా.

"అతడు కాదు....ఆమె...." అన్నాడు సత్తిబాబు.

"అంటే?"

"దయచేసి ఈ విషయం రహస్యంగా ఉంచు...." అన్నాడు సత్తిబాబు.

ఆమె పేరు చాముండేశ్వరి. వాళ్ళది సత్తిబాబు పక్క ఇల్లు. ఆమె తండ్రి నిజాయితీకి మారుపేరుగా ఉండే ఓ ప్రభుత్వోద్యోగి. ఆ కారణంగా ఆయన అష్ట కష్టాలుపడడంకాక—అన్యాయంగా జైలుకు వెళ్ళాడు. ఆ షాక్‌కు చాముండేశ్వరి తల్లి పోయింది. జైల్లోనే తండ్రి మరణించాడు. కాలేజీలో చాముండేశ్వరికి మంచి పేరు ఉండేది. ఆమె చెయ్యెత్తు మనిషి....అన్నీ విప్లవాత్మక భావాలు. సత్తిబాబు ఆమె ఆలోచనలను సమర్థిస్తూండే

వాడు.

జీవితంలో తనకెవ్వరూ లేకుండా పోయాక ఆమె గజేంద్రసింగ్ గా మారింది. ఆరంభంలో ఆమెకు సత్తిబాబు సహాకరించాడు. ఆ తర్వాత ఆమె ఏమయిందో అతడికి తెలియదు.

"ఆమె తీవ్రంగా నిరసించే వాటిలో వరకట్న మొకటి. ఆమె వాగాడంబరీనీ అభిప్రాయాలనూ చాలా సార్లు మెచ్చుకున్నాను నేను. మీ ఇంట్లో దొంగతనం జరిగిందనగానే—నా స్నేహితురాలు నాకు బుద్ధి చెప్పి నట్లనిపించింది. అందుకే నిన్ను కట్నం లేకుండా పెళ్ళి చేసుకున్నాను—...." అన్నాడు సత్తిబాబు.

సుందరి ఆలోచనలు వెనక్కు పరుగెడుతూన్నాయి. గజేంద్రసింగ్ లో స్త్రీని వెతుకుతుందామె. ఆలోచి స్తూంటే గాంభీర్యంలేని ఆ మాట-నునుపైన ఆ చెక్కిళ్ళు ఆ నడక అన్నిట్లోనూ ఆడతనం గోచరిస్తోంది.

ఇప్పుడు చిన్నారావేం చేస్తాడు? మళ్ళీ తన దగ్గరకు వచ్చి ఇంకో రకంగా బెదిరిస్తాడా?

# 10

రెండ్రోజుల అనంతరం చిన్నారావామె వద్దకు వచ్చాడు. సుందరి అతడిని లోపలకు ఆహ్వానించి కుర్చీలో కూర్చోపెట్టి—"నిన్నెందుకు ఆహ్వానించానో తెలుసా?" అంది.

అతడు తల అడ్డంగా ఊపాడు.

"గుమ్మంలోంచే పొమ్మనాలంటే జస్టు గెటౌట్ అనాలి. లోపల అయితే నిన్ను ఇంకా ఇంకా నా ఇష్టంవచ్చిన మాటలన్నీ అని తిట్టొచ్చు—...." అంది

సుందరి.

చిన్నారావు కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు.

"మరి—నీకు నేనెందుకు వచ్చానో తెలుసా?" అన్నాడతడు.

సుందరి చిరాగ్గా—"తెలుసు—" అంది.

"నీకు తెలియదు...." అన్నాడు చిన్నారావు. అతడు చటుక్కున వంగుని ఆమెకు పాదాభివందనం చేసి-"జరిగిందంతా మర్చిపో. ఈ క్షణంనుంచీ నువ్వు నాకు తల్లితో సమానం—" అన్నాడు.

సుందరి భ్రాంతిపడిపోయింది.

"ఒక గజ దొంగ—సమాజ విద్రోహిగా పరిగణించబడిన వ్యక్తి—తనమీద అత్యాచార నేరం మోపబడితే సహించలేకపోయాడు. ఆ నేరం మోపిన వ్యక్తిని క్రూరంగా శిక్షించాడు. తను నిర్దోషినని నిరూపించుకున్నాడు. అలాంటిది సమాజంలో మంచివాడుగా పరిగణించబడాలనుకుంటున్న నేను నీ మీద అత్యాచారం తలపెడితే—అప్పుడు సమాజంలో నా స్థానం ఏమిటి? గజదొంగకంటె హీనమవుతాను. గజేంద్రసింగ్ నా కళ్ళు తెరిపించాడు. స్త్రీ పట్ల నా బుద్ధిని మార్చాడు...." అన్నాడు చిన్నారావు.

సుందరి అతడి వంక తెల్లబోయి చూస్తోంది.

"నువ్వు దేవతవు. నేను నీకు తగనివాడిని. అందుకే భగవంతుడు నాలో ఆ అనుమానాన్ని సృష్టించాడు. నాకు తగిన శాస్తి జరిగింది...." అన్నాడు చిన్నారావు.

సుందరి ఏమీ మాట్లాడలేదు.

చిన్నారావు వెళ్ళిపోయాడు.

సుందరి సత్తిబాబు గురించి ఆలోచిస్తోంది. గజేంద్ర గత చరిత్ర తెలిసి ఉండకపోతే సత్తిబాబు తనను పెళ్ళి చేసుకుని ఉండేవాడా?

ఈ ప్రశ్నకామెకు సరైన జవాబు దొరకలేదు.

గజేంద్రసింగ్‌ను పోలీసులెందుకు పట్టుకోలేపోతున్నారో మాత్రం ఆమెకు స్ఫురించినట్లుంది.

—:అయిపోయింది:—

# బ్లాక్ టైగర్

**వాణిశ్రీ**

పెళ్ళివారిళ్ళు సందడిగా వుంది.

భూపతిరావు పెద్ద కూతురు పెళ్ళి రాత్రి రెండు గంటలకు జరుగబోతోంది.

భూపతిరావు గుంటూరులో కోటీశ్వరుడు. పొగాకు ఎగుమతి వ్యాపారంలో బాగా గడించాడు. ఆయనింట్లో తొలిసారిగా జరుగుబోతున్న పెళ్ళి ఎంత వైభవంగా జరగాలో అందుకు తగిన ఏర్పాట్లు జరుగుతున్నాయి. పెళ్ళి కళ్యాణ మండపంలో కాకుండా తన ఇంట్లోనే ఏర్పాట్లు చేశాడు. ఆయన పొగాకు కంపెనీలో పనిచేసే స్టాఫ్ అంతా పెళ్ళి పనులలో బిజీగా వున్నారు.

మధ్యాహ్నం ఒంటి గంటయింది. పెళ్ళికి వచ్చిన బంధువులంతా క్రింద విశాలమైన హాల్లో భోజనం చేస్తున్నారు.

భూపతిరావు మూడో అంతస్థులో వున్న తన ప్రైవేట్ గదిలో కూర్చుని వున్నాడు.

టెలిఫోన్ మ్రోగింది.

భూపతిరావు రిసీవర్ ఎత్తి "యస్. భూపతి స్పీకింగ్" అన్నాడు.

"మిస్టర్ భూపతీ! నేను బ్లాక్ టైగర్ ని మాట్లాడుతున్నాను."

భూపతి చిరాకుపడ్డాడు.

"బ్లాక్ టైగరా? అదేం పేరు? ఏం కావాలి నీకు?"

ఫోన్ లో వికటాట్టహాసంలాంటి నవ్వు వినిపించింది. భూపతికి ఆ నవ్వు వింటూంటే ఎందుకో భయం కలిగింది.

"ఏమిటా నవ్వు? నువ్వెవ్వరివో చెప్పు" ధైర్యం తెచ్చుకుంటూ అన్నాడు భూపతి.

"బ్లాక్ టైగర్ని ఎరగవా మిస్టర్ భూపతీ. మాదొక ఇంటర్నేషనల్ ముఠా. పెళ్ళివారి బస్సులు దోపిడీ చెయ్యడం మా స్పెషాలిటీ. పేపర్లో చదవలేదా? వారం క్రితమే తిరుపతి వెళ్తున్న పెళ్ళివారి బస్సు, శ్రీశైలం దారి దోపిడీ చేసింది మేమే!"

భూపతి గుండె జారింది ఆ మాటలు వింటూనే.

"అయితే ఏమంటావ్?" నీరసంగా అన్నాడు.

"జాగ్రత్తగా విను. ఈ రోజు రాత్రి రెండు గంటల పన్నెండు నిమిషాలకు మీ పెద్దమ్మాయి పెళ్ళి జరుగబోతున్నది. హైదరాబాద్ నుంచి పెళ్ళికొడుకు బంధువులు వస్తున్నారు. సూపర్ డీలక్స్ బస్ ఎ. పి. టి. 9999, పదినిమషాల క్రితం బంజారా హిల్స్ లో మీ వియ్యంకుడి భవనంనుంచి బయల్దేరింది. ఆ బస్ సీటింగ్ కెపాసిటీ యాభైఐదు. అందులో బస్ తాలూకు వాళ్ళు ఇద్దరు. ముప్ఫైఒక్కమంది ఆడవాళ్ళు, ఇరవైరెండుమంది మగవాళ్ళు ప్రయాణం చేస్తున్నారు."

"ఇంతకీ నువ్వు చెప్పేది ఏమిటి?" భూపతి ఆయాస పడుతున్నాడు.

"ఇంకా అర్థంకాలేదా భూపతీ. పెళ్ళి బస్సులు దోచెయ్యడం మా స్పెషాల్టీ అని చెప్పానుకదా. పెళ్ళి వారి బస్సు దోచెయ్యడం మా పని. ఆ బస్సులో ఆడవాళ్ళ నగలు దోచేస్తే కనీసం పది లక్షలు మాకు ముడుతుంది."

"బస్సు యెలా దోచేస్తావ్? వాళ్ళు వస్తున్నది నేషనల్ హైవే. పైగా పట్టపగలు" అన్నాడు భూపతి ధైర్యం తెచ్చుకుంటూ.

"అదా నీ ధైర్యం? నువ్వనుకుంటున్నట్లు వాళ్ళు గుంటూరు నేషనల్ హైవేలో రావడంలేదు. అడవి రూట్‌లో వస్తున్నారు."

"వాట్?" అదిరిపడ్డాడు భూపతి.

"యస్ భూపతీ. ఆ బస్సులో మా ముఠావాళ్ళు ముగ్గురు మీ బంధువుల్లో కల్సిపోతున్నారు. బస్సు విజయవాడ మీదుగా కాకుండా నాగార్జునసాగర్ మీదుగా వచ్చేటట్లు అందర్నీ ఒప్పించారు. ఆడవాళ్ళు నాగార్జున సాగర్‌లో అరగంట ఆగిపోతున్నారు. సైట్ సీయింగ్ కోసం. మిస్టర్ భూపతీ నీకు తెలుసో లేదో హైదరాబాద్ నుంచి మాచెర్ల వరకూ అంతా అడవి దారి. పెద్దగా ట్రాఫిక్ వుండదు."

"వాట్ నాన్సెన్ యూ ఆర్ టాకింగ్."

"భూపతీ అనవసరంగా ఆవేశపడకు. నీకు బి.పి. వుందని మాకు తెలుసు. ఆవేశపడితే కూతురి పెళ్ళి చూడకుండానే చస్తావ్?"

"నన్నేం చెయ్యమంటావ్?"

"అలా దారికిరా! నాకు ఐదులక్షలు కావాలి. డబ్బు సిద్ధంచేస్తే ఎలా అందజేయాలో తర్వాత చెప్తాను."

"ఐదు లక్షలా?" భూపతి నిర్ఘాంతపోయాడు.

"ఐదు లక్షలు నీకొక లెక్క కాదు. ఆలోచించుకో. లేకపోతే పెళ్ళివారి బస్సు గుంటూరు చేరకుండానే మధ్యలో పేలిపోతుంది. మావాళ్ళు బస్సులో వున్నారు. రహస్యంగా వైర్‌లెస్‌ద్వారా నాతో మాట్లాడే ఏర్పాటు చేశాను.

నువ్వు డబ్బు ఇవ్వడానికి ఒప్పుకోకపోతే ఏం జరుగుతుందో తెలుసా? నా మనుషులు బస్సు దిగిపోతారు టైంబాంబ్ పెట్టి. పది నిముషాల్లో అది పేలిపోతుంది. చచ్చినవాళ్ళ నగలు ఏరుకొని మావాళ్ళు పారిపోతారు. అలా వీలుకాకపోతే బస్సు మధ్యలో ఆపి ఆడవాళ్ళ దగ్గర నగలు దోచుకుని పోతారు. అదంతా పరిస్థితినిబట్టి జరుగుతుంది.

ఇంతకీ డబ్బు ఇవ్వడానికి ఒప్పుకుంటావో లేదో ఆలోచించుకో. గంట తర్వాత మళ్ళీ ఫోన్ చేస్తాను. ఈ లోపల నువ్వు పోలీసులకు రిపోర్టుచేశావంటే జాగ్రత్త. నీ ఇంట్లో కూడా నా మనుష్యులు వున్నారు. నీ చర్యలన్నీ గమనిస్తుంటారు. జాగ్రత్త."

భూపతి నీరసంగా రిసీవర్ క్రెడిల్ చేశాడు.

బీర్ బాటిల్ ఎత్తి గటగట తాగేశాడు.

నౌకరు ఆశ్చర్యంగా చూశాడు.

## 2

భూపతి మనసు మొద్దుబారిపోయింది. హఠాత్తుగా ఏమిటీ పీడవచ్చి పడింది. కలలో కూడా అనుకోలేదు. ఈ దోపిడీముఠా చేతుల్లో చిక్కుకుంటాడని.

బ్లాక్ టైగర్ ఎవడోగాని వీడిది పెద్ద గ్యాంగులా వుంది. హైదరాబాద్‌లో బస్సు బయల్దేరటం, దాని నెంబరు, అందులో వున్న వాళ్ళ వివరాలు అన్నీ కరెక్టుగా చెప్తున్నాడు. ఇప్పుడేది దారి?

భూపతి గదిలోనుంచి బైటకు వచ్చాడు. ఒక్కటా? రెండా? ఐదు లక్షలు. వృధాగా వాడి మొఖాన ధార పొయ్యాలా? తప్పుకునే మార్గం లేదా? పోలీసుల సహాయం తీసుకుంటే? తన చర్యలన్నీ వాడి మనుషులు కనిపెడతారని హెచ్చరించాడు. అంటే తన ఇంట్లో గూడా వాళ్ళు వున్నారన్నమాట. 'ఓ మైగాడ్' అంటూ కణతలు నొక్కుకున్నాడు.

అతని బుర్ర చురుగ్గా పనిచేస్తోంది. రెండో అంతస్థు లోకి దిగాడు. అక్కడ కొందరు డెకరేషన్ బట్టలు అలంకరిస్తున్నారు. ఆడవాళ్ళు హడావుడిగా తిరుగుతున్నారు. క్రిందకు దిగాడు. పందిట్లో ఎవరి పని వాళ్ళు చేస్తున్నారు.

పందిట్లో పెళ్ళి మండపం కట్టేవాళ్ళు కొందరు, స్తంభాలకి అరటిబోదులు అలంకరిస్తున్న వాళ్ళు, లైటింగ్ అరేంజ్‌మెంట్స్ చేస్తున్న ఎలక్ట్రికల్ వాళ్లు, అందరివంకా కంగారుగా చూస్తున్నాడు భూపతి. వీళ్ళల్లో బ్లాక్ టైగర్ గాడి మనుష్యులెవరో ఎట్లా తెలుస్తుంది?

తను వెంటనే యస్పీకి ఫోన్ చేసి ఈ విషయం చెప్పాలి. ఐదు లక్షలు వదులుకోవడమా? అసంభవం. భూపతి కళ్ళు అతని భార్య రుక్మిణికోసం వెతుకుతున్నాయి. ఎవరికీ ఏమీ చెప్పకుండా అతను భార్యకోసం ఇల్లంతా గాలించాడు.

ఎట్టకేలకు రుక్మిణి కన్పించింది. పెళ్ళికూతురు వున్న గదిలో నగలు సరిచేస్తూ వుందామె.

"రుక్మిణీ ఇలారా!" అన్నాడు. పిలుస్తూనే అతని కళ్ళు గిరగిరా తిరుగుతున్నాయి. ఆ గదిలో తనకు పరిచయం లేని ఆడవాళ్ళు గూడా వున్నారు. అందులో యెవరైనా బ్లాక్ మైగర్ ఏజెంట్స్ ఉన్నారేమో?

"ఏమిటండీ?" అంటూ దగ్గరగా వచ్చింది ఆమె.

"అందరికీ పిలుపు వెళ్ళినట్లేనా?" అన్నాడు.

"లిస్టు ప్రకారం అందరికీ కార్డులు పంపించాము. రాత్రికి భోజనానికి రమ్మని పిలిచి వచ్చాము" అందామె.

"పచ్చిపులుసు వాళ్ళని పిలిచావా?"

"పచ్చిపులుసు వాళ్ళెవరండీ?"

"అయ్యో పచ్చిపులుసు వాళ్ళెవరో తెలీదా?" అన్నాడు.

"ఊహూం...." అందామె తల వూపుతూ.

"వాళ్ళని పిలవకపోతే బాగుండదు. నువ్వు స్వయంగా వెళ్ళి పిల్చి రావాలి. పద....పద...." అన్నాడు భూపతి.

"ఇప్పు డెలా కుదురుతుందండీ? ఎవరికైనా కార్డు యిచ్చి పంపండి. నాకు వీల్లేదు. రాత్రికి పెళ్ళి పెట్టుకుని నన్ను వెళ్ళమంటారేమిటి ఖర్మ!" అంది రుక్మిణి విసుక్కుంటూ.

"వీల్లేకపోవడం ఏమిటి? కార్లో ఎంత సేపట్లో వెళ్ళి రావాలి, పద....పద...." అంటూ ఆమె జబ్బ పట్టుకున్నాడు.

"ఛీ.... చెయ్యి వదలండి. అందరూ చూస్తున్నారు. ఏమిటి అసహ్యంగా" అని ఆమె సిగ్గుపడుతూ అతని చేతిని వదిలించుకుంది.

గదిలోని ఆడవాళ్ళు ముసిముసి నవ్వులు నవ్వు తున్నారు.

భూపతి ఎవరూలేని గదిలోకి ఆమెను తీసికెళ్ళి తలుపు మూశాడు. కిటికీ దగ్గర యెవరూ లేరని నిశ్చయించు కున్నాక భార్య దగ్గరికి వచ్చాడు. భర్త చర్యలు ఆమెకు ఆశ్చర్యం కలుగజేస్తున్నాయి.

"కొంప మునిగింది" అన్నాడు భూపతి నెమ్మదిగా.

"ఏం జరిగింది?" ఆందోళనతో ప్రశ్నించింది రుక్మిణి.

భూపతి బ్లాక్ టైగర్ ముఠా చేస్తున్న బ్లాక్ మెయిల్ గురించి వివరంగా చెప్పాడు.

"ఇప్పుడేం చెయ్యాలి?" అంటూ రుక్మిణి ఒక సోఫాలో కూలబడిపోయింది.

"అలా భయపడకు."

"భయం ఏమిటండీ. నా గుండె దడగా వుంది. ఏమండీ ఈ పెళ్ళి జరుగుతుందా? చెప్పండి. కొంపదీసి వాళ్ళు ఆ బస్సును ప్రేల్చివేస్తారా?" రుక్మిణికి దుఃఖం ముంచుకొచ్చింది.

"అలా బెంబేలు పడకు! ఇలాంటప్పుడే ధైర్యంగా వుండాలి. నేను వుపాయం ఆలోచిస్తున్నాలే."

"డబ్బుకోసం చూడకండి బాబూ! వెధవ డబ్బు వాళ్ళ మొఖాన కొట్టి పీడ వదిలించుకోండి. ఏదైనా జరిగి పెళ్ళి ఆగిపోతే ఏమైనా వుందా?"

"ష్....గట్టిగా మాట్లాడకు. మన యింట్లో కూడా వాడి ఏజెంట్లు వున్నారట. మనం ఏం చేస్తున్నామో వాళ్ళకి తెలీకుండా చెయ్యాలి."

రుక్మిణి మాట్లాడలేదు. ఆమె ముఖం చెమటలు క్రక్కుతోంది.

# 3

కారు వేగంగా పోతోంది.

రుక్మిణి మనసు కారుకన్నా వేగంగా ఆలోచిస్తోంది. ఆమె కళ్ళు స్థిరంగాలేవు. చుట్టుప్రక్కల గమనిస్తోంది. తమ కారుని ఎవరైనా ఫాలో అవుతున్నారేమోనని తల తిప్పి వెనక్కి చూస్తోంది.

కారు యస్పీగారి బంగళాలోకి వెళ్ళి పోర్టికోలో ఆగింది. రుక్మిణి డోర్ తెరుచుకుని వెళ్ళింది. యస్పీగారు భోజనం చేస్తున్నారని కబురు వచ్చింది. నీరసంగా సోఫాలో కూలబడింది.

కొంచెంసేపటికి యస్పీగారి భార్య వచ్చి నవ్వుతూ పలకరించింది.

"నిన్ననే పెళ్లికి పిల్చి వెళ్ళారుగా. కార్డు గూడా ఇచ్చారు. మళ్ళీ వచ్చారేమిటి? మర్చిపోయారా ఏమిటి?" అంది ఆమె.

"అందుకు కాదండీ నేను వచ్చింది. యస్పీగారితో మాట్లాడాలి. ఒక కేసు విషయం" అంది రుక్మిణి.

"రాత్రికి పెళ్ళి పెట్టుకుని ఏదో కేసు గురించి మాట్లాడ్డానికి వచ్చారా? భలేవారే మీరు. ఫోన్ చేస్తే సరిపోయేదిగా. అనవసరంగా శ్రమపడ్డారు" అంది యస్పీగారి భార్య.

"ఫోన్ చేసే విషయం కాదండీ. ఇప్పుడు గొప్ప చిక్కులో పడ్డాము. పెళ్ళి ఆగిపోయేటట్లుంది" రుక్మిణి గొంతు హీనంగా పలికింది. ఆమె కళ్లలో నీళ్ళు తిరుగుతున్నాయి. ముఖంలో కళాకాంతులు ఏ కోశానాలేవు.

యస్పీగారి భార్య ఆశ్చర్యపోయింది.

"పెళ్ళి ఆగిపోయేటట్లుందా? ఏం జరిగింది?"

ప్రశ్నించింది.

ఇంతలో యస్పీగారు వచ్చారు.

"యేమండీ ఇప్పుడొచ్చారేమిటి? పెళ్ళికి యెవరైనా సినీ యాక్టర్స్ వస్తున్నారా? బందోబస్తుకి పోలీసులు కావాలా?" నవ్వుతూ అన్నాడు.

రుక్మిణి నమస్కారం చేసి "మేము పెద్ద చిక్కులో పడ్డాము. మీరే రక్షించాలి" అంది. ఆమె ముఖం దీనంగా వుంది.

యస్పీగారు ఆశ్చర్యపోతూ "యేం జరిగింది?" అన్నాడు.

"పెళ్ళి బస్సుల్లో ఆడవాళ్ళ నగలు, డబ్బు దోచుకునే ముఠా కళ్ళు మామీద పడ్డాయండీ. తిరుపతి దారిలో, శ్రీశైలం ఘాట్ రోడ్డులో బస్సుల్ని దోచుకున్న ముఠా బ్లాక్ టైగర్ వాళ్ళు మమ్మల్ని బ్లాక్ మెయిల్ చేస్తున్నారు."

"ఏమిటీ?" అంటూ యస్పీ ఆశ్చర్యం వెలిబుచ్చాడు.

"అవునండీ. మావార్ని ఐదు లక్షలు డిమాండ్ చేస్తున్నారు. డబ్బు ఇవ్వడానికి సిధపడకపోతే బస్సుని పేల్చివేస్తారట టైంబాంబ్ పెట్టి. అందులో మాకాబోయే అల్లుడున్నాడు. ఇక పెళ్ళి ఎలా జరుగుతుంది?" రుక్మిణికి దుఃఖం ముంచుకొచ్చింది.

"అరెరె ...యేడవకండి. ధైర్యంగా వుండండి. ఏమీ అశుభం జరుగదు. బ్లాక్ టైగర్ గాడి ఆట కట్టిస్తాను. వివరంగా చెప్పండి. వాడు ఇంకా యేమేం చెప్పాడు."

"పెళ్ళికొడుకుని పిల్చుకునిరావడానికి మా పెద్దబ్బాయి రమేష్ని హైదరాబాద్ పంపాము. పెళ్ళికి తరలిరావ

డానికి వాళ్ళు సూపర్ డీలక్స్ బస్ మాట్లాడుకున్నారట. విజయవాడమీదుగా రమ్మని గట్టిగా చెప్పాము. కాని బ్లాక్ టైగర్ మఠావాళ్ళు పెళ్ళిపార్టీలో ఎలా కలిశారో తెలీదు. నాగార్జునసాగర్ చూసుకుంటూ వెళ్దామని వాళ్ళని ప్రలోభ పెట్టి రూట్ మార్చారు."

"అయితే పెళ్ళివారు సాగర్ మీదుగా వస్తున్నారన్నమాట."

"అలాగని వాడు ఫోన్‌లో చెప్పాడు. బస్ నెంబర్ గూడా చెప్పాడండీ. ఏ.పి.టి. 9999. డబ్బు ఇవ్వకపోతే బస్సులో ఆడవాళ్ళ నగలు దోచుకుంటామనీ, వీలుకాకపోతే టైమ్‌బాంబ్ పెట్టి పేల్చి వేస్తామని బెదిరిస్తున్నాడు."

"ఐ.సీ."

"అందులో మా పెద్దబ్బాయి రమేష్‌గూడా వున్నాడండీ! మీరు యెలాగయినా వాళ్ళను రక్షించాలి" అంది ఆమె యేడుస్తూ.

"యేడవకండి. ధైర్యంగా వుండండి. యెటువంటి అనర్థమూ జరక్కుండా మేము చూసుకుంటాముగా."

"పోలీసులకు చెప్తే జాగ్రత్త అని గూడా అన్నాడటండీ. పైగా మీరేం చేస్తున్నా మా యేజెంట్స్ కనిపెడుతూ వుంటారు. మీ యింట్లో మా యేజెంట్స్ వున్నారని చెప్పాడట."

"యేం ఫరవాలేదు. మీవాళ్ళ బస్సుకి ఎస్కార్టు యేర్పాటుచేయిస్తాను" అని హామీ ఇచ్చారు యస్పీగారు.

రుక్మిణికి కొంచెం ధైర్యం వచ్చింది.

"మీ వియ్యంకుడిగారి హౌస్ యెక్కడ? ఫోన్ నెంబర్ వుందా?"

"ఆయన పేరు రఘుపతిరావుగారు. ఫోన్ నెంబరు వుంది" అంటూ రుక్మిణి హేండ్ బాగ్ తెరచి అడ్రస్, ఫోన్ నెంబర్ ఇచ్చింది.

టెలిఫోన్ రిసీవర్ ఎత్తి హైదరాబాద్ కి ఎస్.టి.డి. చేశాడు. ఎవరో ఫోన్ ఎత్తారు.

"హలో ఎవరు మాట్లాడేది? రఘుపతిరావుగారిల్లు. అవునా?"

"అవునండి. రఘుపతిరావుగారిల్లే. ఎవరండి మీరు?"

"నేను గుంటూరునుంచి మాట్లాడుతున్నాను. ఆయన ఇంట్లో వున్నారా?"

"లేరండి. ఆయన గారి అబ్బాయిగారి పెళ్ళి కదండీ. ఇంటికి లాక్ చేశారండి. అంతా బస్సులో వెళ్ళిపోయారండి."

"ఎవరు నువ్వు?"

"నేనండీ. వాచ్ మెన్ నండి."

"బస్సులో బయల్దేరి ఎంత సేపైంది?"

"ఒంటిగంటకు బయల్దేరారండి."

"బస్సు నెంబరు తెలుసా నీకు?"

"ఆఁ తెలుసండి. ఇక్కడ కాగితంమీద రాసివుందండి. వుండండి చెప్తాను. ఏ.పి.టి. నాలుగు తొమ్మిదులండి."

"సరే. ఇక ఫోన్ పెట్టెయ్."

యస్పీ ఫోన్ పెట్టేశాడు.

రుక్మిణి ఆదుర్దాగా చూస్తోంది.

"బ్లాక్ టైగర్ గాడు చెప్పిన వివరాలు కరక్టే. మీరేం భయపడకండి. నేను ఐ.జి. గారితో మాట్లాడి బస్సుకి ఎస్కార్టు అరేంజి చేయిస్తాను. బస్సులో గూడా

తుపాకులున్న పోలీసుల్ని యెక్కిస్తాను. వాడిక ఏం చెయ్యలేడు" అన్నాడు యస్పీ.

"బస్సులో వాడి తాలూకు ...."

రుక్మిణి మాటలకు అడ్డువస్తూ "బస్సులో అందర్నీ చెక్ చేయిస్తాము. మీరు భయపడకండి. ఎవరి దగ్గరయినా పిస్టల్స్‌గాని, బాంబులుగాని వున్నట్లయితే వెంటనే అరెస్టు చెయ్యమని ఆర్డర్స్ ఇచ్చి పంపిస్తాం. సూట్‌కేస్‌లు, బ్యాగ్స్ అన్నీ వెతకమని, ఎవర్నీ స్పేర్ చెయ్యవద్దనీ ఇన్‌స్ట్రక్షన్ ఇప్పిస్తాము. మీరు నిశ్చింతగా వెళ్ళండి. నేను అప్పుడప్పుడు ఫోన్ చేస్తాను. మీవారికి అయన్ని ధైర్యంగా వుండమని చెప్పండి" అన్నాడు యస్పీ.

"భయపడకండి రుక్మిణిగారూ. వెళ్ళి మీ పనులు చూసుకోండి" అంది యస్పీగారి భార్య.

రుక్మిణికి ధైర్యం చాలడం లేదు. దిగులు ఆమె ముఖంలో గూడు కట్టుకుని వుంది.

"నేను ఇప్పుడే ఐ.జి.గారితో మాట్లాడుతున్నాను. పెళ్ళివారి బస్సు క్షేమంగా వస్తుంది. మీరు వెళ్ళండి" అని యస్పీ ఆమెకు ధైర్యం చెప్పాడు.

యస్పీ రిసీవర్ ఎత్తాడు.

రుక్మిణి జారిపోతున్న ధైర్యం కూడగట్టుకుని ఇంటికి బయల్దేరింది.

## 4

భూపతిరావు ధైర్యం తెచ్చుకోవడానికి విస్కీ సేవిస్తూ కూర్చున్నాడు. ఎంత ధైర్యంగా వుండాలనుకున్నా సాధ్యపడడంలేదు. శుభమా అని తొలిసారిగా ఈ ఇంట్లో పెళ్ళి జరుగబోతుంటే ఈ బ్లాక్ టైగర్ గాడి గొడవ ఏమిటి? కొంపతీసి బస్సులో బాంబ్ పేలితే...?

భూపతికి అదంతా వూహించడానికి మనస్కరించడం లేదు. అందులో తన పెద్ద కొడుకు కూడా వున్నాడని గుర్తు రాగానే గుండె జారిపోతున్నది.

టెలిఫోన్ మ్రోగింది.

వణుకుతున్న చేతులతో రిసీవర్ ఎత్తి "హలో...." అన్నాడు నెమ్మదిగా.

"మిష్టర్ భూపతీ. నా హెచ్చరికలు నువ్వు లెక్క చెయ్యటంలేదు. బ్లాక్ టైగర్ మాటంటే అంత నిర్లక్ష్యమా నీకు. కాచుకో నా దెబ్బ!"

"నేనేం చేశాను...." భూపతి గొంతు వణికింది.

"చేసిందంతా చేసి, ఇంకా ఏం చేశానని అడుగుతున్నావా? నీ భార్యను పోలీసుల దగ్గరకి పంపావా లేదా?" ఫోన్‌లో హూంకరింపు వినపడింది.

భూపతిరావు నెత్తిన ఎవరో సుత్తితో కొట్టినట్లు అదిరిపోయాడు.

"మాట్లాడవేం భూపతిరావ్? నీ గుట్టు కనిపెట్టాననా?"

"లేదు.... లేదు. నేను పోలీసుల దగ్గరకి పంపలేదు."

"మరెక్కడికి పంపావ్?"

"పెళ్ళి పిలుపుకి."

ఫోన్‌లో పక, పక నవ్వు వినిపించింది.

"నాకు మస్కా కొట్టాలని ప్రయత్నించకు మిష్టర్ భూపతిరావ్? నీ ప్రతి కదలికా ఎప్పటికప్పుడు తెలుసుకుంటున్నాను నేను. ఇంతకీ డబ్బు సంగతి ఏంచేశావ్? టైమ్ రెండయింది. మీ పెళ్ళివారి బస్సు ఇబ్రహీం పట్నం దాటింది."

"అంత డబ్బు ఒక్కసారిగా ఎక్కడ తెమ్మంటావు

చెప్పు?"

"నువ్వు తల్చుకుంటే ఐదు లక్షలు పెద్ద లెక్కలోది కాదు. నేనేం నీ ఆస్తి ఇమ్మనడంలేదు. ఆఫ్టరాల్ ఫైవ్ లాక్స్. నువ్వు ఇన్కమ్‌టాక్స్ ఎగ్గొట్టినదాంట్లో ఇది ఎన్నోవంతో ఆలోచించు. డబ్బివ్వడానికి ఏడ్చి చస్తున్నావేం? నీ తాత సంపాదించి పెట్టిపోయిన సొమ్మేం కాదులే. అంతా ప్రజలనుంచి దోచుకున్నదే కదా!"

"మరీ అన్యాయంగా మాట్లాడకు."

"న్యాయం ఏదో అన్యాయం ఏదో ఈ బ్లాక్ టైగర్‌కి బాగా తెలుసు. డబ్బు సిద్ధంచేశావా లేదా?"

"ఎలా చెయ్యమంటావ్ చెప్పు? ఆడపిల్ల పెళ్ళి చేస్తున్నాను. పది లక్షలు కట్నం ఇచ్చాను. పెళ్ళికి రెండు లక్షలు ఖర్చు. ఇప్పుడిక నా దగ్గర డబ్బు ఎక్కడ వుంటుంది చెప్పు?" భూపతిరావు బ్రతిమాలుతున్న ధోరణిలో చెప్పాడు.

"మిస్టర్ భూపతిరావ్! నీ బిజినెస్ నా దగ్గర కాదు. కల్లిబొల్లి మాటలు చెప్పి నన్ను మోసం చెయ్యాలని చూస్తున్నావ్! ఎలాగో టైమ్ పాస్ చెయ్యాలని నీ ప్లాన్."

"నో....నో..మిస్టర్ బ్లాక్ టైగర్. నాకా వుద్దేశ్యం లేదు. అంత డబ్బు ఇచ్చుకోలేను. నా దగ్గర లేదుకూడా? మరొకమాట చెప్పు."

"అలాగా. ఐతే బ్యాంక్ బాలన్స్ లేదంటావ్,"

"ముమ్మాటికీ లేదు."

"మరి ఇంకా ముగ్గురాడపిల్లలకు పెళ్ళిళ్ళు యెలా చేస్తావ్?"

"వాళ్ళకి టైముందిగదా. ఈ లోపున సంపా

దిస్తానుగా."

"మరి, స్విస్ బ్యాంక్‌లో దాచిన డబ్బు సంగతి ఏమిటి భూపతిరావ్?" పకపక నవ్వు వినిపించింది.

భూపతిరావు అవాక్కయిపోయాడు.

తను బ్లాక్ మనీ స్విస్ బ్యాంక్‌లో దాచిన విషయం ఎలా తెలిసింది. వీడెవడో తన గురించి ఏ టూ జడ్ తెలుసుకుని ప్లాన్ చేశాడు. అతని గొంతు ఎండిపోయింది. నోటివెంట మాటరావడంలేదు.

"మాట్లాడవేం మిస్టర్ భూపతిరావ్?"

"స్విస్ బ్యాంక్ సంగతి నీకెలా తెలుసు?"

"బ్లాక్ టైగర్‌కి తెలియని సంగతి ఏదీలేదు. నీకు మరో గంట టైమ్ ఇస్తున్నాను. బాగా ఆలోచించుకో. డబ్బు సిద్ధంచేసి వుంచు."

రిసీవర్ క్రెడిల్ చేసినట్లు 'క్లిక్'మని శబ్దం వచ్చింది.

భూపతిరావుకి నిషా దిగిపోయినట్లయింది. నీరసంగా కుర్చీకి తల ఆనించాడు. తల గిర్రున తిరుగుతోంది.

క్రింద హార్మనీ శబ్దంచేస్తూ కారు ఆగింది. భూపతిరావు లేచివెళ్ళి కిటికీలోనుంచి చూశాడు. రుక్మిణి కారు దిగడం కనిపించింది.

కొంచెంసేపటికి ఆమె పైకి వచ్చింది. భూపతిరావు తలుపులు మూసి బోల్టుపెట్టి, "యస్పీగారు ఏమన్నారు?" అన్నాడు.

"రఘుపతిరావుగారింటికి ఫోన్ చేశారు. బ్లాక్ టైగర్ చెప్పిన వివరాలన్నీ కరెక్టు. వాళ్ళు అదే నెంబర్ బస్సులో బయల్దేరారు."

"అది సరే బ్లాక్ టైగర్ ముఠావాళ్ళని పట్టుకునే ఏర్పాటు ఏదైనా వుందన్నారా?"

"నేను ఐ.జీ.గారితో మాట్లాడతాను. మీరు భయ పడకుండా మీ ఏర్పాట్లు మీరు చేసుకోండి. అనుకున్న సమయానికి పెళ్ళివారి బస్సు వస్తుందని చెప్పి నన్ను పంపేశారు" అంది ఆమె.

"పోలీసుల్ని గుంటూరునుంచి అటు పంపే యేర్పాటు చెయ్యమని చెప్పకపోయావా?"

"అవన్నీ మనం ఆయనకి ఎలా చెప్తాం? ఆ ఏర్పాట్లు ఎలా చేయాలో ఆయన చూసుకుంటారు. మనం సలహాలు చెప్పే యేం బాగుంటుంది" అంది రుక్మిణి.

అదీ నిజమేనన్నట్లు తల వూపాడు.

"అంతా దేవుడి మీద భారం వేద్దాం. మనం చేసేది యేముంది?" అంది రుక్మిణి దిగులుగా.

భూపతిరావు యేడుకొండలవాడి ఫోటోవైపు చూసి చేతులు జోడించి ఆ తర్వాత చెంపలు వాయించు కున్నాడు.

## 5

పెళ్ళివారి బస్సు నాగార్జునసాగర్ చేరింది.

టైమ్ నాలుగు దాటింది.

బస్సు గెస్టు హౌస్ కాంపౌండ్‌లో ఆగింది. అంతా క్యాంటీన్‌లోకి వెళ్ళారు. బస్సు దగ్గర సామానులు చూస్తూ వుండడానికి రఘుపతిరావు నౌకరు గంగయ్య ఒక చెట్టుక్రింద కూర్చుని బీడీ కాలుస్తున్నాడు.

పోలీస్ వ్యాన్ రివ్వున వచ్చి ఆగింది. తుపాకులు పట్టుకుని రిజర్వు పోలీసులు బస్సుని చుట్టుముట్టారు. ఇన్‌స్పెక్టర్ అజీజ్ బస్సు డోర్ తీసి చూశాడు. లోపల యెవరూ లేరు. నౌకరు గంగయ్య పోలీసుల్ని చూసి బిత్తరపోయాడు. పోలీసులు బస్సుని ఎందుకు చుట్టు

మాట్లాలో అతనికి అర్థంకావడంలేదు.

గంగయ్య బస్సు సమీపంలో తచ్చాడుతూ వుండడం చూసి ఇన్ స్పెక్టర్ అతన్ని రమ్మని చెయ్యి వూపాడు.

గంగయ్య వచ్చి చేతులు కట్టుకుని నిల్చున్నాడు.

"నువ్వీ బస్సు తాలూకు వాడివేనా?"

"అవునయ్యా!"

"మీ ఓనరుగారి పేరేమిటి? రఘుపతిరావుగారేనా?"

"అవునయ్యా!"

"ఆయన ఎక్కడ?"

"కాఫీకి వెళ్ళారయ్యా!" అన్నాడు గంగయ్య.

"వెంటనే పిల్చుకురా."

గంగయ్య బాణంలా దూసుకెళ్ళాడు. కాంటీన్ లో అంతా హడావుడిగా వుంది. పెళ్ళి బృందంవారికి పదార్థాలు సప్లయిచెయ్యలేక సర్వర్లు అవస్థ పడుతున్నారు.

"ఓరేయ్ గంగయ్యా! బస్సు దగ్గర వుండరా అంటే ఇక్కడ తగలడ్డావేమిట్రా?" రఘుపతిరావు గట్టిగా కేకలు పెట్టాడు.

గంగయ్య రఘుపతిరావు దగ్గరికి వచ్చి రొప్పుతూ "అయ్యగారూ! మిమ్మల్ని ఇన్ స్పెక్టరుగారు పిల్చుకు రమ్మన్నారండి" అన్నాడు.

"ఇన్ స్పెక్టరేమిటి? నన్ను పిలవడం యేమిట్రా వెర్రి మొఖమా?" అన్నాడు రఘుపతిరావు.

"యేమోనయ్యా!" అన్నాడు గంగయ్య.

"యే ఇన్ స్పెక్టర్రా! బ్రేక్ ఇన్ స్పెక్టరా? అయితే డ్రైవర్ని పిల్చుకెళ్ళు. వాళ్ళకేవో మామూళ్ళువుంటాయి" అన్నాడు రఘుపతిరావు కాఫీ సాసర్లోకి వంచుతూ.

"ఆ ఇన్ స్పెక్టర్ కాదయ్యా! చాలామంది పోలీసు

లొచ్చారు. వాళ్ళ చేతుల్లో తుపాకులు కూడా వున్నాయి" అని వివరంగా చెప్పాడు గంగయ్య.

రఘుపతిరావు కాఫీ గుటకలు వేసి "పద" అన్నాడు.

దూరంనుంచి కనిపిస్తూనే వున్నారు పోలీసులు బస్సు చుట్టూ. దారినపోయే వాళ్ళు తమాషా చూస్తూ నిల్చున్నారు పోలీసుల వెనుక.

రఘుపతిరావుకి యేమీ అర్థంకాలేదు. తమ బస్సు దగ్గర పోలీసులెందుకున్నారు? దారినపోయే బస్సుని చెక్ చెయ్యడానికి వాళ్ళకేం పట్టింది? ఇందులో యేదైనా దొంగ సరుకుందని అనుమానపడ్డారా? ఆయన బుర్రలో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి.

"నమస్తే ఇన్‌స్పెక్టర్ సాబ్" అన్నాడు రఘుపతి రావు.

"మీరేనా రఘుపతిరావుగారు?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్ అజీజ్.

"అవును. నేనే, యేమిటిదంతా?" చుట్టూ వున్న రిజర్వు కానిస్టేబుల్స్‌ని చూస్తూ అన్నాడు.

"కంగారుపడకండి. మీ అబ్బాయి పెళ్ళి ఈ రోజు రాత్రి గుంటూర్లో జరుగబోతున్నది కదూ? పెళ్ళికి మీరంతా బయల్దేరారు. అవునా?"

"అవును. ఇదంతా మీకెలా తెల్సు?"

"మాకు వైర్లెస్ ఇన్ఫర్మేషన్ వచ్చిందిలెండి. ముందు ఇది చెప్పండి. బస్సులో వున్నవాళ్ళంతా మీ వాళ్ళేనా? ఐ మీన్ మీకు పరిచయం వున్నవాళ్ళేనా?"

"చాలామంది మా బంధువులే. కొందరు మా అబ్బాయి ఫ్రెండ్స్ కూడా వున్నారు. యేం? అలా అడుగుతున్నారు?"

"మీ బస్సులో బందిపోటు ముఠావాళ్లున్నారు. మీ బంధువుల్లా నటిస్తూ మీతోపాటు ప్రయాణం చేస్తున్నారు. మధ్యలో బస్సు ఆపి దోచుకోవడానికి పథకం వేశారు. బహుశా వాళ్ళ దగ్గర టైంబాంబులు గూడా ఉండి వుండొచ్చు. బ్లాక్ టైగర్ అని పెద్ద బందిపోటు ముఠా ఒకటి వుంది. పెళ్ళివారి బస్సులు దోచుకోవడం వాళ్ళకి వెన్నతో పెట్టిన విద్య."

రఘుపతిరావుకి కంగారు యెక్కువ. ఇన్‌స్పెక్టర్ చెప్పిన మాటలు వింటూనే నిప్పు తొక్కిన కోతిలా గంతులేశాడు.

"ఇన్‌స్పెక్టర్ మీరు చెప్పేదంతా నిజమా? అయితే ఇప్పుడు మా గతి ఏమిటి?" అని కంగారుపడిపోయాడు. ముఖం చెమట పట్టింది.

"మీరేమీ భయపడకండి. మీ వియ్యంకుడు భూపతి రావుని బ్లాక్ మెయిల్ చేస్తున్నారు ముఠావాళ్ళు. ఐదు లక్షలు ఇస్తే వదిలిపెట్టేస్తారట. లేకపోతే బస్సు దోచుకుంటామని బెదిరిస్తున్నారు. వాళ్ళ ఆటలు సాగవులెండి. మీరు దగ్గరుండి బస్సు అంతా చెక్ చేయించాలి. యే మూలనైనా టైం బాంబ్ వుందేమో చూడాలి."

టైంబాంబ్ గురించి తల్చుకోగానే రఘుపతిరావు గుండెలో బాంబులు పేలాయి. ఇంగ్లీషు సినిమాల్లో బస్సులు, కార్లు పేలి మంటలు పైకి లెగవడం కళ్ళ ముందు కదిలాయి.

"ప్లీజ్ ఇన్‌స్పెక్టర్. మీరు దగ్గరుండి ఆ బాంబు యెక్కడుందో కనిపెట్టండి. శుభమా అని పెళ్ళికి తరలి వెళ్తుంటే ఇదెక్కడి బెడద వచ్చిపడిందండీ బాబు. ఇటువంటివి సినిమాల్లో చూశానుగాని మాకే యెదురై

బెదిరిస్తాయని కలలో కూడా అనుకోలేదు."

కాఫీలకు వెళ్ళినవాళ్ళు ఒక్కొక్కరే తిరిగి వస్తున్నారు.

పోలీసులు బస్సు ఎక్కి మూల మూల గాలించసాగారు. డ్రైవర్ కూడా ఇంజన్ లోపల భాగాల్లో శల్య పరీక్ష చేయడం మొదలుపెట్టాడు బాంబ్ ఎక్కడైనా వుందేమోనని.

పెళ్ళికొడుకు స్నేహితులిద్దరు ధైర్యంగలవాళ్ళు బస్సులోకి ఎక్కి సూట్ కేసులు, సంచులు వగైరా సామాను అంతా దించి చెట్టుక్రిందకు చేర్చారు. ఎవరి లగేజి వాళ్ళే గాలించసాగారు టైమ్‌బాంబ్ కోసం.

రెండు గంటలు పట్టింది వెదకడానికి. ఏమీ దొరకలేదు. బస్సు చుట్టూ జనం మూగారు. ముందుకు రాకుండా పోలీసులు కంట్రోల్ చెయ్యడమే సరిపోయింది. పెళ్ళివారి బస్సులో దొంగలు బాంబ్ పెట్టారట అనే వార్త ఊళ్ళోకి వ్యాపించింది. జనం వేలం వెర్రిగా రాసాగారు. అక్కడేదో సినిమా షూటింగ్ జరుగుతున్నంత గందరగోళంగా వుంది.

టైమ్ ఆరు దాటులోంది. రఘుపతిరావుకి పిచ్చెక్కిపోతోంది. అవతల పెళ్ళి ముహూర్తం దగ్గరికి వస్తోంది. ఇంకా వందమైళ్ళు వెళ్ళాలి. వెళ్ళేది ఎప్పుడు? భోజనాలు కానిచ్చేది ఎప్పుడు? పీటలమీద కూర్చునేది ఎప్పుడు?

"ఎక్కండి....ఎక్కండి...." అని రఘుపతిరావు తమ వాళ్ళని తొందరపెట్టాడు.

అంతా ఎక్కి కూర్చున్నారు.

రెండు సీట్లు ఖాళీగా వున్నాయి.

"అంతా యెక్కినట్లేనా?" అసహనంగా కేకలు

పెట్టాడు రఘుపతిరావు.

"రెండు సీట్లు ఖాళీగావున్నాయి. ఎవరో ఎక్కలేదు" అన్నాడు పెళ్ళికొడుకు.

"ఎక్కడ చచ్చారు?" హూంకరించాడు.

ఎవరూ మాట్లాడలేదు.

"డ్రైవర్. హారన్ కొట్టు బాబూ!" అన్నాడు.

డ్రైవర్ అదేపనిగా హారన్ కొట్టాడు. పది నిముషాల కూడా ఎవరూ రాలేదు.

"అసలు ఆ ఇద్దరు ఎవర్రా?"

ఒకళ్ళ ముఖం మరొకళ్లు చూసుకున్నారు. మిస్సయిన ఇద్దరు యెవరో గుర్తు తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తున్నారు.

"అన్నయ్య ఫ్రెండ్స్ నాన్నా!" అంది పెళ్ళికొడుకు చెల్లెలు.

పెళ్ళికొడుకు చెల్లెలువంక గుర్రగా చూశాడు.

"ఏరా? ఎవర్రా వాళ్లు? అన్నాడు రఘుపతిరావు.

"ఏమో! ఎవరోకళ్లులే. తర్వాత బస్సులో వాళ్ళే వస్తారే. ముందు బస్సు పోనివ్వండి" చిరాకుగా అన్నాడు పెళ్ళికొడుకు. అతనికీ గుర్తురావడంలేదు ఎవరో వాళ్ళు.

"అట్లా వదిలేస్తే ఎట్లా? అసలు దొంగలు వాళ్ళేనేమో? బాంబులు తీసుకుని పారిపోయారేమో? వదిలేస్తే ఎట్లా?" అంటూ బస్సు దిగాడు రఘుపతిరావు.

బస్సులో కూర్చున్నవాళ్ళ గుండెల్లో రాయిపడింది.

"ఇన్‌స్పెక్టర్ సాబ్! ఇద్దరు మాయమయ్యారు. రెండుసీట్లు ఖాళీగా వున్నాయి" అన్నాడు రఘుపతిరావు.

బస్సులో బాంబ్ గురించి వెతికించి వెతికించి డిస

పాయింటయి వున్నాడు ఇన్‌స్పెక్టర్. కొండని త్రవ్వి ఎలుకను పట్టినట్లుగా వుందని లోలోపల చిరాకుగావుంది అతనికి.

"వాళ్ళు మీవాళ్ళు కారా?"

"భలేవారండి మీరు? పెళ్ళికి వెళ్తూ యెవరెవర్ని తీసుకెళ్తున్నామో కూడా తెలీకుండా బయల్దేరారన్న మాట. బాగుంది" ఇన్‌స్పెక్టర్ నవ్వాడు.

"అంతా మనవాళ్ళే అనుకున్నానండీ. మనవాళ్ళు కాకుండా ఎవరు మాత్రం ఎక్కుతారు అనుకున్నాం. ఈ ఆడవాళ్ళొకళ్ళు ఒకపట్టాన బయల్దేరరు. పదకొండింటికి బస్సు వస్తే ఒంటిగంట దాటింది బయల్దేరేటప్పటికి. బస్సునిండా సరిపోయారు. అంతా మావాళ్ళు అనుకున్నా. కొందరు మా వాడి ఫ్రెండ్స్ వున్నారు. నేను వాళ్ళని గుర్తుపట్టలేను కదా!"

"మీ అదృష్టం బాగుంది. మాకు మెసేజ్ రావడం వల్ల మేము రావడం, అది చూసి వాళ్ళు పారిపోయి వుంటారు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"కాని ఇన్‌స్పెక్టర్ ఇప్పుడే చీకటిపడింది. మధ్య దారిలో అటకాయించరుగదా?" భయంగా అన్నాడు రఘుపతిరావు.

"డటీజ్ క్లియర్. ఆ ప్రమాదం లేకపోలేదు" ఆలోచనలో పడ్డాడు ఇన్‌స్పెక్టర్.

"ఇన్‌స్పెక్టర్ సాబ్. మమ్మల్ని ఎలాగైనా గుంటూరు జేర్చండి. ముహూర్తం వేళకి చేరుకోకపోతే అంతా వృధా అవుతుంది" బ్రతిమాలుతూ అన్నాడు రఘుపతి రావు.

"మీరు రమ్మంటే వస్తాము. అవసరమైతే వ్యాన్‌లో

ఫాలో కమ్మని మాకు ఆర్డర్స్‌న్నాయి. మీరంతగా చెప్పాల్సిన పనిలేదు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"హమ్మయ్య. నాకిప్పుడు నిశ్చింతగా వుంది" అన్నాడు రఘుపతిరావు తృప్తిగా ఊపిరి వదుల్తూ.

మరో నిముషంలో పెళ్ళివారి బస్సు, దాని వెనుక పోలీస్ వ్యాన్ వయలుదేరాయి.

# 6

పెళ్ళివారి బస్సు మాచెర్ల చేరుకునేసరికి రాత్రి ఏడుగంటలు కావచ్చింది.

టౌన్‌లో జోరుగా వర్షం కురుస్తున్నది. గాలి హోరున వీస్తున్నది. రోడ్లమీద జన సంచారం అంతగా లేదు. రోడ్లమీద గుంటలు నీళ్ళతో నిండిపోయివున్నాయి. జనం షాపుల్లోను, హోటల్స్‌లోనూ తలదాచుకున్నారు.

బస్సు రైలుగేటుకు చాలా ఇవతలగా తాలూకా ఆఫీసు దగ్గరే ఆగిపోవాల్సి వచ్చింది. వాహనాలు వరుసగా క్యూలో ఆగివున్నాయి. రైలు వస్తుంటే గేటు వేశారేమోనని పావుగంటసేపు వెయిట్ చేశాడు డ్రైవరు.

కాని ఒక కానిస్టేబుల్ బస్సులోకి వచ్చి "చంద్ర వంక పొంగింది. ట్రాఫిక్ ఆగిపోయింది" అన్నాడు.

బస్సులోవాళ్ళు హతాశులై పోయారు. రఘుపతిరావుకి నీరసం ముంచుకొచ్చింది.

"ఇప్పుడేం చెయ్యాలి?" రఘుపతిరావు డ్రైవర్ దగ్గరకి వచ్చి అడిగాడు.

డ్రైవర్‌కి ఏం చెప్పాలో తెలియలేదు.

"ఇప్పట్లో తగ్గుతుందంటావా?" అన్నాడు మళ్ళీ.

"యేమో సార్. నమ్మకంగా చెప్పలేం. ఒకసారి చంద్రవంక మూలంగా తెల్లవార్లూ కూర్చున్నాం. తెల్ల

వారాక నీళ్ళుతీసి రోడ్డు కనపడింది" అన్నాడు డ్రైవర్.

కాన్‌స్టేబుల్ దిగిపోయాడు. అతని వెంట డ్రైవర్ కూడా దిగాడు. బస్సులో జనం నిరాశా నిస్పృహాలకు లోనై పోయారు. చంద్రవంకలో నీళ్ళు తగ్గాలి. అప్పుడు బస్సు బయల్దేరాలి. ఎప్పుడు తగ్గుతుందో? పెళ్ళి రాత్రి రెండింటికి.

"అసలు ముహూర్తం మంచిది కాదేమో!" అని ఒకావిడ అనేసింది.

"ఛీ. నోర్ముయ్!" ఎవరో గద్దించారు.

ఎవరూ పైకి మాట్లాడకుండా లోలోపల గొణుక్కోవడం మొదలు పెట్టారు.

కాసేపటికి డ్రైవర్ వచ్చాడు.

"సార్! సాయంకాలం నుంచి అటువైపు వర్షాలు పడుతూనే వున్నాయట. చంద్రవంక ఇప్పట్లో తగ్గదేమో? పోయిన కొద్దీ నీరు వస్తూనే వుంటుంది. దీన్ని దాటినా రెంటచింతల దగ్గర, గురజాల, దాచేపల్లి .... అన్నీ వాగులే సార్!"

డ్రైవర్ చెప్పేమాటలు వింటుంటే అందరికీ గుండెలు జారిపోతున్నాయి. గుంటూరు చేరే మార్గం లేనప్పుడు చేసేది ఏముంది? అందరూ నీరసంతో పడిపోతున్నారు. అందరి మనసుల్లోనూ ఒకటే ప్రశ్న.

'ఈ పెళ్ళి జరుగుతుందా?'

"మనం యెనిమిదింటికల్లా వస్తామని ఫోన్ చేసి చెప్పాను. రాకపోతే భూపతిరావు ఎంత కంగారు పడుతుంటాడో?" రఘుపతిరావు వాపోయాడు.

దొంగల భయం అడుగున పడిపోయి పెళ్ళిముహూర్తం వేళకి గుంటూరు చేరుకునేది ఎలా? అనే ఆందోళన

చెల రేగింది.

"నేను వెళ్ళి భూపతిరావుకి ఫోన్ చేసి చెప్తాను" అంటూ రఘుపతిరావు బస్సు దిగాడు. నెత్తిన టవల్స్ వేసుకని మరికొందరు దిగారు ఆయనకు తోడుగా.

బస్సు దిగాక ఒక లారీ బ్రోకర్ ఆఫీసులోకి వెళ్ళి కూర్చున్నారు.

"గుంటూరుకు ఫోన్ చెయ్యాలి. కొంచెం ఫోన్ ఉపయోగించుకోనిస్తారా? బిల్లు పే చేస్తాను" అన్నాడు రఘుపతిరావు.

బ్రోకర్ ఆఫీసులో వున్నాయన పక్కున నవ్వాడు.

అతను ఎందుకు నవ్వుతున్నాడో రఘుపతిరావుకి అర్థం కాక తెల్లముఖం వేశాడు.

"కూర్చోండి" అన్నాడతను.

రఘుపతిరావు కూర్చున్నాడు. అంతా ఐరన్ ఛైర్స్‌లో కూర్చున్నారు.

"మధ్యాహ్నం నుంచి టెలిఫోన్ లైన్స్ లేవండీ. నేను పావు గంట కొకసారి ఫోన్ చేసి అడుగుతున్నా ఎక్ఛేంజ్ వాళ్ళని. ఈ రోజుకిక ఆశలు వదులుకోండి. రేపు ట్రై చేద్దాం అంటున్నారు టెలిఫోన్ ఎక్ఛేంజీ వాళ్ళు. మామూలు రోజుల్లోనే మా ఫోన్లు అంతంత మాత్రం. ఇక ఈ గాలి, వానలో చెప్పే పనిలేదు" అన్నాడు అతను.

రఘుపతిరావు ముఖం నల్లగా మాడిపోయింది ఆయన మాటలు విని.

"గుంటూరునుంచి లారీలు రావాలి. లారీలు రాలేదు. ఫోన్లూ లేవు. దార్లో వాగులెన్ని పొంగాయో యేమిటో?"

అన్నాడు బ్రోకరు ఆఫీసు అతను.

పోలీస్ కాన్‌స్టేబుల్ వచ్చి "సార్! మిమ్మల్ని ఇన్‌స్పెక్టర్ గారు రమ్మంటున్నారు" అన్నాడు.

"ఎక్కడున్నారు?"

"వ్యానులో."

రఘుపతిరావు బయల్దేరి వెళ్ళి వ్యానులోకి వెళ్ళాడు. ఇన్‌స్పెక్టర్ ముందు సీటులో కూర్చుని వున్నాడు.

"రండి .... రండి .... వైర్‌లెస్‌లో మాట్లాడదామని ట్రై చేశాను. వుహూ:.... సెట్ పని చెయ్యడంలేదు. ఇన్ఫర్మేషన్ చెప్పడానికి కూడా వీల్లేకుండాపోయింది" అన్నాడు ఇన్‌స్పెక్టర్ అజీజ్.

"పోన్లెండి. మన చేతిలో లేనిదానికి యేం చేస్తాం?" అన్నాడు రఘుపతిరావు. మనిషి నీరుకారిపోయాడు.

బస్సు డ్రైవర్ తడుసుకుంటూ వచ్చాడు.

"సార్! యేం చేద్దామంటారు?" అన్నాడు.

"చేసేది యేవుంది?" అన్నాడు.

"చంద్రవంక తగ్గేటులేదు."

"పోనీ."

"వెనక్కి పోదామా సార్?" అన్నాడు డ్రైవర్.

"యెక్కడికి హైదరాబాదా?" ఆశ్చర్యం ప్రకటించాడు రఘుపతిరావు.

డ్రైవర్ నవ్వి "లేదు సార్. మరో రూట్‌నుంచి గుంటూరు పోవచ్చు" అన్నాడు.

రఘుపతిరావుకి ప్రాణం లేచివచ్చింది.

"యే రూటు? నిజంగా అలాంటి అవకాశం వుందా?" అన్నాడు.

"యెందుకు లేదు సార్? కాని హైలెజి యెక్కువ

అంతే!"

"మెలేజి ఎట్లాగైనా తగలబడనీ. పెళ్ళి ముహూర్తం వేళకి వెళ్తే అదే పదివేలు" రఘుపతిరావు ముఖంలోకి కళ వచ్చింది.

"ఇప్పుడు యేడున్నర అయింది సార్!"

"పన్నెండింటికి గుంటూరులో పెళ్ళివారి ఇంటిముందు బస్సు ఆపుతాను. సరేనా సార్!" అన్నాడు డ్రైవర్.

"హమ్మయ్య రక్షించావు. నీకు కోరిన బహుమానం ఇస్తాను పద" అన్నాడు రఘుపతిరావు ఆనందంతో.

"మీ దయ సార్!" నవ్వాడు డ్రైవర్.

"ఏ రూటులో వెళ్తావు?" ఇన్‌స్పెక్టర్ ప్రశ్నించాడు.

"ఇక్కడ్నుంచి సాగర్. సాగర్ నుంచి మిర్యాల గూడా మీదుగా హుజూర్ నగర్. అక్కడ్నుంచి కోదాడ హైవేలో వెళ్ళి పడతాం సార్. హైవేలో పడితే విమానంలా వెళ్ళిపోవచ్చు సార్" అన్నాడు డ్రైవర్.

ఇన్‌స్పెక్టర్ తల వూపాడు.

రఘుపతిరావు వ్యాను దిగి బస్సులో ఎక్కాడు. బస్సు వెనక్కి తిరిగింది. పెళ్ళివారి బృందంలో ఆనందం చెలరేగింది. గడ్డు సమస్య విడిపోయినట్లుంది. ముహూర్తం టైమ్‌కి చేరుస్తానని డ్రైవర్ మాట ఇవ్వగానే అంతా సంతోషించారు.

"ఇక్కడే భోజనంచేస్తే సరిపోతుందేమో?" ఒక మూలనుంచి ఎవరో అన్నారు.

"ఎవడ్రా ఆ ఆకలి పిశాచి? ఇప్పుడేగా సాగర్‌లో దోసెలు తిన్నారు. ఇంతలోనే ఆకలి ముంచుకొచ్చిందా? దారిపొడుగునా తింటూ పోతుంటే పెళ్ళివారింట్లో

వండినవన్నీ ఏమైపోవాలి?" రఘుపతిరావు కోపంగా అరిచాడు.

ఎవరూ కిక్కురు మనలేదు.

బస్సు వేగం పుంజుకుంది.

## 7

రాత్రి ఏడు దాటింది.

భూపతిరావు నిషా దిగకుండా అప్పుడప్పుడూ పెగ్గు మీద పెగ్గు విస్కీ సేవిస్తూ కూర్చున్నాడు. మనసంతా మొద్దుబారిపోయినట్లయింది. అంతా కలగా వుంది. ఇది వాస్తవమో? స్వప్నావస్థలో వున్నాడో అతనికి అర్థం కాకుండా వుంది.

రుక్మిణి మేడమీదకీ క్రిందకూ దిగుతూ, ఎక్కుతూ అన్యమనస్కంగా ప్రవర్తిస్తోంది. కాని అన్ని ఏర్పాట్లూ యథావిధిగా జరిగిపోతున్నాయి.

వంటలు సిద్ధమైపోయాయి. డైనింగ్ హాల్లో అతిథులు భోజనాలు చేస్తున్నారు. పెళ్ళిపందిట్లో కళ్యాణమండపం దేదీప్యమానంగా వెలుగుతూ వుంది. ఆడ, మగ అంతా హడావుడిగా తిరుగుతూనే వున్నారు. భూపతిరావు బావమ్మరిది హనుమంతరావు అన్ని ఏర్పాట్లూ దగ్గరుండి చేయిస్తున్నాడు.

రిసెప్షన్ కోసం ముగ్గురు అందగత్తెలు అప్సరసల్లా అలంకరించుకుని వచ్చిన వారిని ఆహ్వానిస్తూ పన్నీరు జల్లుతున్నారు. చేతికి గులాబీ పువ్వు అందిస్తున్నారు.

బ్లాక్ టైగర్ గొడవ బావమ్మరిదికి చెప్పలేదు భూపతిరావు. తను, తన భార్యకి తప్ప ఎవరికీ తెలియనివ్వకూడదనుకున్నాడు. హనుమంతరావుకి తెలిస్తే కంగారుపడిపోతాడు. ఆ కన్ఫ్యూజన్‌లో ఏర్పాట్లు సరిగా చెయ్య

లేదు. పైగా అందరికీ తెలిసిపోయే ప్రమాదం వుంది. అసలు పెళ్ళి జరుగుతుందా లేదా? అని అనుమానం వచ్చిందంటే పెద్ద ప్రమాదం. ఆహ్వానితులు వచ్చిన దారినే పోతే అంతా వృధా!

భూపతిరావు ముందు ఫోన్ మ్రోగింది.

"భూపతిరావ్ స్పీకింగ్."

"యస్పీ స్పీకింగ్ ప్లీజ్."

"యస్పీగారా! అప్పుడే ఏడు దాటింది సార్. నాకు గుండె దడగా వుంది. ధైర్యం చాలడంలేదు. విస్కీ బాటిల్ ముందు పెట్టుకుని కూర్చున్నాను" పేలవంగా నవ్వాడు భూపతిరావు.

"డోంట్ బీ ఫూలిష్ మిస్టర్ భూపతిరావ్! ఎక్కువైతే పెళ్ళి సమయానికి కంట్రోల్లో వుండరు. చూచేవాళ్ళకి అసహ్యంగా వుంటుంది. స్టాప్ది డ్రింక్."

"ఓవర్ కానివ్వడంలేదు లెండి. ఏదైనా సమాచారం తెల్సిందా సార్?"

"చెప్పాను కదా! మీరింతా కంగారు పడతా రెందుకు? సాగర్లో మీ వాళ్ళ బస్సుని పోలీసులు సోదాచేశారు. ఇద్దరు తప్పించుకున్నారు. వాళ్ళే బ్లాక్ టైగర్ ముఠావాళ్ళు కావచ్చు. బస్సు బయల్దేరింది. పోలీస్ ఎస్కార్టుతో వస్తున్నది. ఇక భయం ఏముంది?"

"మీరు రావాలి వెంటనే!"

"వానగా వుందిగదా! చలిగాలి మనకి పడదు. కాస్త తగ్గితే వస్తాను. ముహూర్తం రెండింటికిగదా!"

"అవుననుకోండి. డిన్నర్ మాత్రం ఇప్పుడే. మర్చిపోయారా?"

"నో....నో...."

"మీ మిసెస్ మీరూ తప్పకుండా రావాలి. డిన్నర్ తీసుకోవాలి."

"ష్యూర్ ...."

"ఎప్పుడు బయల్దేరుతున్నారు?"

"ఒక ఇన్ఫర్మేషన్ కోసం ఎదురుచూస్తున్నాను. మీ కేసు గురించే. మీ ఫోన్‌కి ఎక్కడ్నుంచి కాల్ వస్తుందో కనిపెట్టమని టెలిఫోన్ వాళ్ళని రిక్వెస్టు చేశాను. అది లోకల్ కాలో లేక వేరే టౌన్స్‌నుంచి యస్.టి.డి. చేస్తున్నారా? వాళ్ళ నెంబర్ ఏమిటి? వగైరా సమాచారం తెలిస్తే ఆ బ్లాక్ మైలర్ గాడి ఆట కట్టించవచ్చు!" యస్పీ నవ్వాడు.

"వాడ్ని పడితే పీడా పోతుంది సార్."

"ఓ. కె. వుంటాను."

"థాంక్స్ సార్."

"నో మెన్షన్."

భూపతిరావు రిసీవర్ క్రెడిల్ చేశాడు.

ఎదురుగా హనుమంతరావు నిల్చున్నాడు. మనిషి ముఖం మాడిపోయి వుంది. పెళ్ళి పనులలో తీరికలేకుండా వుంటున్నాడేమో అలసిపోయినట్లున్నాడు.

"బావా?" అన్నాడు ఆదుర్దాగా.

"ఏవిట్రా?" అనుమానంగా చూస్తూ అడిగాడు.

"పేరేచర్ల దగ్గర యాక్సిడెంట్ జరిగిందట."

"ఎవరికి?"

"పెళ్ళివారి బస్సు...."

"ఆఁ...." అన్నాడు భూపతిరావు. గుండె ఆగిపోయినట్లయింది. కళ్ళు తేలవేశాడు.

హనుమంతరావు కంగారుగా "బావా!....బావా!-"

అంటూ దగ్గరకి వచ్చి చేతితో తట్టాడు భుజంమీద.

"వూఁ...." అన్నాడు భూపతిరావు తేరుకుని.

"ఎవరు చెప్పారా?" అన్నాడు భూపతిరావు నెమ్మదిగా.

"పోలీసులకు యెవరో చిన్న కారు వాళ్ళొచ్చి చెప్పారట. పోలీస్ వ్యాన్ పేరేచర్ల వెళ్తూ మన ఇంటి మీదుగా వెళ్ళారు. పెళ్ళివారి బస్సు మీకు సంబంధించిందేమో? వచ్చి చూసుకోండి అని చెప్పి వెళ్ళారు. మనం వెళ్తే మంచిదేమో?" అన్నాడు హనుమంతరావు.

"వూఁ—పద వెళ్దాం. డ్రైవర్ వున్నాడా?"

"ఎక్కడికి పోతాడు? వున్నాడు."

ఇద్దరూ బయల్దేరారు.

హనుమంతరావు అన్నాడు. "అక్కతో చెప్పిరాకు. కంగారుపడుతుంది."

"వూఁ...." అన్నాడు భూపతిరావు నీరసంగా.

అతని మనసులో అగ్నిపర్వతాలు బ్రద్దలవుతున్నాయి. ఒకవేళ పెళ్ళి బస్సు మనవాళ్ళదే అయితే?

"భగవంతుడా మమ్మల్ని రక్షించు" లోలోపలే దేవుడ్ని ప్రార్థిస్తున్నాడు భూపతిరావు.

## 8

భూపతిరావు కంగారుపడి వెళ్ళాడుగాని, ఆ పెళ్ళివారి బస్సు నర్సారావుపేటనుంచి వస్తున్నది. తమది కాదు. అదృష్టవశాత్తు యెవరూ చనిపోలేదు. పెళ్ళికొడుక్కి గాయాలేమీ తగల్లేదు. సీరియస్‌గా వున్న వాళ్ళని హాస్పిటల్లో చేర్పించడానికి తీసికెళ్ళారు. భూపతిరావు 'హమ్మయ్య' అని గాలి పీల్చుకున్నాడు.

ఇంటికి రాగానే రుక్మిణి ఎదురువచ్చి "ఏమండీ పెళ్ళి

వారి బస్సుకి యాక్సిడెంట్ అయిందట నిజమేనా?"
అని అడిగింది.

భూపతిరావు నవ్వి "మనవాళ్ళు కాదులే, యెవరో నర్సారావుపేటవాళ్ళు" అన్నాడు.

"నీకెవరు చెప్పారక్కా..?" అని ప్రశ్నించాడు ఆమె తమ్ముడు హనుమంతరావు.

"పందిట్లో ఎవరో అనుకున్నారు. అందరికీ తెలిసిపోయింది" అంది ఆమె.

"మన వాళ్ళు వస్తూవుంటార్లే" అంటూ పైకి వెళ్ళాడు భూపతిరావు.

టెలిఫోన్ రింగ్ అవుతోంది.

భూపతిరావు అసహనంగా రసీవర్ ఎత్తాడు.

"మిస్టర్ భూపతిరావ్?"

"యస్. స్పీకింగ్."

"డబ్బు రెడీ చేశావా?"

"ఎప్పుడో చేశాను. ఎక్కడికి తీసుకురావాలి?" అన్నాడు భూపతిరావు.

"సరిగ్గా ఎనిమిది గంటలకు పేరేచర్ల జంక్షన్ దాటి మొట్ట మొదటి మైలురాయి దగ్గర వుండు. మా మనిషి తీసుకుంటాడు."

"మీ మనిషి అని నాకెలా గుర్తు?"

"అదే చెప్పబోతున్నాను. నువ్వు కారు దూరంగా ఆపి మైలురాయి దగ్గర నిల్చో."

"ఈ వర్షంలోనా?"

"గొడుగు వేసుకో, లేదా రెయిన్ కోటు తగిలించుకో. అది కూడా నేనే చెప్పాలా?"

"కంగారులో బుర్ర పనిచేయడంలేదు."

"మా మనిషి మోటార్ సైకిల్ మీద వస్తాడు. నీ దగ్గర బండి ఆపి సిగిరెట్ లైటర్ వుందా అని అడుగుతాడు. అదే గుర్తు. అతనికి డబ్బున్న సూట్ కేస్ అందించు. దట్సాల్."

"అలాగే."

"చెప్పిందంతా గుర్తుంది కదా!"

"బాగా గుర్తుంది. పేరేచర్ల జంక్షన్ దాటి మాచెర్ల రోడ్డులో...."

"నో....నో....మాచర్ల రోడ్డు కాదు. నర్సారావు పేట రోడ్డు."

"సరే. నర్సారావు పేట రోడ్డు మొదటి మైలురాయి దగ్గర నిల్చోవాలి. ఎనిమిది గంటలకు మీ మనిషి వచ్చి సిగిరెట్ లైటర్ అడుగుతాడు. అతనికి సూట్ కేస్ ఇవ్వాలి. అంతే గదా!"

"కరెక్టు."

ఫోన్ రిసీవర్ క్రెడిల్ చేసి చిన్నగా నవ్వుకున్నాడు.

కొంచెంసేపు ఆగి ఆదేపనిగా ఫోన్ వైపు చూశాడు. ఫోన్ రింగైంది.

"భూపతిరావ్ స్పీకింగ్" రిసీవర్ ఎత్తి అన్నాడు.

"యస్పీని మాట్లాడుతున్నాను."

"సార్! యేమైనా సమాచారం అందిందా. పెళ్ళి వారి బస్సు ఇంకా రాలేదు."

"కంగారు పడకండి. మాచెర్ల వైపు నుంచి బస్సులేవీ రావడంలేదని ఆర్టీసివాళ్ళు చెప్పారు. వాగులు పొంగి వుండొచ్చు అన్నారు. మీరు ఇంట్లోనే వుండండి. బ్లాక్ టైగర్ ఆచూకీ తెలిసింది. టెలిఫోన్ డిపార్టుమెంటు వాళ్లు నెంబరు, అడ్రస్‌తో సహా ఇచ్చారు."

"ఎవరడండీ వాడు?"

"మీకు చూపిస్తానుగా" అన్నాడు.

"మీ కోసం వెయిట్ చేస్తుంటాను."

"ఓ.కె."

# 9

భూపతిరావు రిసీవర్ పెట్టేసి హుషారుగా మేడ మీదనుంచి దిగి వచ్చాడు.

రుక్మిణిని పిలిచి "బ్లాక్ టైగర్ ఆచూకీ తెలిసిందట. యస్పీగారు ఫోన్ చేశారు. వాడిని పట్టుకోవడానికి పోతున్నారు. నేనూ వెళ్తున్నాను. వాడెవడో చూడాలి" అన్నాడు.

రుక్మిణి ఆదుర్దాగా అతని చెయ్యి పట్టుకుని ఆపి "మీ రెందుకు వెళ్తారు? వాడి దగ్గర పిస్టల్ వుండొచ్చు. లేనిపోని ప్రమాదం. పోలీసుల్ని పట్టుకోనివ్వండి. తర్వాత చూడొచ్చు. తొందరేం" అంది.

"నీ ముఖం...." అని నిర్లక్ష్యంగా నవ్వి వెళ్ళిపోయాడు భూపతిరావు.

పందిట్లో ఆసహనంగా పచార్లుచేస్తూ యస్పీకోసం ఎదురుచూస్తున్నాడు భూపతిరావు.

యస్పీ కారు రివ్వున వచ్చి పందిరిముందు ఆగింది. కారు వెనుక పోలీస్ వ్యాన్ వుంది.

యస్పీ కారు దిగాడు. ఆ వెనుక డి. యస్పీ, ఇన్ స్పెక్టర్ దిగారు. వ్యాన్‌లోంచి కానిస్టేబుల్స్ దిగారు. వాళ్ళ చేతుల్లో తుపాకులున్నాయి.

భూపతిరావు విష్ చేసి "దిగుతారెందుకు. పదండి నేనూ ఎక్కుతున్నాను కారు" అన్నాడు.

"కారులో పోవాల్సిన పనిలేదు. బ్లాక్ టైగర్ ఇల్లు

దగ్గరే" అన్నాడు నవ్వి.

అంతా కదిలారు. సన్నగా తుప్పరలా వాన పడుతోంది. ఆ వీధిలోనే ఒక బిల్డింగ్ ముందర ఆగారు.

గేటు ముందర ఆగి ఇన్‌స్పెక్టర్ ఇంటి నెంబరు చూశాడు.

"సార్! ఇదే బిల్డింగ్" అన్నాడు.

పోలీసుల బూటు చప్పుడికి ఔట్ హౌస్‌లో వున్న గూర్ఖా వాచ్‌మాన్ వచ్చాడు.

"ఈ ఇల్లా?" ఆశ్చర్యబోయాడు భూపతిరావు.

"అవును. ఏం?"

"ఇది మా బామ్మర్ది ఇల్లండీ" తెల్లబోతూ అన్నాడు భూపతిరావు.

"మాకు తెల్సు. అందుకే మిమ్మల్ని పిలుచుకొచ్చాం" యస్పీ నవ్వుతూ అన్నాడు.

"అందర్ కౌన్ హై?" ప్రశ్నించాడు యస్పీ.

గూర్ఖా సమాధానం చెప్పాడు. "కృష్ణా సాబ్ హై సాబ్."

అంతా లోపలకు వెళ్ళారు.

ఆఫీసు గదిలో కూర్చుని వున్నాడు నల్లగా వున్న పాతికేళ్ళ కుర్రాడు. అతని ముందు టెలిఫోన్ వుంది. గదినిండా సిగరెట్ పీకలు వున్నాయి. టేబుల్ మీద బీరు సీసాలున్నాయి. రెండు ఖాళీగా వున్నాయి. ఒక దాంట్లో సగం ద్రవం వుంది.

అతను పోలీసుల్ని గమనించి పరిగెత్తబోయాడు.

ఇన్‌స్పెక్టర్ కదలకుండా పట్టుకున్నాడు.

"హౌ డూ యూ డూ మిష్టర్ బ్లాక్ టైగర్" యస్పీ పలకరించాడు.

"వీడు నా మేనల్లుడండీ. ఓర్నీ దుంప తెంచా! ఎంత పాడలగొట్టావురా" అన్నాడు భూపతిరావు.

"పేరు బాగానే పెట్టుకున్నాడు. నల్లగా వున్నాడు. బ్లాక్ టైగర్" ఇన్‌స్పెక్టర్ అన్నాడు.

"మీ మావని ఎందుకు బాబూ బ్లాక్ మెయిల్ చేశావు? చెప్పు."

"వాడేం చెప్తాడు సార్. నన్నడగండి చెప్తాను. మా అమ్మాయిని వాడికివ్వలేదని కసి" అన్నాడు భూపతిరావు.

నెత్తురుచుక్క లేని ముఖంతో తల వూపాడు కృష్ణ.

"నీకు బస్సు నెంబరు ఎలా తెలుసు బాబూ? అంత కరెక్టుగా ఎలా చెప్పావు?" యస్పీ ప్రశ్నించాడు.

"నేను హైదరాబాద్ వెళ్ళినపుడు పెళ్ళికొడుకు ద్వారా తెలుసుకున్నాను" అన్నాడు కష్ణ.

"నిజంగా డబ్బుకోసమే బ్లాక్ మెయిల్ చేశావా? నీకు నిజంగా ముఠా వుందా? పెళ్ళివారి బస్సులో నీ వాళ్ళు వున్నారా?"

"ఎవరూ లేరండీ. అవన్నీ కల్పించి చెప్పాను. మా మావయ్యని ఏడిపించాలనే" ఏడవలేక నవ్వాడు కృష్ణ.

## 10

పెళ్ళివారి బస్సు రాత్రి పన్నెండింటికి భూపతిరావు ఇంటిముందు ఆగింది.

"నాన్నా! జ్ఞాపకం వచ్చింది" పెళ్ళికొడుకు కేక పెట్టాడు.

అంతా పెళ్ళికొడుకువైపు ఆశ్చర్యంగా చూశారు. రఘుపతిరావు అడిగాడు "ఏమిట్రా అది?"

"సాగర్‌లో మనవాళ్ళు ఇద్దరు మిస్ అయ్యారన్నావు

గదా! వాళ్ళు నర్సయ్య మావయ్యా, ఆయన ఫ్రెండూనూ!" అన్నాడు.

"అక్కడెందుకు దిగారు?"

"నర్సయ్య మావయ్య ఇల్లు కట్టిస్తున్నాడు గదా! మాచెర్లలో పాలిష్ రాళ్ళు చౌక అని కొనడానికి, సాగర్‌లో బస్సు రెడీగా వుంటే ఎక్కి వెళ్ళారు. మాచెర్లలో పని చూసుకుని గుంటూరు వస్తామన్నారు" అన్నాడు.

"సర్లే" అన్నాడు రఘుపతిరావు.

బస్సు దిగగానే భూపతిరావు స్వాగతం చెప్తూ "బ్లాక్ టైగర్ గాడిని పట్టేశాం" అన్నాడు.

"ఎవరు?"

"ఇంకెవరు? మా మేనల్లుడు" అంటూ జరిగిన కథ అంతా చెప్పాడు.

—:ఐ పో యి ం ది:—

# అది కక్ష-ఇది శిక్ష!

## సికిందర్

నా బాస్ శ్రీ మచ్చీందర్ రావ్, 'బ్లేడ్' పత్రికాధిపతి, మొన్న మధ్యాహ్నమే ఫోన్ చేసి నన్ను పిలిపించి, ఎడిటర్ శర్మ మెట్లమీదనుంచి జారిపడి కడికాలు విరగ్గొట్టుకున్నాడని చెప్పినప్పుడు, నేనంతగా చలించ లేదు.

ఎందుకంటే, అలాంటిది నే నెప్పుడో వూహించాను. మెట్లని చూస్తే ఎక్కడలేని సరదా శర్మకు. ఎవరెస్టుని అధిరోహిస్తున్నంత ఉత్సాహంవచ్చేసి, వెంట ఎవరున్నా వదిలేసి, యెక్కుపెట్టిన బాణంలా దూసుకెళ్లి చేరు కుంటాడు పైకి. అలాగే కిందికి వచ్చేటప్పుడు కూడా. అలా వురకడంలోని ప్రమాదాన్ని నేను చాలాసార్లు హెచ్చరించాను, అతని వయసును దృష్టిలో పెట్టుకుని. కానీ అతనిలాటి జీవిత సత్యాల్ని చాలా తేలికగా తీసు కుంటాడు. అందుకే ఫలితం మొన్న చవిచూశాడు.

అతని ట్రాజడీ నాకు పెద్ద షాకింగ్ న్యూస్ కాలేదు.

కాసే అతడి బాధ్యతల్ని నన్ను తీసుకొమ్మని బాస్ పిలిచి అన్నప్పుడు కలవరపడ్డాను. అది నేనూహించ రానిది! నేను కేవలం ఆ పత్రికకు రిపోర్టర్‌ని మాత్రమే.

"అతని మోకాలు మధ్యకి విరిగింది....మళ్ళీ అతకా లంటే ఆర్నెల్లు పడుతుందట. అంతకాలం పడకమీద వుండాలి. పడకమీంచి పత్రికను నడపలేడు, అవునా? అందుకని సుందర్, అతను తిరిగి యాక్షన్‌లోకొచ్చేవరకు పత్రికను నువ్వు చేపట్టు! ఎట్టి పరిస్థితిలోనూ కుంటుపడ కూడదు పత్రిక! పాలసీకి విరుద్ధం. నీమీద నాకున్న పూర్తి విశ్వాసంతో ఈ బాధ్యత నీ కప్పగిస్తున్నాను.... ఈ క్షణంలో రంగంలో దిగు!" బాస్ మాటలు నన్ను చకితుడ్ని చేశాయి, పదే పదే చెవిలో మోగుతున్నాయి-

ఇది నేను శ్యామల చెవిన వేసినప్పుడు ఆమె ఎంతో ఆనందపడింది. ఆమెని నేనెప్పుడు ఆనందంగానే వుంచ డానికి ప్రయత్నిస్తాను. ఆడవాళ్ళని ఆనందంగానే ఉంచాలి. అప్పుడే పుష్టికరమైన ఆహారం, మానసికా ఆరోగ్యం చేకూరుతాయి. రిపోర్టర్‌కి ఇవి రెండూ చాలా ముఖ్యావసరాలు. లేకపోతే అవకతవకలు జరుగుతాయి. నా ప్రయోజకత్వానికి మురిసిపోయి శ్యామల నన్ను ఉక్కిరిబిక్కిరి చేసేస్తోంటే తన మాటలతో, నిజంగానే ఇక నేను ఎడిటరు నన్నట్లుగా భ్రమలోపడ్డాను.

ఆ భ్రమలోనే నిన్న హాస్పిటల్‌నుంచి శర్మ ఫోన్ చేసినప్పుడు, "ఎవరు మీరు? మీరెవరో నాకు తెలియదు. ఇక్కడ నేను తప్ప మరో ఎడిటర్ ఎప్పుడూ లేరు!" అనేశాను.

శ్యామల పొగడ్తల వర్షంతో నన్నూపిరాడనీయ కుండా చేసింది చాలక, "మీ చిన్న బాస్ కళకళ

లాడుతూ కలకాలం పడకలోనే గడపాలనీ అందరి దేవుళ్ళకూ మొక్కుకుంటున్నాను...." అంది తన మొక్కుబడి ఫలిస్తుందన్న నమ్మకంతో.

అలా నేనిప్పుడు—ఇక్కడ—ఈ సుప్రసిద్ధ పత్రికా ఆఫీసులో, శర్మ కూర్చునే అత్యంత గౌరవప్రదమైన స్థానంలో, చుట్టూ అంతులేని కాగితాల కట్టల మధ్య, చేతికింద మెరికలాంటి అసిస్టెంట్ ఎడిటర్ మోహాన్ కుమార్‌తో, తదుపరి సంచికకు సన్నాహాలు పూర్తిచేస్తూ బిజీగా వున్నాను.

సమయం మూడున్నర దాటింది. మధ్యాహ్నం. ప్రక్క గదిలోంచి చిత్ర చేస్తోన్న టైపింగ్ మిషన్ టపటపలు తప్ప, ఆఫీసంతా నిశ్శబ్దంగా వుంది.

నేనూ మోహాన్, ఆ వారపు అత్యంత సంచలనకర వార్త అనదగ్గ ఒక రాజకీయ నాయకుడి అవినీతి ఆరోపణలపై రిపోర్టును పరిశీలిస్తున్నాం. ఈ రిపోర్టుని లోకల్ పొలిటికల్ కాలమిస్టు రవికాంత్ ఫైలుచేశాడు. రవికాంత్ సిటీలో పేరు పొందిన జర్నలిస్టు. నేను క్రైమ్ రిపోర్టరుగా వుంటున్నాను. మరిద్దరు లోకల్ రిపోర్టరలతో పాటు దేశ వ్యాప్తంగా విలేకర్లున్నారు మా పత్రికకు.

ఈ ఆరోపణలు వచ్చిన రాజకీయ నాయకుడు బద్ధ శత్రువు బాస్‌కు. శత్రువు నీతి నియమాలతో వుంటే బాస్ పట్టించుకోడు. వాళ్ళలో ఏమైనా గిల్టీ సీక్రెట్స్ వాసన చూశాడా, ఇక రచ్చకీడ్చి అపఖ్యాతిపాలు చేయకుండా వూరుకోడు.

బాస్ ఆదేశంమేనే రవికాంత్ ఈతన్ని రీసెర్చిచేసి ఈ రిపోర్టు ఫైలుచేశాడు. ఇది వచ్చే సంచికలో ముఖ

పత్రిక శీర్షికగా రావాలని చెప్పాడు బాస్. అందుకవసరమైన లేఅవుట్స్‌ని సిద్ధం చేస్తున్నాడు, అవతలి గదిలో ఆర్టిస్టు సుధాకర్. రేపు ఉదయం మేటరు ప్రెస్‌కెళ్ళిపోవాలి.

మోహన్ తను చూస్తున్న కాగితాలు పట్టుకుని చటుక్కున లేచి చిత్ర గదిలోకి పరుగెత్తాడు. అతను ఏ క్షణంలో ఏం చేస్తాడో తెలియదు. అన్నీ చటుక్కున చేస్తాడు.

నేను మళ్ళీ కాగితాలమీదకి దృష్టిని మళ్ళిస్తూండగా ఫోన్ మోగింది....

తల తిప్పి దాన్నందుకున్నాను. "యస్, ప్లీజ్?" అన్నాను పరాకుగా.

"మిసెస్ సుందర్ స్పీకింగ్" అంది అవతలి గొంతు.

తేరుకున్నాను. "ఓహ్, చెప్పండి! ఏమిటి సంగతి?"

"మీకో శుభవార్త!" ఆమె గొంతులో చెప్పలేనంత ఆనందం వుంది.

నాకేదో తట్టింది....ఉద్రేకపడ్డాను.

"ఓహ్, నిజంగానా? అప్పుడే!...ఎప్పుడు తెలిసింది?" అరిచాను.

"ఏమిటి తెలిసేది?" ఆమె గొంతు సీరియస్‌గా మారిపోయింది.

"అదే! మన మధ్యకి....జూనియర్ సోమసుందర్ రాబోతున్నాడని!"

"నోర్ముయ్యండి!"

ఉలిక్కిపడ్డాను.

"పిచ్చి వూహాలు మానండి!" మళ్ళీ అరుపు, "తెలివి

తెచ్చుకోండి! మనం ఒప్పందం చేసుకున్న 'అయిదు సంవత్సరాల ఆనందమయ జీవన కాలపరిమితి' ఇంకా పూర్తికానేలేదు, అప్పుడే వాడెవడూ జ్యూనియరు సోమసుందరమంటూ మన మధ్య రావడానికి?"

నెమ్మదిగా తేరుకున్నాను. "మరి నువ్వు చెప్పే ఆ శుభవార్త ఏమిటి?"

"అ—శుభవార్త కాదు."

"నువ్వు సరిగ్గా వినలేదు."

"నేనీ రాత్రి పార్టీ యిస్తున్నాను...."

తికమకపడ్డాను. "పార్టీ యా? ఎందుకు? ఎవరికి?"

"అందరికీ....మనకు తెలిసిన వాళ్ళందరికీ! ఎందుకా— దేశం గర్వించదగ్గ మన పత్రికకి మీరు ఎడిటరు అయిన ఈ శుభ సందర్భాన్ని పురస్కరించుకుని, నేనీ రాత్రి అందరినీ విందుకాహ్వానిస్తున్నాను....అర్థమైందా?"

అదిరిపడ్డాను. నా కళ్ళు తిరిగాయి.

"నీకు తల తిరిగిందా? అవతల కాలు విరగ్గొట్టుకుని వున్నాదే శర్మ!" ఆవేశంగా అన్నాను.

"మాటలు జాగ్రత్త! సంసారం ఈదలేక సతమత మయ్యే సగటు జీవిలా ఏమిటా ఏడుపు సంబోధన? వాట్ యువర్ లాంగ్వేజ్" బెదిరింపు.

నాకేమనాలో తోచలేదు.

"వాళ్ళందర్నీ రమ్మన్నాను. యెనిమిది గంటలకి రావడం ప్రారంభిస్తారు....మీరు ఏడుగంటలకల్లా ఇక్కడుండాలి, వింటున్నారా? మీ స్టాఫ్‌ని కూడా తీసుకు రండి, అర్థమైందా? మర్చిపోకండి...."

నా రక్తం కుతకుతలాడిపోయింది.

"నీకు తల తిరిగింది! కళ్ళు నెత్తికెక్కాయి! నిన్నూ

నన్నూ తన్ని తగలేస్తాడు శర్మ, ఈ సంగతి తెలిస్తే!"

"మీకా భయం అక్కర్లేదు. కాలు విరిగింది, తన్న లేదు. మంచంమీద వుండగా మన సంగతీ తెలియదు. ఆయనకా మంచంమీదనే శాశ్వత వాక్కులు ప్రసాదించమని నేనందరు దేవుళ్ళకూ మొక్కుకున్నాను.... మీకేం భయంలేదు. నా మొక్కుబడి ఫలిస్తుంది. మీరు వొచ్చేయండి ఏడుగంటలకి!"

నన్నింకేమీ మాట్లాడనియకుండా ఫోన్ పెట్టేసింది.

నాకేంచేయాలో పాలుపోలేదు. చెమటలు తుడుచుకున్నాను, చుట్టూ చూస్తూ. గదిలో ఎవరూ లేరు. ఈ సంభాషణ ఎవరూ వినలేదు. ఒక నిమిషం ఆలోచించాను. ఫోనెత్తి ఒక నెంబరు తిప్పాను.

అవతలి గొంతు మధురంగా పలికింది. "యస్, దిసీజ్ శ్రద్ధాంజలి నర్సింగ్ హోం ప్లీజ్!"

ఉలిక్కిపడ్డాను. "మిస్టర్ శర్మ కావాలి!" అనేశాను వెంటనే.

"ఏ శర్మ, సర్?"

"ఎందరు శర్మగార్లున్నారు మీ మంచాలమీద?"

"నల్గురున్నారు, సర్."

"ఇవ్వాళ ఎవరికైనా శ్రద్ధాంజలి ఘటించారా?"

"ఇంకా లేదు, సర్."

"అయితే వినండి....నాకు కావలసిన శర్మ—శ్రీశ్రీ పుణ్యామూర్తుల విశిష్ట వేదాంత బాలకిషోర శివరామ శర్మ. మర్చిపోయారా? మళ్ళీ చెప్తాను...."

"అక్కర్లేదు, ఆగండి! మీరెవరని చెప్పాలి?"

చెప్పి ఆయాసం తీర్చుకున్నాను. శర్మ లైనులో కొచ్చాడు. నా గుండె వేగంగా కొట్టుకోసాగింది....

"ఏం బాబూ! ఇప్పుడు గుర్తొచ్చానా? నేనంత పనికి రాని తక్కువై పోయానన్నమాట!" అన్నాడతను నిష్ఠూరంగా.

ధైర్యం తెచ్చుకున్నాను. "క్షమించండి, సర్. మీకు ఫోన్ చేయాలనే అనుకుంటున్నాను ఉదయంనుంచీ! ఇక్కడ పని తెమలటంలేదు. ఇవ్వాళ మీరెలా వున్నారు సర్?"

"ఆ మాట నువ్వడుగుతున్నావా, సుందర్?"

"నేనే, సర్? ఎందుకలా అన్నారు, సర్?"

"నువ్వు నా యోగ క్షేమాలు తెలుసుకోవడానికే ఫోన్ చేశావా, సుందర్?"

"నేను... నేను.... సర్, మీకో విషయం చెప్పాలి!"

"అలా చెప్పు! ఈ హిపోక్రసీ మాని, యెందుకు పిలిచావో తిన్నగా చెప్పు!"

గొంతు తడుపుకున్నాను. "సర్, మీపై ఆసక్తి నశించిందనికాదు! నా పరిస్థితిని అర్థంచేసుకోవడంలేదు మీరు.... టెన్షన్ సార్! నేనిప్పుడు పెద్ద ఆపదలో వున్నాను. మిమ్మల్ని ఎప్పుడైనా నొప్పించానా, సర్? ఏ విషయంలోనైనా? ఇప్పుడా ట్రాప్ లోనే పడ్డాను. దీనికి నేనే బాధ్యుడ్ని కాకపోయినా మీ మనస్తాపానికి నేనే కారణమన్నవుతాను.... నన్నీ ఆపదనుంచి కాపాడండి సర్! మీరే నాకు దిక్కు. శ్యామల నా మాట వినటం లేదు—"

"ఏమంటోంది?"

"నేను సిగ్గుపడుతున్నాను.... సర్."

"అది పెళ్ళిచేసుకున్న పాపానికి! చెప్పు, ఏమంటోంది శ్యామల?"

గుండె ఆగి ఆగి కొట్టుకుంటోంటే గబగబా చెప్పేశాను. అతను విన్నాడు. చెమటలు తుడుచుకుంటూ మాటలకోసం చూశాను—

అప్పుడన్నాడు ఎంతో శాంతంగా. "అంతే కదా? అయితే విచారిస్తావెందుకు... వెళ్ళి దిగ్విజయం చెయ్ ఫో!"

"సర్!" అరిచాను.

"అవును, సుందర్. నాకంతా తెలుసు. నిన్న నువ్వు మాట్లాడిన తీరూ, ఇప్పుడు నీ శ్యామల ప్రవర్తిస్తున్న పద్ధతీ చూస్తే నాకంతా అర్థమైపోయింది. నే నెవరికీ అక్కర్లేదు. యిప్పుడు నా అవసరం యెవరికీ లేదు. ఎక్స్పెర్టు! అవుటాఫ్ సర్క్యులేషన్! కాలు విరిగితే నే కాటికి చేరుకున్నట్లు మీమీ లాభాలు చూసుకుంటున్నారు. చూసుకోండి! చేసుకోండి! మీ ఇష్టంవచ్చినట్లూ ప్రవర్తించండి! నన్నిక కలవరించకండి!"

"సర్, సర్, సర్, ఓహ్, సర్....ఎంతమాట!"

"అంతే సుందర్, ఇక నాతో మాట్లాడకు!"

"సర్, మీరిలా మాట్లాడితే అంతా వదిలేసి ఎక్కడికయినా వెళ్ళిపోతాను! నిన్న మతి పోగొట్టుకుని ఏదో అనేశాను! ఆనందంలో మతి పోగొట్టుకోరా, సర్? తర్వాత క్షమించమనీ అడిగాను కదా? ఇది అన్యాయం, సర్. మీ సలహాకోసం, మీ సహాయం కోసం మంచి మనసుతో నేనరిస్తోంటే మీరిలా అంటున్నారు....మీరు తప్ప నన్నీ ఆపదనుంచి కాపాడలేరు, సర్! ఆమె నా మాట వినదు. తన పంతం నెగ్గించుకు తీరుతుంది! తర్వాత ఎంత అభాసవుతాం! నేను అసహాయుణ్నయిపోయాను, సర్! ఈ పార్టీని ఆపాలి! నా పరువు కాపాడాలి! శ్యామలని కొప్పడి మీ రెలాగయినా...."

"ఆమెను ఎందుకో కాపడాలి?" అన్నాడు తను విసురుగా, "నిన్నెందుకు కాపాడాలి? నేనెవర్నిప్పుడు? సుందర్, మనమంతా ఒక కుటుంబంలా మెలిగాం. నీ శ్యామల నన్ను బాబాయ్ అని పిల్చి ఆప్యాయత చూపేది. ఇప్పుడు సహజంగానే స్వార్థం మేల్కొని బుద్ధి పోగొట్టుకుంటే నేనెందుకు అడ్డుపడాలి?"

"ఆడవాళ్ళకి బుద్ధివుండదు, సర్. ఒప్పుకుంటాను."

"అందుకే పెళ్ళి వద్దురా బాబూ అన్నాను. విన్నావా? నేను చేసుకోలేదు. చూడు ఎలా వున్నానో శుభ్రంగా. ఇప్పుడు నా చుట్టూ చేరి గోల్లున ఏడుస్తూ నాకు నీరసం తెప్పించేవాళ్ళున్నారా? లేరు! న్యూసెన్స్ లేదు! ఏం చక్కా రెస్టు తీసుకుంటున్నాను. లాభాలున్నాయి, సుందర్, బ్రహ్మచర్యంలో వున్న సదుపాయాలు...."

"సర్, అంత నిగ్రహం నాకు లేదు. నేను అందరిలాంటి మనిషిని. బ్రహ్మచారులు కొందరే తేలుతారు. వాళ్ళు పొందని అదృష్టం....మీరు క్షమిస్తే...."

"ఏమిటి సుందర్?"

"పుష్టికరమైన ఆహారం, మానసికారోగ్యం, సర్."

కొన్ని క్షణాలు నిశ్శబ్దం.

"ఐసీ....ఆహారం గురించి ఆలోచించేవాడు దున్నపోతై పుట్టుగాక!"

"సర్! అలాగే అనుకోండి! కానీ ముందు నన్నీ ఉపద్రవంనుంచి కాపాడండి!"

పెద్దగా నవ్వి "పెళ్ళి చేసుకున్న పాపానికి కొన్ని అనుభవించాలి, తప్పదు! నిన్ను ఆ పైవాడే కాపాడు గాక!" తక్కున లైను కట్ అయింది.

కొయ్యబారిపోయాను. మెదడు శూన్యంగా మారి పోయింది. చిత్ర కొన్ని కాగితాలు పట్టుకొచ్చి టేబుల్ మీద పడేసి వెళ్ళిపోయింది కావాలని నడుము ఊపు కుంటూ. తేరుకున్నాను. నడుములు! ఈ ఆడవాళ్ళకి నడుములెందుకిచ్చావురా భగవంతుడా! ఇచ్చినా ఊపమని ఎందుకన్నావు. పరీక్ష పెట్టడానికి! అన్యమనస్కంగా ఆ కాగితాలు చూస్తూ వుండిపోయాను. అప్పుడు నాకో పిచ్చి ఆలోచన వచ్చింది. పిల్లిని గదిలో బంధిస్తే పిచ్చిగా రెచ్చిపోతుంది. శ్యామలని కిరాయి మనుషులతో కిడ్నాప్ చేయించి, ఈ రాత్రికి యెక్కడైనా మాయం చేయాలన్పించింది....

ఫోన్ మోగి ఆలోచనల్ని చెదరగొట్టింది.

ఎత్తి రెస్పాన్స్ ఇచ్చాను.

"మీరు వెంటనే రావాలి!" అంది అవతల్నుంచి గొంతు.

ఆవేశపడ్డాను. "మళ్ళీ నువ్వా .... నీ కళ్ళు నెత్తి కెక్కాయి!"

"క్షమించండి, మిస్టర్ సుందర్, నేను నీరజని. మీ బాస్ సెక్రటరీని."

అదిరిపడి తేరుకున్నాడు. "ఓహ్, అయాం సారీ సిస్టర్!"

"డోంట్ మైండ్, మీరు వెంటనే రండి, బాస్ పిలుస్తున్నారు!"

ఆమె గొంతులో గాభరా పసిగట్టాను, "ఎందుకు? ఏం జరిగింది?"

"ఇక్కడికి రండి తెలుస్తుంది! బాస్ వెంటనే రమ్మన్నారు!"

"వచ్చేస్తున్నాను...." గబగబ లేచాను, "కానీ యెందుకో చెప్పకూడదా?"

ఆమె గాభరా మరింత ఎక్కువైంది. "బాస్ కారులో యెవరో టైంబాంబు పెట్టారు...." అందామె ఫోన్ పెట్టేస్తూ.

నా బైక్ తుపాకీలోంచి వెలువడ్డ గుండులా దూసుకు పోతోంది. ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి.... టైం బాంబు! బాస్ కారులో! నా వళ్ళు గగుర్పొడిచింది.... ఇదెవరి దుశ్చర్య? యెవరు పాల్పడ్డారీ ఘాతుకానికి?

అప్పుడు జరిగింది అనుకోకుండా....

ఎలా జరిగిందో నాకు తెలియదు! కానీ నేను బ్రేకు వేశాను. ఎందుకో ఆగలేదు. అంత వేగంతోనూ వెళ్ళి నా బైక్ ఎదురుగా మలుపు తిరుగుతోన్న బస్సును గుద్దేసింది. నేను గాలిలో కెగిరి కొన్ని చుట్లు తిరిగాను—

## 2

తిరిగి కళ్ళు తెరిచినప్పుడు, ఆ గదిలో చాలామంది కన్పించారు.

కంగారుగా లేచి కూర్చోబోయాను, ఓ చెయ్యి నన్నాపింది.

"పత్రికా సంపాదకులు శ్రీయుతు సోమసుందర్ గారికి శ్రద్ధాంజలి నర్సింగ్ హోం ఘన స్వాగతం!" విన్పించాయి మాటలు.

తల తిప్పి చూశాను. ప్రక్క బెడ్ మీద శర్మ కన్పించాడు, నవ్వుతూ.

"ఇద్దరం ఇక్కడేనా?" అడిగాను.

తలూపాడతను. "గది కూడా ఒకటే, మంచాలే వేరు."

బాధగా మూలిగి తల తిప్పుతున్నాను. అప్పుడు కనిపించింది శ్యామల, నా తల ప్రక్కన, ఆతృతగా చూస్తోంది. చేతో నుదురు తడుముతూ, "యెలా వున్నారు?" అనడిగింది ఆందోళనగా.

"ఫైన్" అన్నాను, నన్ను నేను చూసుకుంటూ. తలకి, కాళ్ళకి, చేతులకి కట్లున్నాయి. వళ్ళంతా నొప్పులుగా వుంది.

అక్కడే వున్న నర్సు డాక్టరు కోసం వురికింది.

అప్పుడు కదిలి వచ్చారు వాళ్ళు, కిటికీ దగ్గరనుంచి— మా బాస్, ఆయన సెక్రటరీ నీరజ, బాడీగార్డు రాబర్టు, అతని మనుషులిద్దరు....

బాస్ ప్రక్కనే కుర్చీలో కూర్చుంటూ నన్ను చూశాడు. ఆయన కళ్ళు ఒక్కసారి జీవం నింపుకున్నట్లయ్యాయి. తేలిగ్గా నిట్టూర్చాడు.

"యూ ఆర్ లక్కీ. ఇట్ వజె నేరో ఎస్కేప్" అన్నాడాయన.

తలూపి, "థాంక్యూ, సర్" అన్నాను.

ఆయన మళ్ళీ నిట్టూర్చి తలుపు వంక చూశాడు. డాక్టరు అప్పుడే హడావుడిగా వచ్చి, నన్ను ప్రశ్నలడిగి, ఓ ఇంజక్షను ఇచ్చి, "యూ ఆర్ క్వయిట్ ఆల్ రైట్" అన్నాడు నవ్వుతూ, "ఈ రాత్రికి వుండి రేపుదయం వెళ్ళిపోవచ్చు. అదృష్టంకొద్దీ మైనరు గాయాలతో తప్పించుకున్నారు. నో ఫ్రాక్చర్సు, నో బ్లీడింగ్. డోంట్ వర్రీ. ఉదయం లేచి మీరు తిరుగుతారు....

బాస్ వైపు తిరిగి మళ్ళీ అన్నాడు డాక్టరు. "ఓ.కే. సర్. ఇక ఫరవాలేదు. మీరు మాట్లాడుకోవచ్చు, ప్రైవసీ కల్పిస్తాం.... మిమ్మల్ని ఇక యెవరూ డిస్టర్బు

చేయరు...."

అతను నర్సుకి సైగ చేసి బయటికి దారితీశాడు.

రాబర్టు మనిషి తలుపు మూశాడు.

బాస్ సిగారు తీసుకుని వెలిగించుకుని, శ్యామలని చూసి చిరునవ్వు నవ్వాడు. ఆయన ముఖంలో ఆందోళన పూర్తిగా మటుమాయమైంది. నా వైపు తిరిగాడు.

"యూ ఆర్ క్వైట్ ఈజీ. పోలీసులు నిన్నిక డిస్టర్బు చెయ్యరు. వాళ్ళని ఫైర్ చేశాను. వాళ్ళు మనకి తోడ్పడరు. నువ్వంత గుడ్డిగా యెలా నడిపావు? బ్రేకు లేవని తెలుసుకోలేదా?"

కలవరపడ్డాను.

అప్పుడు రాబర్టు అన్నాడు. "అవును సుందర్, మీరా రిక్షాలో వెళ్ళి పడకపోతే ఇలా వుండేవారు కాదు. బస్సుకి ఢీకొట్టి మీరు ఎగిరివెళ్ళి ప్రక్కనుంచే పోతున్న రిక్షాలో పడ్డారు. అందులో దంపతులున్నారు. వాళ్ళమీద పడ్డారు. కేక లేస్తూ వాళ్ళలాగే కూర్చుండి పోయారు. మీ బైక్ ముందు భాగం బాగా దెబ్బతింది. పోలీసులు రాష్ డ్రైవింగ్ కింద మిమ్మల్ని బుక్ చేస్తా మన్నారు. కానీ పరిశీలిస్తే అసలు మీ బండికి బ్రేకు లేవని తెలిసింది...."

"బ్రేకులేవా!"

"లేవు, సుందర్ యెలా పోయాయో తెలుసా మీకు? అవి కావాలని తీసేసినట్లున్నాయి...."

"కావాలని తీసేశారా!"

"అవును, కావాలని తీసేశారు. బండిని విడిపించుకుని గ్యారేజివాళ్ళ కప్పగించాం. రిపేరులో వుంది. మీ బండికి బ్రేకులేకపోవడం, బాస్ కారులో బాంబు

వుండడం—ఈ రెంటికీ సంబంధముందనిపిస్తోంది...."

ఉలిక్కిపడ్డాను. టైంబాంబు! దాని గురించే మర్చిపోయాను. చటుక్కున బాస్‌ని చూశాను. "సర్, మీ రెలా వున్నారు? అది విని నా ప్రాణా లెగిరిపోయాయి...." అన్నాను ఆందోళనగా.

ఆయన తేలిగ్గా నవ్వాడు. "డోంట్ యూ బాదర్. అది కూడా నేరో యెస్కేపే."

"బాస్ కారులో టైంబాంబు బానెట్‌లో కనిపించింది" రాబర్టు చెప్పుకుపోతున్నాడు, "ఒంటిగంటకు ఆయన గుల్జారు హావుస్‌లో జైనేంద్ర జైన్ కుమార్తె పెళ్ళికి వెళ్ళారు. కూడా నేనూ వున్నాను. మూడు గంటలకి తిరిగి వచ్చేశాం. డ్రైవరు కార్బ్యురేటరు ట్రబులిస్తోందని బానెట్ తెరిచి చూశాడట—అప్పుడే అది కనిపించి నా దగ్గరకి పరుగెత్తుకొచ్చాడు. రాంగ్ టైమింగ్, సుందర్. గుల్జారు హావుస్‌నుంచి ఇంటికి చేరుకునేందుకు పట్టే కాలాన్ని తప్పు అంచనా కట్టడంవల్ల ప్రమాదం తప్పింది' ఇరవై అయిదు నిమిషాలకి ఇగ్నైట్ కావల్సింది, నలభై నిమిషాలకి సెట్ చేయబడింది. గాడ్ సేవ్‌డజ్! ఇంకో పదినిమిషా లుండనగా డ్రైవరు చూశాడు. వెంటనే దాన్ని తీసి నేను డిఫ్యూజ్ చేశాను...."

"ఓహ్, ఇలా యెప్పుడూ జరగలేదు!" అన్నాను ఆందోళనగా.

"అవును. కానీ ఇప్పుడెవరీపని చేశారో తెలియడం లేదు. శత్రువులు పలువురు. యెవరని చెప్పగలం? కారు గుల్జారు హావుస్ ఎదుట పార్కు చేసినప్పుడే దాన్నెవరో ప్లాంట్ చేశారు. పావుగంటసేపు డ్రైవరు కారు వదిలి వెళ్ళానంటున్నాడు, సమీపంలోని హోటల్‌కి. అప్పుడే

జరిగింది ... నా మనుషుల్ని వెంటనే అక్కడికి పంపాను. ఇంకా రిపోర్టు రాలేదు...."

"పోలీసులకి తెలిపారా?"

"లేదు. మనకి వాళ్ళ అవసరమేమిటి? మనకి వాళ్ళతో మంచి డీలింగ్స్ లేవు. దీన్ని మనమే హాండిల్ చేయాలి. అయితే ఇప్పుడు నాకింకో అనుమానముంది...."

"ఏమిటి?"

"శర్మగారి ట్రాజడీ. ఆయన యాక్సిడెంట్ సహజం కాదనిపిస్తోందిప్పుడు...."

నేను ఉలిక్కిపడ్డాను.

శర్మ కంగారుగా చూశాడు. "ఎలా అంటున్నావు, రాబర్టు?"

"జరుగుతున్న సంఘటనల్ని చూస్తే అలాగే అనిపిస్తోంది...." చెప్పాడు రాబర్టు, "మనల్నందర్నీ, లేక మనలో కొందర్ని అంతంచేసే కుట్ర ఏదో జరుగుతోందని నా కనుమానంగా వుంది. మొదట మీరు. తర్వాత బాస్. ఆ తర్వాత సుందర్, ఇంకా ఆ తర్వాత....

"వెల్! మీకు యాక్సిడెంట్ జరగలేదు, జరిపించబడిందని చెప్పడానికిప్పుడు ఆధారాలు దొరకవు. మీరు మెట్లెక్కే పద్ధతి శత్రువుని ఆకర్షిస్తే సులభంగా కల్పించగలడు ప్రమాదాన్ని. మెట్లకడ్డంగా సన్నని, వెంట్రుకవాసి మందం తీగ కడితే చాలు, ఇలాంటివి జరుగుతాయి. తర్వాత తీగ మాయమవుతుంది. మీరు కింద వుంటారు గాయాలతో. మీరెలా మెట్లెక్కుతారో ఆఫీసు బిల్డింగ్‌లో వాళ్ళకి దాదాపు అందరికీ తెలుసు కాబట్టి మీరు కాలు జారారనే నమ్ముతారు. మరొకటి అనుమానించరు. మీకు కూడా అలాగే అనిపించి వుండాలి...."

"మై గాడ్! నా కళ్ళకేదో అడ్డుపడినట్లు గుర్తు లేదు!"

"మీరు కిందపడిపోయి స్పృహ తప్పారు. కానీ మీరిక్కడ ప్రాణాలతో వున్నారని తెలిసి రాలేదు మళ్ళీ వాళ్ళు. అంటే వాళ్ళకి మీ ప్రాణాలు అవసరం లేదు. అంగవైకల్యం కల్పించాలనుకుని వుంటారు. సుందర్ విషయంలో ఏదీ చెప్పలేం. బ్రేకులు తీశారంటే ప్రాణాలే తీయాలనుకున్నారు. ఏదేమైనా మీరంతా క్షేమంగా వున్నారు. మన సిస్టంని ఇప్పుడింకా కట్టుదిట్టం చేయాలి. ఈ రాత్రికి ఇక్కడ నా మనుషులు వీళ్ళిద్దర్ని గార్డుచేస్తారు. బాస్‌ని నేను స్వయంగా గార్డు చేస్తున్నాను...."

"ఓహ్, వాళ్ళెవరో తెలుసుకోవాలి, రాబర్ట్!"

"ఆ ప్రయత్నంలోనే వున్నాం...." అన్నాడు బాస్ కల్పించుకుని, "త్వరలోనే తెలుస్తుంది....మీరు వర్రీకాకండి. మీకేం ప్రమాదంలేదు. పూర్తి రెస్టు తీసుకోండి" బాస్ లేచి తిరిగి అన్నాడు, "ఒకటి మాత్రం గుర్తుంచుకోండి. నో పోలీస్, నో ప్రెస్, నో పబ్లిసిటీ! మనలాగే మన శత్రువు కూడా గుట్టుగా అనుభవించాలి!"

మేమంతా తలలూపాం. బాస్ తలుపు దగ్గరికి కదిలాడు. శ్యామల నన్ను చూసింది బెదురుగా. కళ్ళతో ధైర్యం చెప్పాను.

"నేనెంత భయపడ్డానో తెలియదు మీకు!" అందామె.

నవ్వాను. "నన్నెంత బెదిరిస్తావో అంత భయపడతావు! ఇవ్వాళ నీ పార్టీ...."

"వైవాడు నిన్ను కాపాడేడు!" శర్మ అందుకుని

అన్నాడు.

ఫోన్ మోగింది హఠాత్తుగా.

నీరజ గబుక్కున వెళ్ళి ఎత్తింది. అవతలి మాటలు వింటూ ఆమె ఉద్రేకపడసాగింది. మేం ఆదుర్దాగా చూస్తున్నాం. అప్పుడామె రిసీవరు విసిరికొట్టి గిరుక్కున తిరిగింది, పాలిపోయిన ముఖంతో—

బాస్ తలుపుదగ్గరాగిపోయి చూస్తున్నాడు.

నీరజ మాటలకోసం తడబడింది. "సర్....ఆఫీసు మీద యెవరో దాడి జరిపారట! ముగ్గురు ముసుగు మనుషులు! చిత్రనీ, మోహన్‌నీ బాగా కొట్టి, ఫర్నీచరు ధ్వంసంచేసి, ఫైళ్ళు తగులబెట్టి పారిపోయారట—"

# 3

ఈ వార్తను మర్నాడు అట్టాహాసంగా ప్రచురించాయి పత్రికలు.

రెండు ప్రభుత్వ పక్ష పత్రికలు—వ్యక్తుల, సంస్థల ఆంతరంగిక విషయాలతో చెలగాటమాడే ఇలాంటి పత్రికలకి ఇటువంటి గుణపాఠమే జరుగుతుందని వాపోయాయి.

మరో దమ్ములేని పత్రిక—విర్రవీగి వగుచుట ఏల? అని వంత పాడింది.

ఒక తటస్థ పత్రిక — పత్రికా స్వేచ్ఛని హరించే ఇలాటి పాశవిక కృత్యం ప్రజాస్వామిక మూలసూత్రానికే గొడ్డలిపెట్టు అని ఉద్ఘాటించింది.

ఇంకో వామ పక్ష పత్రిక — ఈ దురాగతానికి బాధ్యులైన దోషుల్ని వెంటనే పట్టుకుని శిక్షించకపోతే ప్రభుత్వం గద్దె దిగిపోవాలని హెచ్చరించింది.

ప్రెస్‌ని నివారించడం మాకు కష్టమే అయింది—

వాళ్ళప్పటికే ఆ ఫీసును ఆక్రమించుకున్నారు. ఫోటోలు తీసుకున్నారు. మోహన్‌నీ, చిత్రనీ ఇంటర్వ్యూకి వేధించారు. బాస్ ఆదేశానుసారం వాళ్ళంగీకరించలేదు. అక్కడ్నించి బాస్ మీదకీ దండయాత్ర చేసి బలవంత పెట్టారు. బాస్ నోరు విప్పలేదు. నో కామెంట్ అనే శారు. ఫోటోలు తీయడానికి కూడా తిరస్కరించారు.

ఇంతలో నా యాక్సిడెంట్ విషయం పోలీసులు బయట పెట్టేయడంతో, మొత్తం విలేఖరులంతా మిడతల దండులా వచ్చిపడ్డారు నర్సింగ్ హోంమీద! అక్కడున్న రాబర్టు మనుషులు ఏమీ చేయలేకపోయారు. అంత వరకూ తాము గాలిస్తూన్న ఎడిటరు శర్మ కూడా అక్కడే వుండటంతో, విలేకర్లింకా చెలరేగిపోయారు. అయితే మానుంచి ఒక్క మాటా రాబట్టుకోలేకపోయినా, మమ్మల్నిద్దర్నీ ప్రక్క ప్రక్క మంచాలమీద జాయింటుగా ఫోటోలు తీసుకుని మాత్రం ఉడాయించారు.

ఆ ఫోటో పత్రికలలో వచ్చింది. ఫ్లాష్‌లు జిగేలు మంటున్నప్పుడు అంత కలవరంలోనూ మేమిద్దరం జాగ్రత్తను విస్మరించలేదు, ఫోటోలకు ఇవ్వవల్సిన పోజు విషయంలో. దైన్యంగా, మరీ పేషంట్లలాగ కన్పించక, అప్పుడే అంతరిక్షంలోంచి సురక్షితంగా లాండింగ్ అయిన రోదసీ యాత్రికుల్లాగ నవనవలాడుతూ, ఇనుమడించిన ఉత్సాహంతో ఫోజిచ్చాం.

మనసు ఎంతైనా కలవరపడనీ, పైకి నవ్వులు కురిపించు: చుట్టూ ఎంత ఇబ్బందికర వాతావరణమైనా వుండనీ, పైకి హుందాతనం కనబర్చు: అప్పుడు శత్రువు ఆత్మ విశ్వాసం సగం బలహీన మవుతుంది—అన్న బాస్ సూక్తిని అక్షరాల పాటిస్తాం.

రాత్రంతా నర్సింగ్ హోంలోనే గడిపి, ఉదయమే ఇంటికి చేరుకున్నాను. స్నానంచేసి ఈ పత్రికలన్నీ చూస్తున్నాను. రాత్రి ఆఫీసుమీద దాడి నన్నెక్కువ ఆందోళన పరుస్తోంది. రాత్రే మోహన్‌కుమారు చెప్పిన దాన్నిబట్టి ఫర్నీచరు, ఇతర వస్తుసామగ్రికి చాలా నష్టం వాటిల్లింది. రేపు ప్రెస్‌కి వెళ్ళవల్సిన మేటరు పూర్తిగా ధ్వంసం చేయబడింది. చాలా ఫైళ్ళూ, ఎక్కౌంటు పుస్తకాలూ కాల్చివేయబడ్డాయి. మోహన్‌నీ, చిత్రనీ బాగా గాయపర్చారు. వాళ్ళిద్దరు వేరే హాస్పిటల్‌లో చికిత్స పొందుతున్నారు.

ఆ దుండుగుల్లో ఎవరి ఆనవాలనీ వాళ్లు చెప్పలేక పోతున్నారు. వాళ్ళు తలమీదుగా ముసుగులేసుకున్నారు. వాళ్ళెవరై వుంటారు? ఎవరీ వెనుకవుండి దాడీలు జరిపిస్తున్నాడు? అదెవరైనా తన రహస్యాలు బయలయ్యాయన్న కక్షతో ఇవన్నీ చేయిస్తున్నాడని తెలుస్తోనే వుంది.

అయితే తన ఈ దురవస్థకు ప్రత్యక్ష కారకుడయిన ఏ రిపోర్టరుమీదా దాడి జరిపినట్లు వార్తలేదు. రవికాంత్ క్షేమంగానే వున్నాడు. మిగతా అన్నిచోట్లా అందరు విలేకర్లూ సురక్షితంగానే వున్నారు. ఒకవేళ ఏ రిపోర్టరయినా దాడికి గురయివుంటే, అతనింతవరకు ఫైలుచేసిన రిపోర్టునిబట్టి వాళ్ళల్లో ఎవరెవరికి ఈ దాడులు జరిపించే అవకాశముందో తెలుసుకునే వీలుండేది. అప్పుడా తెలిసిన పరిధిలో కొనసాగి శత్రువుని కనుక్కోవడం కష్టంగాకపోయేది.

కానీ అలాలేదు పరిస్థితి. పరిధి అనంతంగా వుంది—ఒకరిని అని గాకుండా అందరు విలేకర్లు పంపిన రిపోర్టుస్నీ

దృష్టిలో పెట్టుకుని చూడాలి — అందరిలో ఈ శత్రువుని కనుక్కోవడం దుస్సాధ్యం. తన మనస్తాపానికి కారకుడయిన అసలు విలేకరి మీద నే దాడి జరపకుండా తెలివిగా వ్యవహరించి తనని కాపాడుకుంటున్నాడు శత్రువు. ఎక్కడా ఏ క్లూ వదిలినట్లు ఇంకా తెలియ రాలేదు.

నేనూ రిపోర్టరునైనా, నామీద దాడి ఎడిటింగ్ బాధ్యతలు స్వీకరించినందువల్లేననిపిస్తోంది. పత్రిక నడువ కుండా చేయడం వాళ్ళ ధ్యేయం కావచ్చు.

శ్యామల టిఫిన్‌కి పిలిచేవరకూ ఇలా ఆలోచిస్తూనే వున్నాను....

టిఫిన్ చేస్తున్నప్పుడామె మరింత విచారంగా, ముభా వంగా కన్పించింది.

ఆమెను చూసి నేనన్నాను. "నాకు జరిగిందానికి విచారించవచ్చు, అది నీ ధర్మం. ఫరవాలేదు. కానీ ఆ ముభావమే తీరని అపరాధం...."

ఆమె చటుక్కున అంది. "ముభావం కాదు, నిస్స హాయత! రిపోర్టర్ల జీవితాలు ఇంత భయంకరంగా వుంటాయనుకోలేదు!"

"అది ఇన్నేళ్ళకు తెలుసుకున్నావా?"

"ఎప్పుడో తెలుసుకున్నాను, కానీ మీరు వింటేగా? ఆడవాళ్ళు డిస్కరేజి చేయకూడదు మగవాళ్ళని, ఎంకరేజీ చేయాలని చెవిలో ఒకటే పోరుతుంటారుగా?"

నవ్వాను. "వెల్, యూ సీ డియర్, నే నెందులో నైనా దిగితే అగి అసామాన్షి వ్యవహారంగా వుండదు. నీకు తెలుసు, సీరియస్‌గా తీసుకుంటాను. కాయకష్టలా

కృషి చేస్తాను. కృషిని గురించి ఎందరెందరో గొప్పవాళ్ళు ఎన్నెన్నో సూక్తులు చెప్పారు-ఏమిటి? అవన్నీ చదువుకుని నాతో మాట్లాడు!"

ఆమె మాట్లాడలేదు. గబగబా తినేసి లేచిపోయింది.

నేను నిదానంగా తిని లేచిపోయాను.

అప్పుడే బయట ఏదో కారు హారన్ వినిపించింది. రాబర్టు మెదిలాడు. వెంటనే వెళ్ళి తలుపుతీసి చూశాను. రాబర్టు అనుచరుడు కృపాల్ కారు దిగుతున్నాడు.

అతను పరుగున లోపలికొచ్చి ఉద్రేకంగా అన్నాడు. "మీరిక బయలేరాలి!"

"ఎక్కడికి?" అడిగాను, కూర్చోమని చెప్తూ.

"బాస్ అప్పగించిన మిషన్‌కి!" చెప్పాడు కృపాల్ కూర్చుంటూ, "రాబర్టు బాస్‌ని కాపాడుతున్నాడు. నేను మీ మిసెస్‌కి రక్షణగా వచ్చాను. మీరా థగ్స్‌ని పట్టుకోవడానికి వెళ్ళాలి .... వాళ్ళని పట్టుకోకపోతే, మిమ్మల్నిక కనిపించవద్దన్నారు బాస్!"

నవ్వాను. "మరి లీడ్ ఏమిటి?"

"లీడ్ —" తల గోక్కున్నాడు కృపాల్, "ఓహ్, నిన్న గుల్జారు హౌస్ దగ్గర నేనే వాకబు చేశాను. బాస్ కారు పార్కు చేసిన సమీపంలో ఒక పాన్ షాపు వుంది. మెర్సిడిస్‌లాంటి పెద్ద కార్లు సహజంగా యెవరి దృష్టినైనా ఆకరిస్తాయి. అక్కడింకా చాలా వెహికల్స్ నిలిచి వున్నాయి. కానీ పాన్ షాపువాడిని మాత్రం మన బాస్ కారే బాగా ఆకర్షించింది — అతను చాలా టాకేటివ్‌గా ఉన్నాడు — కార్ల గురించి తన కలలు పావుగంట విశదీకరించాడు — బాస్ వాళ్ళు కారు దిగివెళ్ళిపోయాక డ్రైవరు కారు ప్రక్కనే నిలబడ్డాడట.

కాని కాస్సేపటి తర్వాత మళ్ళీ చూస్తే అక్కడ లేడట. తర్వాత నిమిషంలోనే గబగబా వస్తూ కన్పించాడట, రోడ్డు దాటి. అప్పుడు చేతిలో ఏదో బ్యాగు వుందట..."

"ప్రొసీడ్!"

"అతడలా వచ్చి కారు బాయ్‌నెట్ ఎత్తి దాని చాటున ఉండిపోయాడట. పాపతను ఆ చర్యను ఏమీ అనుమానించలేదట. రెండు నిమిషాల్లోనే తిరిగి అతను బాయ్‌నెట్ మూసేసి జనంలో కలిసి వెళ్ళిపోయాడట.. మళ్ళీ కాసేపటికి ఎదురుగా ఓ హోటల్లోంచి వస్తూ కన్పించాడట....అయితే ఈసారి చాలా నిదానంగా తీరుబడిగా వచ్చి నిలుచున్నాడట."

"ఓహ్, వాళ్ళిద్దరు ఒక్కరు కారని పాపతనికి తెలియదన్నమాట!"

"తెలియదు. ఆ ఆగంతకుడు మన డ్రైవరు సైజులోనే, డ్రెస్సులోనే ఉన్నాడు. తలమీద క్యాప్ కళ్ళమీదికి లాక్కున్నాడు. అందువల్ల పాపతను పొరపాటు పడ్డాడు. కానీ ఆ ఆగంతకుడి జాడ అక్కడ్నుంచి తీయలేకపోయాం."

"అయితే ఈ లీడ్ పనికిరాదు.." అన్నాను సిగరెట్ వెలిగిస్తూ, "కుట్ర ఎలా జరిగిందో ఇది తెలుపుతుందేగానీ, కుట్రదారుల్ని పట్టివ్వదు."

"మీ ఆఫీసు పార్కింగ్‌లో కూడా విచారించాం. అక్కడ వాచ్‌మన్ ఉండడు. ఎవరైనా స్వేచ్ఛగా వచ్చి మీ బైకు బ్రేకు లూడదీయవచ్చు...."

నాకేదో తట్టింది. చటుక్కున అతన్ని చూశాను.

"లీడ్ దొరికింది, కృపాల్!" అన్నాను.

"ఏమిటది?" అడిగాడతను కలవరంగా.

"బాంబుని ప్లాంట్ చేసిన వాళ్ళు బాస్ కారుని వెంటాడి వస్తారు, తమ ప్రయత్నం ఫలించిందో లేదో తెలుసుకోవడానికి, అవునా?"

"అవును, కానీ ఫలించలేదు...."

"ఫలించలేదు, కాబట్టి, దారిలో ఎక్కడా ట్రాఫిక్ జామ్ కావడంగానీ, జనం గుమిగూడడడంగానీ, అప్పు డందులోంచి తొందరగా బయటపడి పోవడానికి ప్రయత్నిస్తూ శత్రువుల వాహనం ఎవరి దృష్టినీ ఆక ర్షించే ప్రశ్నగానీ లేదు!"

"లేదు...."

"కానీ నా విషయంలో వాళ్ళ ప్రయత్నం ఫలిం చింది! కాబట్టి ఆ ప్రశ్న వుంది!" అన్నాను లేచి వెళ్ళ డానికి సిద్ధమవుతూ.

## 4

టాంక్ బండ్ పోలీస్ స్టేషన్‌లో సబిన్‌స్పెక్టర్ శివాజీరావ్ నన్ను శాంతంగా లోనికి రానిచ్చాడు. అప్పుడొక్కసారి అరిచాడు ఉగ్రుడయిపోయి.

"మీరా! ఎందుకొచ్చారిక్కడికి? ప్రవేశంలేదిక్కడ! చెక్కేయండి వెంటనే!"

బలవంతాన నవ్వాను. పోలీసులముందు నాకు నవ్వు రాదు.

"ఇన్‌స్పెక్టర్, మన సిద్ధాంతాలే వ్యతిరేకిస్తాయి. వ్యక్తిగతంగా మనకే కక్షలూ లేవు."

"ఓహ్, ఇప్పుడెందుకొచ్చారు? చెప్పి చెక్కేయండి వెంటనే!"

"నిన్న నా యాక్సిడెంట్ గురించి కుతూహలం కలిగి వచ్చాను...."

అతను తీక్షణంగా చూశాడు. "మీకెందుకు కుతూహలం? మిమ్మల్ని బుక్ చేయలేదనా? మిష్టర్ సుందర్, ఐ హేట్ యూ! మిమ్మల్నీ, మీ బాస్‌నీ, మీ బ్లడీ పత్రికనీ, మీ ముఠాగట్స్‌నీ....ఐ హేట్ దమాల్ బిట్టర్లీ!"

"అలాగే ఇన్‌స్పెక్టర్" అన్నాను సహనంగా, "మీరు అసహ్యించుకోండి! కానీ మానవతా దృష్టితో ఒక చిన్న సహాయం చేయండి. నిన్న నేను ఢీ కొట్టిన బస్ డ్రైవరెవరో, చెప్తే...."

అతను క్రూరంగా చూశాడు. "ఎందుకు? ఎందుకతను?"

"అతనికి ఋణపడి వున్నాను. త్రుటిలో నా ప్రాణాలు కాపాడలేమూ? అతడికంత తెలిపిలేకపోతే నేనిలా వుండేవాడ్ని కాదు. నా కృతజ్ఞతలు తెలుపుకోవాలి. అది నా ధర్మంగా భావించి వచ్చాను. మీరెంత పోలీసు వారైనా మానవజన్మ ఎత్తినవారే. మీలో మానవత్వముంటుంది. ఆలోచించండి. నాకీ అవకాశం కల్పించండి. ఇంతకంటే కోరేదేమీ లేదు."

అతనొక్కసారి దిగిపోయాడు. ఏమనుకున్నాడో, ఇలా చెప్పాడు. "చార్మినర్ డిపో, APZ 9981 నెంబర్ బస్సు, రూట్ నెంబర్ 42, డ్యూటీలో వున్న డ్రైవరు పేరు శివరావు....ఇక చాలా? చెక్కేయండిక!"

నేను చెక్కేసి అక్కడికి దగ్గర్లోనే శాంతా నర్సింగ్ హోంముందు కారు దిగాను.

మోహన్‌కుమార్, చిత్ర అక్కడే చికిత్స పొందుతున్నారు.

ముందు మోహన్‌కుమార్‌ని కలుసుకున్నాను. అతని

పరిస్థితి బాగానే వుంది. పరామర్శించడం అయ్యాక నేనడిగాను.

"మోహన్, వాళ్ళు మిమ్మల్ని కొడుతున్నప్పుడు ఎవరి పేర్లయినా ఉచ్చరించడంగానీ, ఫలానావారికి సంబంధించిన పత్రాలు ఇమ్మని అడగడంగానీ జరిగిందా?"

లేదని తలూపాడు మోహన్, "వాళ్ళసలు మాట్లాడలేదు, దేనికోసం వెతకలేదు. చేతికందినవి నాశనం చేసిపోయారంతే!"

"వాళ్ళు వచ్చేముందు నువ్వెక్కడున్నావు?"

"నా టేబుల్ దగ్గరే కూర్చున్నాను."

"నీ కుర్చీ వెనుక కిటికీలోంచి కింద పార్కింగ్ ప్లేస్, రోడ్డుమీద ట్రాఫిక్ బాగా కనబడుతుంది...."

"కానీ వాళ్ళు వచ్చేముందు నేను కిందికి చూడలేదు. పారిపోతున్నప్పుడు కిందపడిపోయి వున్నాను. వెంటనే లేవలేకపోయాను....అప్పుడు లేచివెళ్ళి కిందికి చూస్తే వాళ్ళకు వెహికల్ వుంటే కన్పించేదేమో .... కానీ నాకా ఆలోచన రాలేదు."

అతన్ని వదిలి ప్రక్క గదిలో చిత్ర దగ్గరికి వెళ్ళాను.

ఆమె నన్నే పరామర్శించింది నవ్వుతూ. లాంఛనాలు తారుమారయ్యాయి.

"మిమ్మల్ని యెక్కడ కొట్టారు?" అడిగాను కూర్చుంటూ.

"ఇక్కడ — నడుము మీద!" చూపిందామె, ముసిముసిగా నవ్వుతూ.

"ఎందుకు కొడుతున్నారో మీరడగలేదా?"

"వాళ్ళు చెప్పే మూడ్‌లో లేరు. బిజీగా కన్పించారు. గబగబా కొట్టేసి వెళ్ళిపోయారు."

"వాళ్ళ ముఖాల్ని మీరు చూడలేదా?"

"లేదు. ముసుగు లాగడానికి ప్రయత్నించాను—కానీ నా చేతికి వాడి మెళ్ళో లాకెట్ వూడివచ్చింది...."

"దాన్నేం చేశారు?"

"అక్కడే ఆఫీసులో పారేశాను... ఏ మూలకి వెళ్ళి పడిందో తెలియదు."

చార్మినార్ డిపోలో డ్రైవర్ శివరావు అప్పుడే డ్యూటీ ఎక్కుతూ కన్పించాడు. కంట్రోలర్ నాకతన్ని చూపించాడు. అతని వయసు రిటైర్‌మెంటుకి దగ్గర్లో ఉంటుంది. నన్ను చూసి గుర్తుపట్టి అమితాశ్చర్యపోయాడతను.

అతన్ని దగ్గర్లోని కేంటిన్‌లోకి తీసుకెళ్ళాను.

లిమ్కా తాగుతూ అతను నా గురించి చాలా బాధపడ్డాడు. నేనా అవసరం లేదన్నాను. తప్పు నాదేనని చెప్పి, నా ప్రాణాలు కాపాడినందుకు నేనెంతో ఋణపడి వున్నానన్నాను. నేనింత త్వరగా కోలుకున్నందుకు తనకెంతో ఆనందంగా వుందన్నాడు.

అప్పుడసలు విషయంలోకి దిగాను. "మీరు నాకు కొన్ని విషయాలు చెప్పి సహకరించాలి. నాకిది చాలా సీరియస్ వ్యవహారం కాబట్టి మీరు జాగ్రత్తగా ఆలోచించుకుని చెప్పాలి."

"ఏమిటది?" అని అనుమానంగా చూశాడతను.

"అది జరిగినప్పుడు అక్కడెంత ట్రాఫిక్ జామ్ అయింది? ఎంతసేపు అయింది? ఏ ఏ వెహికల్స్ వున్నాయి? మీరు గమనించారా?"

అతను తికమకగా చూశాడు. వెంటనే సర్దుకొని చెప్పాడు.

"ఓ పది నిమిషాలు ట్రాఫిక్ నిలిచిపోయింది.... పోలీసులు వచ్చి స్పాట్ ఎంక్వాయిరీ జరిపి, మీ బండినీ నా బస్సునీ ప్రక్కకు జరిపేవరకూ ట్రాఫిక్ జామ్ అయింది. మా బస్సులో ప్రయాణీకులంతా దిగిపోయారు. ఎంత ట్రాఫిక్ ఆగిపోయిందో నేను గమనించలేదు. ఏఏ వెహికల్స్ వున్నాయో సరిగ్గా చెప్పలేనుగానీ, చాలా వరకు ఆటోలే వున్నాయి."

"నేను మీకెదురొచ్చినప్పుడు, నా వెనుక ఏదైనా వెహికల్‌ని చూశారా?"

"టర్న్ తీసుకుంటున్నప్పుడు ఎదురేమొస్తున్నాయో చూసుకోవడం ముఖ్యం. నేను టాంక్‌బండ్ మీదనుంచి లిబర్టీ వైపు టర్న్ తీసుకుంటున్నప్పుడే ఊహించని విధంగా మీరు వచ్చి గుద్దేశారు. అదే క్షణంలో నేను బ్రేకు నొక్కేశాను. ఆ క్షణంలో నేను మిమ్మల్ని తిట్టుకుంటే క్షమించాలి. కానీ అప్పటికి నేను సగం టర్నే తీసుకున్నాను. దాంతోనే ట్రాఫిక్ బ్లాక్ అయింది. ఆ సగం టర్న్ తీసుకుంటున్నప్పుడే మిమ్మల్ని రక్షించే ప్రయత్నంలో ఇంకా ముందుకి చూడలేదు—కానీ—"

"చెప్పండి."

"నేను బస్సాపేసి దిగుతున్నప్పుడు ప్రక్కనుంచి ఒక టాక్సీ దూసుకెళ్ళబోయింది—కానీ ముందుకెళ్ళే దారిలేక నా డోర్ ప్రక్కనే ఆగిపోయింది. నాకిప్పుడు గుర్తుకొస్తోంది....అది మీ వెనుకే వున్న రెండు ఆటోల మధ్యనుంచి ప్రక్కకు మళ్ళి దూసుకొచ్చింది...."

"అప్పుడేమైంది?"

"అదక్కడ్నించి వెళ్ళిపోయే తొందర్లో వుంది. డ్రైవర్ ఒకటే హారన్ కొడుతూంటే నేను కోప్పడ్డాను.

ప్యాసింజర్ అరెంజ్‌మెంట్ అంటున్నాడని అన్నాడతను. వెనుక సీట్లో ఒక్కడే వున్నాడు.”

“అతడెలా వున్నాడు?”

“సరిగ్గా చూడలేదు. నల్ల కళ్ళద్దాలున్నాయి.... మెళ్ళో ఒక గొలుసు ఉంది, అంతే.”

“చివరికేమైంది?”

“ఆ టాక్సీ అందరితోపాటే కదిలింది.”

“దాని నెంబర్‌గాని మీరు చూశారా?”

“అతను తొడ చరిచాడు. “ఆదంత లొల్లి చేస్తోంటే ఎవరి దృష్టి నాకర్షించదు? నాలాటి డ్రైవర్లకి అల వాటుగా నెంబర్లు చూసే గుణముంటుంది....”

“అది గుర్తుందా?”

“APT 6385—ఎలా మర్చిపోతాను? అతి తెలివి చూపించే బళ్ళని నేను బాగా గుర్తుంచుకుంటాను....”

అక్కడ్నుంచి నేను ఆఫీసుకు చేరుకునేసరికి పన్నెం డున్నరయింది. డూప్లికేట్ కీతో తాళం తీసి లోపలి కెళ్ళాను. అక్కడి దృశ్యం చూసి మనసు వికలమైంది. చెల్లాచెదురుగా వస్తువులు పడివున్నాయి....కొన్ని విరిగి, కొన్ని పగిలి ముక్కలై, కొన్ని కాలి బూడిదై ....

ఆఫీసంతా వింత వాసన వేస్తోంది. అయిదు నిమిషాలు జాగ్రత్తగా వెతికి, ఒక బీరువా కిందినుంచి దాన్ని తీశాను. బంగారు రంగులో మెరుస్తోంది. బంగారపుదే. ఖరీదైన లాకెట్. గొలుసు తెగిపోయింది హుక్ వున్న చోట. దీన్నిలో రహస్య అర లేదు. ఘనపదార్థం. దాని మీద స్వస్తిక్ గుర్తు ముద్రించి వుంది. ఇంకే గుర్తులు చెక్కి లేవు.

ఫోన్ అందుకొని ఒక నెంబర్ తిప్పాను.

నీరజ పలికింది అవతల్నుంచి. వెంటనే రాబర్టుని పిలవమన్నాను.

"హాలో, ఏమిటి సుందర్?" అన్నాడతను వచ్చి.

"APT 6385—ఈ టాక్సీ ఎవరిదో, ఎక్కడ తగలడింవో తెలుసుకొని చెప్పండి, ఇక్కడే కూర్చుంటాను!" అని ఫోన్ పెట్టేశాను.

అతని రియాక్షన్‌ని ఊహించగలను. కానీ ఇప్పుడేదీ వివరించే స్థితిలో నేను లేను. అతనికున్న కాంటాక్ట్స ద్వారా నేను కోరిన ఇన్ఫర్మేషన్ తెలుసుకొని ఇవ్వగలడు....

సిగరెట్ వెల్గించుకొని కుర్చీలో జారగిలబడ్డాను. ఆఫీసును చూస్తుంటే నాకే నమ్మశక్యంగావడంలేదు.

ఎవరీ చెలగాటమాడుతున్న శత్రువు?

ఫోన్ మోగి నా ఆలోచనల్ని చెదరకొట్టింది.

రాబర్టు అన్నాడు. "ఆ టాక్సీ ఓనరు పేరు కాంతారావు. డ్రైవరు కందస్వామి. కోఠి బస్ టెర్మినస్ ముందు స్టాండింగ్ ...."

ఫోన్ పెట్టేసి బయల్దేరాను. కానీ అక్కడి స్టాండింగ్‌లో ఆ టాక్సీ లేదు. మధ్యాహ్నం మూడున్నర వరకూ స్వామీ టాక్సీలో తిరిగిరాలేదు. నేనక్కడే గడిపాను. నేనతన్ని సమీపించగానే అతను డోర్ తీసి పట్టుకుని ఆశగా చూశాడు. అతనికి ముప్పై ఏళ్ళుంటాయి. నేను నవ్వి నా కారుని చూపించాను.

అతని ముఖం మాడిపోయింది. "మీకు కారుంటే నేనెందుకు, సార్?"

"కాలక్షేపానికి. అడిగింది చెప్పు!"

"ఏం చెప్పాలి, సార్?"

అతనికి చెప్పాను. ఈసారి అతని ముఖం ఎర్రబడింది. ప్రాన్పడిపోయాడు.

"నిన్న నీ టాక్సీలో ప్యాసింజరు నా బండికి బ్రేకు లూడదీశాడు. నువ్వతన్ని మోసుకెళ్ళి ఒకచోట దింపే శావు, ఎక్కడది?"

"నాకు తెలీదు!"

"అలా అంటే పోలీసులొచ్చేస్తారు .... చెప్పు, ఆ ప్యాసింజరు నన్ను వెంబడించమని నీకు బాగా డబ్బి చ్చాడు. అతన్ని నా ఆఫీసు ప్రాంతాల, గన్ ఫౌండ్రీలో ఎక్కించుకున్నావు. టాంక్ బండ్ దగ్గర నా యాక్సి డెంట్ చూపించి తీసుకెళ్ళి ఏ హోటల్లోనో డ్రాప్ చేశావు. చెప్పు—"

"సార్, నాకేం తెలీదు! మిమ్మల్ని వెంటాడమంటే నే ఒప్పుకున్నాను! మీకు యాక్సిడెంట్ జరుగుతుందని నాకేం తెలుసు?"

"ఇప్పుడు తెలిసిందిగా, నువ్వు చెప్పకపోతే పోలీసు లొస్తారు."

"సార్, అంత పని చేయకండి! నేనేం ఎరుగను! నన్నిందులో ఇరికించకండి!"

"సరే, నీ కన్యాయం చేయను, చెప్పు!"

"హోటల్ మయూర్, సార్!"

ఒక సిగరెట్ తీసి వెల్గించుకున్నాను. "ఇప్పుడు నాతో రా!"

"ఎక్కడికి, సార్?"

"చెప్పిన చోటికి!" హూంకరించి కదిలాను.

# 5

రాజభవన్ సమీపంలోని హోటల్ మయూర్ కెదురుగా టెలిఫోన్ బూత్‌లోకి జొరబడి గబగబా ఒక నెంబరు తిప్పాను.

చీకటి పడిపోయింది. టైము ఏడవుతోంది....

నీరజ సమాధానమివ్వగానే రాబర్టుని పిలవమన్నాను. రాబర్టు రాగానే గబగబా చెప్పాను. "ముగ్గురు మనుషులు కావాలి, రాబర్టు. వెంటనే హోటల్ మయూర్ దగ్గరకి పంపండి! పావుగంటలో చేరుకోవాలి—"

"ఎందుకు?"

క్లుప్తంగా చెప్పాను.

"అలాగే సుందర్, వెంటనే పంపుతాను!" అన్నాడతను ఉద్రేకంగా.

"శ్యామల క్షేమంగా ఉందా?"

"క్షేమంగానే వుంది, సుందర్. డోంట్ వర్రీ."

ఫోన్ పెట్టేసి బయటకొచ్చి సిగరెట్ వెలిగించుకున్నాను. దూరంగా రోడ్డువారగా నా కారు, దాని వెనుక స్వామి టాక్సీ ఆగివున్నాయి. స్వామి టాక్సీలోనే వున్నాడు.

అతను నేను చూపించిన లాకెట్‌ని గుర్తుపట్టాడు. వంద రూపాయలు ఆశ పెట్టి అతన్నిక్కడికి తెచ్చినప్పట్నించీ ఇంతవరకు శత్రువు రాకకై ఎదురుచూశాను. ఇందాకే వాడు హోటల్ ముందు ఆటో దిగి వెళ్ళినప్పుడు స్వామి చూసి గుర్తుపట్టాడు.

అయితే అంతకుముందే నేను హోటల్‌లో అనుమానాలు కలక్కుండా ఆరాలుతీశాను. వాడు రూం 124 లో ఉంటున్నాడు. పేరు మిష్టర్ జానో.

బెంగుళూరునించి వచ్చాడు. హిందీ, కొద్దిగా ఇంగ్లీషు తప్ప ఏదీ రాదు.

వెంటనే నా మనసులో మా బెంగుళూరు కరస్పాండెంట్ మిస్ ఉమ మెదిలింది. ఆ వెంటనే ఇటీవల రెండు నెలల కాలంలో పబ్లిష్ అయిన ఆమె నాలుగు ఆర్టికల్స్ మెదిలాయి. ఆమె చాలా ఫాస్టు రిపోర్టర్. ఇప్పుడు శత్రువు పైకి తేలాడు. ఆ నాలుగు రిపోర్టుస్లో ఒకదాంట్లో వున్నాడు. ఎవరతను? మిస్టర్ జాడోని అడిగి తెలుసుకోవాలి....

నా ప్రక్కనే రివ్వున దూసుకొచ్చి ఒక టాక్సీ ఆగింది. యాదవ్, కామేష్, చందర్‌లు బయటికి దూకి వచ్చారు. యాదవ్ చేతిలో చిన్న బ్యాగు వుంది.

"ఏమ్టి జరిగింది, సుందర్ భాయ్? మాకీ ఎందుకు పిల్చినారు?" అన్నాడు యాదవ్. అతను మహారాష్ట్రియన్. తెలుగు ఉచ్చారణ సరిగా రాదు. హైదరాబాదు ముసల్మానులా మాట్లాడతాడు. అతనితో నేను హిందీలోనే మాట్లాడతాను.

గబగబా అతనికి హిందీలో వివరించాను. తర్వాత ఇప్పుడేంచేయాలో చెప్పాను. వాళ్ళు రైటో అని పరుగు తీశారు పొజిషన్లు చూసుకోవడానికి.

స్వామి టాక్సీ దిగిపోయి మా కారెక్కాడు. కామేష్ టాక్సీ ఎక్కి దాన్ని హోటల్ గేటు వారగా తెచ్చి ఆపాడు. యాదవ్, చందర్‌లు దాని ప్రక్కన చేరి సిగరెట్లు ముట్టించుకుని, ఏదో ముచ్చటించుకో సాగారు సీరియస్‌గా.

వాళ్ళు సిద్ధం అన్నట్లు చెయ్యూపగానే నేను బూత్‌లోకి దూరి ఫోనెత్తాను. హోటల్ మయూర్‌కి

రింగ్ చేసి, ఆపరేటర్ పలగ్గానే రూం 124కి కలప మన్నాను.

కొన్ని క్షణాలు గడిచాక ఒక మగ గొంతు పలికింది హిందీలో....

"హాలో, కౌన్ హై? క్యాహోనా?"

నేను వెంటనే చెప్పసాగాను హిందీలో. "సాబ్... మీకు ప్రమాదం! ప్రమాదం ముంచుకొస్తోంది! వాళ్ళకు మీ గురించి తెలిసిపోయింది.... పోలీసులు మీ కోసం వస్తున్నారు! ఆ బాంబుమీద మీ వేలిముద్రలు దొరికాయి! వాళ్ళాఫీసులో మీ లాకెట్ దొరికింది! ఆ టాక్సీవాలాని వాళ్ళు పట్టుకున్నారు! వాళ్ళిప్పుడు మిమ్మల్ని అరెస్టు చేయడానికి వస్తున్నారు సాబ్, పారిపోండి!"

"ఓ గాడ్! నేనేం చేయను?"

"పారిపోండి, సాబ్! మాటలతో టైం గడిచి పోతోంది! వెంటనే గది ఖాళీచేసేసి ద్వారకా దగ్గరికి రండి, మేం రిసీవ్ చేసుకుని మరోచోట దాచేస్తాం! త్వరగా సాబ్, త్వరగా....!"

తక్షణ ఫోన్ పెట్టేసి బయటకొచ్చాను.

నా గుండె వేగంగా కొట్టుకుంటోంది. నేననుకున్నట్టే జరుగుతోందా? అతని కిరాయి మనుషులిద్దర్లో ఏ ఒకరితో నా గొంతును పోల్చుకుంటాడు? పోల్చుకుంటే నేననుకున్నట్టే రియాక్టు అవుతాడా?

ఆతృతగా చూస్తూ నిలబడ్డ నాకు, హోటల్ ఆవరణలో వేగంగా వస్తూ ఒకడు కన్పించాడు. చేతిలో సూట్ కేసువుంది. అతనే! వెంటనే నా టీముకి సైగ చేశాను. టాక్సీ చటుక్కున కదిలి ముందుకు వచ్చింది. అదే క్షణంలో జూడో బయటకొస్తూ దాన్నాపాడు.

అతను దగ్గరకొచ్చి డ్రైవరుకేదో చెప్పాడు. ఆ వెంటనే వెనుక డోర్ తీసి లోపలికి మారాడు.

కానీ టాక్సీ వెంటనే కదల్లేదు.

కొంత దూరంలో వున్న చందర్, యాదవ్‌లు మెరుపు వేగంతో కదిలారు. చెరోవైపునుంచి టాక్సీ వెనుక డోర్లు తీసుకొని లోపలికి జొరబడ్డారు. చందర్ చేతిలో ఏదో మెరుస్తూ లేచింది. అది జూడో తలమీద పడింది. ఆ తల వాలిపోయింది. ఆ మరుక్షణం యాదవ్ దగ్గర బ్యాగులోంచి ఒక సిరంజి బైటకొచ్చింది....

అప్పుడు టాక్సీ కదిలి వేగంగా దూసుకెళ్ళింది.

నేను నా కారువైపు పరుగుతీశాను శక్తికొద్దీ.

ఇదంతా కొన్ని క్షణాల్లో ముగిసిపోయింది.

## 6

రాబర్టు ఆ వచ్చిన అతిధిని కుతూహలంగా చూస్తున్నాడు. "గుడ్, నీట్ జాబ్! ఈ థగ్ యెవరి తాలూకా?"

జూడో కళ్ళు తెరిచి అయోమయంగా చూస్తున్నాడు. అతని కాళ్ళు చేతులు కట్టేసి, బాస్ బంగళాలోని ఒక అవుట్ హౌస్‌లో పడేశారు.

యాదవ్ తన బ్యాగులోంచి తన సామగ్రి తీసి ఏర్పాట్లు చేస్తున్నాడు. ఒక రేడియో మెకానిక్కులు వాడే సాల్డరింగ్ ఐరన్ తీసి గదిలోని ఒక ప్లగ్‌లో పెట్టాడు. అది వేడెక్కుతోంది. ఒక టేప్ రికార్డర్ తీసి మరో ప్లగ్‌లో పెట్టి, దాన్ని నేలమీద జూడో దగ్గరగా ఉంచాడు. తర్వాత ఒక హంటర్ తీసి ఛెళ్ళున విదిలించి, దాన్ని చందర్‌కిచ్చాడు.

ఆ తర్వాత సున్నితమైన కేశాలున్న ఒక కేమల్

బ్రష్ తీశాడు. దాన్ని చూసి సరదాగా నవ్వుతూ జూడో ముక్కు రంధ్రాల్లో పెట్టి నెమ్మదిగా తిప్పాడు. జూడో గిలిగింతలు పెట్టినట్లయి ఉక్కిరి బిక్కిరి అవుతూ, హఠాత్తుగా తుమ్ములు ప్రారంభించాడు.

"శుభం!" అన్నాడు యాదవ్, బ్యాగులోంచి ఒక సీసా తీస్తూ. అందులో సగంవరకు గండుచీమలున్నాయి. పంచదార తింటున్నాయి. ఒక ఫోర్సెప్ కూడా తీసి పట్టుకొని, "నా ప్రొసీడ్!" అన్నాడు.

రాబర్టు ముందుకు వంగి జూడోని అడిగాడు హిందీలో.

"ఇప్పుడు చెప్పు, నువ్వెవ్వరి మనిషివి?"

"నేను చెప్పను! నాకేం తెలియదు!" అరిచాడు వాడు.

"ఎందుకీ పనులు చేశావ్?"

"నేనేం చేయలేదు!"

"చేశావనడానికి మా దగ్గర రుజువులున్నాయి, బుకాయించి లాభంలేదు."

"ఓహ్, నేనేం చేయలేదు! నేనేం బుకాయించడం లేదు!"

రాబర్టు నన్ను చూసి చిటికె వేశాడు. మేమిద్దరం బయటికి నడిచాం. సిగ్నలందుకుని లోపలవాళ్ళు ముగ్గురు విజృంభించారు. కొరడా ఛెళ్ళు ఛెళ్ళు మంటోంటే జూడో అరుపులు వినిపిస్తున్నాయి.

మేమిద్దరం బయట కుర్చీల్లో కూర్చున్నాం.

"మ్యాడ్ మేక్స్‌లో కొన్ని సీన్లు మర్చిపోలేం, సుందర్" అన్నాడతను, సిగరెట్ వెలిగించుకుంటూ.

ఆ సినిమా నేనూ చూశాను. మేమిద్దరం దాని గురించి మాట్లాడుకోసాగాం.

ఇంతలో జూడో పెడబొబ్బలతోపాటు నవ్వులు వినిపించాయి.

యాదవ్ అంటున్నాడు. "ఇవి గండుచీమలు, ఒక్కొక్కటి తీసి నీ ప్యాంటులోకి వదులుతున్నాను. కాస్సేపట్లో నీ కింది భాగమంతా ఉబ్బెక్కిపోతుంది. ఆ తర్వాత ట్రట్లేకుండా గడపాలి వారం రోజులు.... సున్నిత భాగాలు డ్యామేజీ అయ్యాయా, నీ పని అంతే!"

"ఓహ్, ఆపండి! పాటిల్ .... పాటిల్ పంపాడు నన్ను!" జూడో అరుపు వినిపించింది గట్టిగా....

## 7

బాస్ కళ్ళు అగ్ని గోళాలయ్యాయి—

ఆ టేపులో జూడో మాటలు వింటున్నంత సేపూ ఆయన ముఖభావాల్ని చూడలేకపోయాం.

ఆయన ముఖం కఠినంగా మారి, చెప్పలేని క్రోధం, ప్రతీకార భావం కళ్ళల్లో మెరుస్తున్నాయి. పూర్తిగా విని మా అందరివైపూ తీక్షణంగా చూశాడు.

"డామ్ హిమ్! ఈ పాటిల్‌కి తగిన పాఠం నేర్పాలి, సుందర్!"

ఈ అరుపు విని నేను అదిరిపోయి నిటారుగా కూర్చున్నాను, "యస్, సర్!"

"వాడి సర్వనాశనం చూడాలి!" అన్నాడాయన, అదే కర్కశమైన గొంతుతో, "వాడు కుళ్ళి కుళ్ళి చావాలి! నువ్వేలా చేస్తావో నాకనవసరం, వాడికి పట్టించే గతి యెవరికీ చెప్పుకోలేనిదిగా వుండాలి! యూగగా అనుభవించాలి! నాకీ తృప్తినివ్వకపోతే నువ్విక

కనిపించవు! అరథమైందా? నీ ముఖం నాకు చూపించ కూడదు! ఏ బాసరుడైనా నాకు అపకారం తలపెట్టి సుఖంగా వుండలేదు? గతంలో నా జోలికి వచ్చి ఆ సక్సేనా ఏమయ్యాడో తెలుసుగా? (కీర్తి దాహం—జనవరి'80) ఎవరు నా జోలికొచ్చినా గల్లంతే అవుతారు...."

తేరుకున్నాను. "నాపై విశ్వాసముంచండి, సర్."

"నువ్వు రేపే బయల్దేరు బెంగుళూరుకి!"

"అలాగే, సర్."

"ఎంతో అవసరమైతే తప్ప మిస్ ఉమతో రిస్కు తీసుకోకు."

"సాధ్యమైనంతవరకు ఒంటరిగానే చేస్తాను, సర్. అయితే ఇక్కడ కొంత నేను కోరినట్లు జరగాలి...."

"ఏమిటది?"

"జూడోని విడిచిపెట్టేయాలి, సర్. అంటే తప్పించుకునే అవకాశాన్ని కల్పించాలి. నేను బెంగుళూరు చేరుకుని మీకు ఫోన్ చేసి, నేనుంటున్న హోటల్, ఫోన్ నెంబరు తెలియజేస్తాను. అప్పుడు జూడోని విడిచిపెట్టేసి అతడు పారిపోయి రైలెక్కుతాడో, విమానము ఎక్కుతాడో కనిపెట్టి నాకు చెప్పాలి, సర్...."

బాస్ క్షణం నన్ను సాలోచనగా చూసి తలూపాడు.

"థాంక్స్ సర్, ఈ టేప్ నేను తీసుకుపోతాను" అంటూ లేచి రాబర్టుతో అన్నాను, "మీరు జూడోతో నన్ను కొన్ని ఫోటోలు తీయాలి. ఒకొక్క కాపీ ప్రింట్స్ని కూడా వెంటనే నాకివ్వాలి...."

అతను అయోమయంగా చూశాడు.

నేను మళ్ళీ బాస్ని చూశాను. "సర్, ఇందులో నాకేదయినా సంభవిస్తే యెప్పటి మాట ప్రకారం

-్యమల బాధ్యత మీరు తీసుకుంటారనుకుంటాను...."

"ఆ విషయంలో నువ్వు నిశ్చింతగా ఉండొచ్చు, ందర్."

"థాంక్యూ సర్. ఇప్పుడు నేను చేస్తున్న పని ఆమెకు తెలియనివ్వకండి!" అన్నాను సెలవు తీసుకుంటూ.

# 8

సుమారు రెండు నెలలక్రితం జరిగింది—

మా బెంగుళూరు కరెస్పాండెంట్ మిస్ ఉమనుంచి క పూర్తి ఇన్వెస్టిగేటివ్ రిపోర్టు అందింది—అక్కడి ానిక పారిశ్రామికవేత్త అయిన నరేంద్రపాటిల్ అనే తన్ని గురించి.

ఆ రిపోర్టు మా పత్రికలో వెలువడి చాలా సంచలనం లిగించింది. కర్ణాటక అసెంబ్లీలోనూ, పారిశ్రామిక కేతలలోనూ — దాని ఫలితంగానే పాటిల్ అరెస్టు ాడా అయి తర్వాత బెయిలుమీద బయటికొచ్చాడు. తని పూర్తి అక్రమ వ్యాపారాన్ని బయటపెట్టిందా పోర్టు. దానికి ప్రతీకారంగా అతడి దుర్మార్గానికి పూను న్నట్లు ఇప్పుడు రుజువవుతోంది.

అవును, తొంభై రెండు లక్షలు గంగపాలైతే ఎవరి కం ఉడకదు?

కానీ, ఈ అక్రమ వ్యాపారాల్లో పెట్టుబడులంతా ప్పుతో కూడుకున్నదేనని తెలిసి కూడా, దానికే గాత్రం వెనుకాడకపోవడం చూస్తే అడ్డుదారుల్లో నార్జించేయాలని ఎంత బలంగావుందో తెలుస్తుంది. క్మ కాలి ఏ ఆపదైనా ఎదురైతే దాన్నుంచి తప్పించు నే ఉపాయశీలత ఎంత వున్నదో చాలా కేసుల్లో శ్చకే తెలియదు!

నరేంద్ర పాటిల్‌కి అదిలేదు.

అందుకే అతను పట్టుబడ్డాడు.

ఇప్పుడిలా అడ్డుమార్గాల ద్వారా కక్ష సాధిస్తున్నాడు.

గత కొన్ని మాసాలుగా జరుగుతున్న బొంబాయి టెక్స్‌టైల్స్ మిల్లుల సమ్మె మూలంగా అవి మూతపడి, ఉత్పత్తి స్థంభించి, కొంత కాలానికి మధ్య దళారులవద్ద కూడా నిల్వలు అయిపోయి, మార్కెట్‌లో కొన్ని పెద్ద కంపెనీల వస్త్రాలకి తీవ్రమయిన కొరత ఏర్పడినప్పుడు, కొనుగోలుదారుల డిమాండ్‌ని తీర్చడానికి నరేంద్ర పాటిల్ ఓ కొత్త ఆలోచనతో రంగంలోకి దిగాడు.

ఆ ప్రకారం అహ్మదాబాదు, సూరత్ వంటి చోట్ల చిన్న చిన్న మిల్లులనుంచి భారీ ఎత్తున వస్త్రాల్ని సేకరించి, తన గిడ్డంగుల్లో చేర వేసి, వాటికి నామకరణ మహోత్సవము జరిపించసాగాడు. అలా బొంబే డైయింగ్, మఫత్‌లాల్ ముద్రలతో సరుకు కొందరు అవినీతిపరులైన వర్తకుల ద్వారా ప్రజల మధ్యకి దిగసాగింది.... వేగవంతంగా, హెచ్చు మొత్తాలతో లాభాల్ని ఆర్జించి పెట్టసాగింది....

మిస్ ఉమ ఇది పసిగట్టి తన ఆర్టికల్ ద్వార బండారం బైట పెట్టింది.

పోలీసులు మెరుపు దాడి చేసి ఆ గోడవున్స్‌లో సరుకు స్వాధీనం చేసుకున్నారు. దాని విలువ తొంభై రెండు లక్షల రూపాయలు. పాటిల్‌కి బేడీలువేసి లాకప్‌లో బైతాయించారు. తర్వాత అతను బెయిలుమీద బైటకొచ్చాడు. అతనిమీద కేసు నమోదయి కోర్టులో న

స్తోంది....

అందులో తా నెలాగూ శిక్షను తప్పించుకోలేడని తెలుసు. అందుకని ఆలోపులో మామీద పగ తీర్చుకోవాలనుకుని వుంటాడు. అంగరక్షకుడు జూడోకి ఆదేశాలిచ్చి పంపాడిక్కడికి. జూడో మొదట శర్మని గాయపర్చి, వదిలాడు. అతన్ని చంపదల్చుకోలేదు. అసలు కక్ష మా బాస్‌మీద వుంది. బాస్‌ని చంపడానికి నాలుగు రోజులు అవకాశం కోసం చూశాడు. చివరికి మొన్న ప్రయత్నించాడు. కానీ ఫలించలేదు. అప్పుడు పిచ్చెత్తిపోయి నామీదా కిరాయి మనుషులతో ఆఫీసుమీదా పడ్డాడు.

ఆతర్వాత బాస్‌మీద మరో ప్రయత్నం చేయడానికే ఇక్కడ ఉండిపోయాడు. కానీ అదృష్టం వక్రించి మాకు పట్టుబడిపోయాడు....

అతని కన్‌ఫెషన్ అంతా విన్న తర్వాత ఇక పాటిల్‌కి మూడిందనే అనుకున్నాను. బాస్‌కు హాని తలపెట్టిన వాళ్ళు పశ్చాత్తాపానికి కూడా తెరిపి లేకుండా నశిస్తారు. బాస్ నామీద వేసిన బాధ్యత చాలా బరువైనది. శత్రువు నాశనం కావాలి.

పిస్టల్‌తో అడుగుపెట్టి ఒక్క గుండుతో ప్రాణాలెగరగొట్టడం కష్టంకాదు. సమస్యకాదు. కానీ బాస్ దాన్నంగీకరించడు. ప్రత్యక్ష హింసను తిరస్కరిస్తాడు. చేసిన పాపానికి శత్రువు మూగగా అనుభవించాలి. దారీతెన్నూ కానరాక తనకు తానే శిక్షను విధించుకునే గతి పట్టించాలి. అలాటి పరిస్థితిని కల్పించి వదలాలి....

నా బెంగుళూరు ప్రయాణమంతా ఈ ఆలోచనలతోనే గడిచిపోయింది. ఏర్‌పోర్టునుంచి హోటల్ కన్నెమెరా చేరుకొని, గది తీసుకుని స్నానం చేస్తున్నంతసేపూ

ఆలోచించాను....

మిస్ ఉమ అపార్టుమెంటుకి ఫోన్ చేసి, నా రాకను తెలియజేసి, ఆమెను వెంటనే ఇక్కడికి రమ్మని చెప్పిన తర్వాత, సోఫాలో పడుకుని నిదానంగా ఓ పథకాన్ని రూపొందించుకున్నాను.

మిస్ ఉమ సరిగ్గా ఇరవై నిముషాల్లో వచ్చింది. ఆమెకు పాతికేళ్ళుంటాయి. అచ్చం పోలిక అలాగే లేక పోయినా చూపులు మాత్రం జయసుధవి. జయసుధ లక్షణాలున్న వారెవరైనా సరే నాకు అభిమాన వనితలే.

అభిమాన వనిత మిస్ ఉమ నా రాకకు ఆశ్చర్య పడలేదు. ఆమె అంతకుముందే పేపర్లో వార్త చదివి, హైదరాబాదుకు ఫోన్ చేసి విషయం తెలుసుకుంది. అయితే ఇందులో పాటిల్ కు సంబంధముందని ముందే చెప్పి ఆమెను కంగారుపర్చలేదు. నేను చెప్పేవరకు ఆమెకు తెలియదు.

"మిస్ ఉమ, పాటిల్ ఎంతకు తెగించాడో చూశారా? బాస్ ప్రాణాలే తీయాలనుకున్నాడు. ఇక్కడ మీకు హాని చేయకపోవడానికి కారణం మన దృష్టి తనమీదికి మళ్ళుతుందనే...."

"నేనిలా జరుగుతుందనుకోలేదు...." అందామె బాధగా, "నా ఇన్వెస్టిగేషన్ బాస్ ప్రాణాలకే ముప్పు తెస్తుందనుకోలేదు..."

"బాధపడకండి. రిపోర్టులు పంపడం మన ధర్మం. అవి తెచ్చే ఆపదల్నుంచి కాపాడుకోవడం బాస్ వంతు. ఇదెప్పుడూ వుండేదే. పాటిల్ ని తొంభై రెండు లక్షలకి క్షవరం చేసిన ఘనత మీకుంది, అందుకు గర్వపడండి!"

"అతన్ని ఇప్పుడు ఏం చేయాలనుకుంటున్నారు?"

"అదిప్పుడే చెప్పలేను. నాకో ఆలోచన వుంది. కానీ అలా జరుగుతుందని ఆశించలేను. పరిస్థితులు అనుకూలించాలి. వాటికోసం ఎదురు చూడాలి. కాలం పడుతుంది. నిరీక్షణ, సహనం, ఓర్పు మనమీ వృత్తిలో బాగా అలవాటు పడివున్నవాళ్ళం. ముందు అతని పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకుంటే మంచిది.... అతని కుటుంబం, జీవితం, అలవాట్లు, వ్యసనాలు, రహస్యాలు, వ్యవహారాలు, లావాదేవీలు.... ఇవన్నీ...."

"అవన్నీ తెలుసుకొని మీరెలా చావుదెబ్బ తీస్తారు?"

"అది తెలుసుకున్న దాన్నిబట్టి వుంటుంది."

"అతడి జీవితాన్ని నేను లోతుగా తరచి చూడలేదు" అందామె కొంత నిరుత్సాహంగా, "కానీ, మిస్టర్ సుందర్, అతను ఒంటరిగాడు. భార్య ఎప్పుడో విషం తాగి చచ్చిపోయిందట. కూతురు అతన్ని అసహ్యించుకుని ఎక్కడికో వెళ్ళిపోయింది. అతదెవర్నీ దగ్గరికి చేరనివ్వడు, బంధువుల్ని. డబ్బే అతనికి బంధువు. ఇంట్లో ఆ బాడీగార్డు జూడో, కారు డ్రైవరు ఒకడు, ఒక వంటగత్తె, ఓ పనివాడూ వుంటారు. కానీ జూడో తప్ప మిగతావాళ్ళు తమ పనులు పూర్తిచేసుకొని వెళ్ళిపోతారు. జూడో ఒక్కడే అన్ని వేళలా ఇంట్లో వుంటాడు. భోజనం వడ్డించడం దగ్గర్నుంచీ అన్ని సపర్యలూ పాటిల్ కి చేసిపెడతాడు.

"ఇక అతని వ్యసనాలు, అలవాట్లు గురించి నాకేమీ తెలియదు. బిజినెస్ అంతా జయచామరాజ్ రోడ్లోని రెడీ మనీ మాన్షన్ ఆఫీసులో చూస్తాడు. ఏవైనా సీక్రెట్ డీలింగ్స్ వుంటే రాత్రి పది తర్వాత ఇంట్లోనే కలుసుకుంటాడు వ్యక్తుల్ని."

"రోజూ కలుసుకుంటూడా?"

"రోజూ ఒకరిద్దరు వచ్చిపోతూ నే వుంటారు?"

"వాళ్ళలో స్త్రీలుంటారా?"

"ఉండవచ్చు. నేను చూడలేదు."

"వాళ్ళని కలుసుకునే గది ప్రత్యేకంగా వుందా?"

"వుంది, హాలు కుడిప్రక్క గది."

నేను ఆలోచించాను. కాస్సేపయ్యాక అన్నాను.

"సరే, మిస్ ఉమ, ఒక పని చెయ్యండి."

"చెప్పండి."

"నాకో కెమేరా, టేప్ రికార్డర్ — దానికి ఎక్స్టర్నల్ మైక్రోఫోన్‌తో కావాలి...."

"అలాగే, నా దగ్గర వున్నాయి, తెస్తాను."

"కెమేరా ఫ్లాష్ గన్ లేకుండా, చాలినంత వెలుతురు లేకపోయినా పనిచేయగల్గాలి."

"అలాంటిది ఇంపోర్టెడ్ కెమెరా నా దగ్గరుంది."

"గుడ్, రాత్రి తొమ్మిది గంటలకి మీరు నాకు పాటిల్ ఇల్లు చూపించి వెళ్ళిపోండి" అన్నాను.

ఆమె తలూపింది అంగీకారంగా.

# 9

ఒక కారు వచ్చి గేటుదగ్గ రాగింది.

కాంపౌండ్ లోపల గేటు ప్రక్కనే వున్న నేను, జాగ్రత్తగా తల ప్రక్కకు జరిపి చూశాను. కారులోంచి ముగ్గురు దిగారు.

ఆ ముగ్గుర్లో పాటిల్‌ని గుర్తించాను. అతను వంగి డ్రైవర్‌తో ఏదో చెప్తున్నాడు, కన్నడంలో. నాకర్థం గాలేదు. కారు స్టార్టయి వెళ్ళిపోయింది. పాటిల్ గేటు తాళంతీసి లోపలికి వచ్చాడు. అతని వెంట వాళ్ళిద్దరు

వచ్చారు.

ముగ్గురూ బంగళాకేసి వేగంగా నడిచారు.

నేనక్కడే కాచుకున్నాను. వాళ్ళు లోపలికెళ్ళి లైట్లు వెలిగేవరకూ, కిటికీలు తెరచుకునేంతవరకూ అక్కడే వున్నాను.

అప్పుడు హాలు కుడిపక్క గది కిటికీ ముందు వరండా లోకి తెరచుకుంది. గదిలో వాళ్ళు ముగ్గురు కన్పించారు.

గబగబా నడిచి, వరండా దగ్గర బూట్లు విప్పేసి, బ్యాగుతో ఆ గది కిటికీ ప్రక్కన చేరాను.

వాళ్ళు సోఫాల్లో కూర్చుని వున్నారు. కానీ వాళ్ళ మాటలు నాకేమీ అర్థంగావడంలేదు. ఆ వచ్చిన అతిధుల్ని చూస్తే ఏదో రాజకీయ పార్టీకి చెందిన వాళ్ళని అర్థమవుతోంది. కెమెరా ఉపయోగించాలా వద్దా అని ఆలోచించి విరమించుకున్నాను. వాళ్ళ మాటలు నాకర్థంగాకపోయినా, అదేం నాకుపయోగపడే సమాచారంలా లేదు. వాళ్ళు వచ్చే ఎన్నికలకు పార్టీ ఫండ్ కోసం అడిగినట్లు కన్పిస్తోంది. చివరికి పాటిల్ నుంచి ఏదో వాగ్దానం తీసుకుని వెళ్ళిపోయారు.

నిరుత్సాహ పడ్డాను.

అప్పుడు నాకేదో తట్టింది—పాటిల్ పంపిన కారు.

అది తప్పకుండా మరో పార్టీని తీసుకు రావాలి.

అది నా కుపకరించవచ్చు. ఈ అవకాశాన్ని నే నుప యోగించుకోవాలి. పాటిల్ ఇప్పుడు గదిలో లేడు. లోపలెక్కడో ప్లేట్లు, గ్లాసులు చప్పుడు చేస్తున్నాయి. చటుక్కున కిటికీలోంచి గదిలోకి దిగాను. తలుపు దగ్గర కెళ్ళి హాలులోకి తొంగిచూశాను. అతను కన్పించలేదు. వెనుక ఎక్కడో గదిలో చప్పుడవుతోంది.

నేను వేగంగా రంగంలోకి దిగాను. బ్యాగులోంచి పొడవాటి తీగవున్న మైక్రోఫోన్‌ని తీసి టీపాయ్ దగ్గర కూర్చున్నాను. కత్తితో దానికింద తివాసీకి రంధ్రం పెట్టి అందులోకి తీగను పెట్టి కిటికీవైపుకు లాగాను. సరిగ్గా ఆ రంధ్రంలో అమరేలా మైక్రోఫోన్‌ని వుంచాను. తీగ రంగు గోడల రంగులో కలిసిపోయేలా వుంది.

బ్యాగులో బయటికి దూకేసి, తీగను కిటికీ రెక్క వెనుకనుంచి బయటికి, కింద గచ్చుమీదికి అందేలా లాగాను. దాని చివర జాక్‌పిన్ వ్రేలాడుతోంది.

ఏర్పాటు పూర్తిచేసి పాటిల్ కోసం చూశాను. అతడింకా రాలేదు. బయట కారు చప్పుడు విన్పించింది.... నేను చీకటి వరండాలోంచి వురికి ఎడమవైపు తోటలో మొక్కల చాటున వెళ్ళాను.

కారు లోపలికొస్తూండగానే పాటిల్ బయటికి వచ్చాడు.

అతను కారును చేరుకుని అతిథిని రిసీవ్ చేసుకున్నాడు. నేనక్కడ్నుంచే వాళ్ళని గమనిస్తున్నాను. వాళ్ళు చకచకా లోపలికెళ్ళిపోయారు. డ్రైవరు గేటు దగ్గరికెళ్ళి బయటికి చూస్తూ నిలబడ్డాడు.

నేను తిరిగి వరండా చేరుకున్నాను. కిటికీలోంచి లోపలికి చూసిన నాకు పాటిల్ కెదురుగా సోఫాలో కూర్చుని ఒక ఆజానుబాహుడు కన్పించాడు. విదేశీయుడు. అమెరికన్‌లా వున్నాడు. సంభాషణ ఆంగ్లంలో సాగుతోంది. ఇద్దరూ డ్రింక్స్ సిప్ చేస్తున్నారు.

కెమెరాతీసి రెండు స్నాప్స్ లాగాను.

సంభాషణ ఆసక్తికరంగా సాగుతోంది.

బయటికి వేలాడుతున్న మైక్రోఫోన్ జాక్‌పిన్‌ని టేప్ రికార్డర్ సాకెట్‌లోకి గుచ్చాను. బటన్‌లు నొక్కాను. టేపు తిరగసాగింది....

మరొక స్నాప్ తీసి, మనసును వాళ్ళ సంభాషణ మీదికి కేంద్రీకరించాను.

అప్పుడు నా గుండె దడ హెచ్చింది .... వాళ్ళేం మాట్లాడుకుంటున్నారో తెలిసివచ్చాక! గాడ్! ఏం మాట్లాడుకుంటున్నారు వాళ్ళు! ఇది నేనూహించలేదు! ఇలాటివి కూడా జరుగుతాయా?

కళ్ళప్పగించి వాళ్ళనే చూస్తున్నాను .... వాళ్ళ మాటల్లో పదేపదే పన్నెండు కోట్ల రూపాయల ప్రస్తావన వస్తోంది....పన్నెండు కోట్లు! వాళ్ళింకా ఏవో లెక్కలు వేసుకుంటున్నారు....అంకెలు పాటిల్‌ని తృప్తి కల్గిస్తున్నాయి. ఆ మెరికన్ అతన్ని ఒప్పించడంలో కృతకృత్యుడయ్యాడు. డీల్ చూస్తూండగానే సెటిల్ అయిపోయింది. సమావేశం ముగిసింది.

పన్నెండు కోట్ల రూపాయల డీల్! ఓహ్, ఇదే నే నెదురుచూసిన అవకాశం! దీన్ని విడిచిపెట్టకూడదు!

వాళ్ళు బయటకొస్తున్నప్పుడు, అమెరికన్ కారెక్కుతున్నపుడూ రెండు స్నాప్స్ తీశాను.

అక్కడ్నుంచి తిరిగి నేను హోటల్‌కొచ్చేవరకూ నా మనసు మనసులోలేదు! ఎంత గొప్ప అవకాశమిది! ఆ పాటిల్ కూడా వూహించలేదు తనకేమవుతోందో, అయ్యో క్షణంవరకూ! దీంతో చావు దెబ్బ తింటాడు!

ఆ రాత్రి నాకు నిద్ర పట్టలేదు. ఆ టేపును పదేపదే విన్నాను....

# 10

ఉదయం వచ్చింది ఉమ, "ఏమయింది, సుందర్?" అంటూ.

నవ్వి ఆమెకు ఆ టేపు విన్పించాను. ఆమె కదల కుండా కూర్చుని నోరు తెరచుకుని వింది. "ఓహ్, ఎంత పెద్ద స్కాండల్! ఏం చేస్తారు?"

"మన పేపర్లో వేస్తే మంచి ఎడ్వర్ టైజు మెంటుగా ఉంటుంది, ఇన్ కంటాక్స్ వాళ్ళకి కదూ? రాబందుల్లా వచ్చి ఎగరేసుకుపోతారు ఆ పన్నెండు కోట్లనీ తమ ఖజానాకి!"

"దీన్నిక తట్టుకోలేడు పాటిల్!"

"గుండె బలహీనమా?"

"తెలీదు. కానీ తట్టుకోలేడు. కనీసం పిచ్చివాడవు తాడు."

"వెల్, మీరీ టేపుకి ఇంకో కాపీతీసి నాకివ్వండి. ఫోటోలు అయిదు తీశాను. బాగానే వచ్చాయనుకుం టున్నాను.... రెండేసి కాపీలుతీసి సాయంత్రానికి అందిం చండి."

"అలాగే."

"మన ఆఫీసుమీద దాడి జరిగిన వార్త మొన్నటి పేపర్లోనే కదూ పడింది? అదొకటి పట్రండి...."

"అలాగే. మీరు బాస్ కు ఫోన్ చేశారా?"

"ఉదయం లేవగానే చేశాను. సాయంత్రం జూడోని వదిలేయమన్నాను."

"మీరేం చేస్తారు?"

"జూడో పాటిల్ ని కలుసుకోగానే రంగ ప్రవేశం చేస్తాను."

"చేసి?"

"మనుషులు తామనుకున్నది అనుకున్నట్టే యెలా జరగదో బోధిస్తాను."

"మీరు ప్రమాదంలోకి వెళ్తున్నారు...."

తల అడ్డంగా వూపాను. "రక్షించుకోగలను. ఒకవేళ నేను గంటలోగా రాకపోతే మీరు మీ పని చేసేయండి."

"పోలీసులతో రావాలా?"

"మంచి బలంగా, దృఢంగా వున్న శాల్తీలు."

"నా మనసేదో కీడు శంకిస్తోంది, మిష్టర్ సుందర్."

"అది మీ స్త్రీ సహజ భయం, మిస్ ఉమ."

ఆమె నిట్టూర్చింది. "అయితే నేను లక్షలే దెబ్బ తీశాను.... మీరు కోట్లు కొల్లగొడుతున్నారన్నమాట!"

"లేదు, లేదు. అందులో సగం వాటా మీకూ వుంది. మనిద్దరం కలిసే చేస్తున్నాం."

"అంటే నాకు ఆరు కోట్లన్నమాట .... కానీ కోట్లనేనేం చేసుకోనూ?"

"నాకూ అదే సమస్య! కోట్లతో దుక్కి చేసే అలవాటు నాకు లేదు...."

ఆమె నవ్వింది. నేనూ నవ్వాను.

## 11

చీకటి పడుతోండగా ఫోన్ మోగి నన్ను ఆలోచనల పొదల్లోంచి బయటికి లాగింది.

రాబర్టు పలికాడు. "సుందర్, మన జూడో వీరుడు రాకెట్ స్పీడుతో ఏర్పోర్టుకెళ్ళాడు. బెంగుళూరు ప్లేట్ ఎక్కాడు...."

"గుడ్. మధ్యలో ఎక్కడయినా ఫోన్ చేశాడా?"

"లేదు, తిన్నగా విమానమెక్కాడు. ఇప్పుడే ఏడు గంటలకి బయల్దేరింది విమానం...."

"ఓ.కే, నేనిక్కడ రిసీవ్ చేసుకుంటాను."

"సుందర్, అక్కడంతా సవ్యంగా జరుగుతోందా?"

"ఇంతవరకు సవ్యంగానే జరిగింది...."

"మీరు సక్సెస్ కావాలి. నేనే కాదు, మీ మిసెస్ కూడా ప్రార్థిస్తోంది...."

"గాడ్! ఆమెకెలా తెలుసు? నేను వేరే పనిమీద పోతున్నానని చెప్పానే?"

"ఆమె నమ్మలేదు. అది మీకు తెలియనివ్వలేదు. షీ ఈజ్ మోస్టు అండర్‌స్టాండింగ్ ఉమన్, సుందర్. యూ ఆర్ లక్కీ...."

ఫోన్ పెట్టేసి కొత్త ఉత్సాహంతో ఉమవైపు తిరిగాను.

"పదండి, మన జూడో మిత్రుడి ఆగమనాన్ని వీక్షిద్దాం!"

ఏర్‌పోర్టులో సరిగ్గా ఎనిమిదీ పదికి విమానం దిగివస్తూ కనిపించాడు జూడో. మరికొన్ని నిమిషాలయ్యాక లాంజ్‌లోని ఫోన్ బూత్‌లోకి వెళ్తూ కనిపించాడు గబగబా. రెండు నిమిషాల తర్వాత బయట పార్కింగ్ లాట్‌లో టాక్సీ ఎక్కుతూ కనిపించాడు వాడావుడిగా.

అతన్ని మేము అనుసరించాం. మరో టాక్సీలో ఎక్కి కూర్చున్నాం.

"డ్రైవర్, ఆ టాక్సీని వెంటాడాలి. దేనికీ వెంటాడ నవసరంలేదు. బాడుగమీద నీకు యాభై రూపాయలిస్తాం" అంది ఉమ, జూడో యెక్కిన టాక్సీని చూపిస్తూ, డ్రైవర్‌తో.

డ్రైవర్ పోనిచ్చాడు.

"ఫోన్ చేసింది పాటిల్ కి, ఆఫీసులో. అతనిప్పుడు ఇంటికొచ్చేస్తాడు. వాళ్ళిద్దరు ఇంట్లో కలుసుకుంటారు.." అన్నాడు.

"మీ దగ్గర రివాల్వర్ లేదు" అందామె బాధగా.

"ఆ దెందుకు? బ్రీఫ్ కేసులో వున్న ఆయుధాలు చాలు...."

సరిగ్గా ఇరవై నిమిషాల్లో జూడో టాక్సీ పాటిల్ బంగళా చేరుకుంది.

"ఓ.కే, ఇక వెళ్తాను. నా కోసం గంటసేపు చూడండి...." అన్నాను. కొంతదూరంలో టాక్సీనాపి దిగిపోతూ.

ఆమె తలూపింది. టాక్సీ వెనక్కు మళ్ళి వెళ్ళిపోయింది.

నేను పాటిల్ బంగళావైపు అడుగులేశాను. జూడో అప్పుడే గేటు తీసుకుని లోపలికెళుతున్నాడు. అతని టాక్సీ వెళ్ళిపోయింది.

నేను గేటును చేరుకునేటప్పటికి అతను ఇంట్లోకి వెళ్ళిపోయాడు. లోపల కారు కన్పిస్తోంది కానీ డ్రైవరులేడు.

నేను గేటు తీసుకుని లోపలికి నడిచాను....

## 12

పాటిల్ గొంతు హాలు కుడివైపు గదిలోంచి వినబడ్తోంది.

"జూడో! ఏమిటి? ఏమైంది? పని పూర్తిచేశావా?"

నేను మెల్లిగా ఆ కిటికీ దగ్గరికి చేరాను. గదిలో అతను సోఫాలో కూర్చుని వున్నాడు ఉద్రేకంగా. జూడో అతనిముందు నిల్చుని చెప్తున్నాడు.

"పూర్తిచేశాను, బాస్! మీరు పేపర్లో చూడలేదా? వాళ్ళందరికీ బుద్ధి చెప్పి వచ్చాను...."

"అతను....మహీందర్ రావ్ నేం చేశావ్?"

జూడ్లో ఛాతీ ఎగరేసి గర్వంగా నవ్వాడు. "ఆ ముసలాడ్ని బాంబు పెట్టి బుర్ర బద్దలుచేశాను, బాస్. హాస్పిటల్లో పడ్డాడు. బ్రతకడంటున్నారు...."

"నిజమా!" పాటిల్ ముఖం సంతోషంతో వెలిగింది, "ఓహ్, అంత నెమ్మదిగా చెప్తావేమిటి! నిజంగా ఆ బాస్టర్డు బ్రతకడా?"

"ఇహ బ్రతకడు, బాస్...." జూడ్లో ముఖమంతా చెమటలు పట్టేస్తోంది, తుడుచుకుంటున్నాడు. "అప్పుడే చావాల్సింది, బాస్....కానీ ఎక్కడో లోపం జరిగింది.. మొత్తానికి మనం పగతీర్చుకున్నాం, బాస్! ఇక సంతోషంగా వుండండి...."

"నా పగ తీరింది!" పాటిల్ అరిచాడు, "నా కిప్పుడు తృప్తిగా వుంది! నేనిప్పుడు ఆనందిస్తాను!"

జూడ్లో ముఖంలో రంగులు మారింది. గిల్టీగా చూస్తున్నాడు.

తేరుకొని అడిగాడు పాటిల్, "మరి మిగతావాళ్ళే మయ్యారు?"

"ఆ ఎడిటర్ కాళ్ళు విరగ్గొట్టాను, బాస్. హాస్పిటల్లో పడ్డాడు. మరో కొత్త ఎడిటర్ వస్తే వాడి బండికి బ్రేకు లూడదీసి పళ్ళూడగొట్టాను. బుర్ర కూడా చిట్లింది బస్సుకు గుద్దుకుని. ముసలి ఎడిటర్ ప్రక్కనే పడ్డాడు హాస్పిటల్లో. వాడికేదీ గుర్తుకు రావడంలేదు .... పిచ్చి పిచ్చిగా మాట్లాడుతున్నాడు. ఇంకా ఆ తర్వాత ఆఫీసుకు నిప్పెట్టేశాను...."

పాటిల్ ఆనందాతిరేకంతో పడీపడీ నవ్వసాగాడు.

నేనిక సహించలేకపోయాను. కిటికీలోంచి లోపలికి గెంతాను.

అదిరిపడి వాళ్ళు నన్ను చూశారు. పాటిల్ నవ్వాపేసి బెదురు చూపులు చూశాడు. జూడో ప్రాణా లెగిరి పోయినట్టు కళ్ళు తేలవేశాడు.

"శభాష్, జూడో! మోర్ పైలాగ్!" అన్నాను నవ్వి.

"ఎవరు—ఎవర్నువ్వు? కిటికీ దూకి ఎందుకొచ్చావు?" పాటిల్ తేరుకొని గదమాయించాడు.

"దూకడం వచ్చు కాబట్టి...." అన్నాను అతని ముందు సోఫాలో కూర్చుంటూ.

పాటిల్ చటుక్కున జూడోని చూసి అరిచాడు.

"ఎవరితను? ఎలా వచ్చాడు లోపలికి?"

జూడో ఉలిక్కిపడి చూశాడు. అతని ముఖం పాలి పోయింది. ఏదో చెప్పాలని నోరు తెరిచాడుగానీ మాట రాలేదు. విపరీతంగా చెమటలు కక్కుతున్నాడు.

"వాడేం చెప్పలేదు.... నేను చెప్తాను" అన్నాను జూడోని చూసి కొంటెగా నవ్వుతూ, "మీవాడు పళ్ళూడగొట్టానంటున్న కొత్త ఎడిటర్ని నేనే, సోమ సుందర్ పేరు. కానీ నా పళ్ళు ఒక్కటీ వూడలేదు. చూడండి, పై సెట్టు కింద సెట్టూ యెంత బలంగా వున్నాయో మిలమిల మెరుస్తూ. రోజూ రెండుసార్లు తోముతుంటాను. ముసలాడ్నయినా వూడిరావు...."

"అబద్ధం!" జూడో గొంతు చించుకున్నాడు, "నువ్వబద్ధం!"

వాడలా అరిచి నామీద కొచ్చాడు. వాడి చర్యను

వాడికంటే ముందే పసిగట్టి నేను లేచి దళడమీద గుద్దాను. గిర్రున తిరుగుతూ వెళ్ళి తలుపుకు కొట్టుకున్నాడు.

వెనకనుంచి పాటిల్ వెర్రికేక వేశాడు.

జూడ్లో వూడి కిందపడ్డాడు.

తేలికపడుతూ నేను తిరిగి పాటిల్ దగ్గరకొచ్చి కూర్చున్నాను. "చూశారా? మీవాడు మీరనుకున్నంత బలవంతుడేమీ కాడు. విశ్వాసపాత్రుడూ కాడు. వాడు మీకు చెప్పిందంతా అబద్ధమని ఇప్పుడు నన్ను చూస్తే తెలియడంలేదూ?"

"బాస్, నమ్మకండి! అతడెవరో బోగస్! నేను చెప్పిన ఎడిటర్ ఇతను కాడు!" లేచివస్తూ అరిచాడు జూడ్లో.

పాటిల్ మా యిద్దర్నీ తికమకగా చూశాడు.

నేను తలూపి బ్రీఫ్ కేసు తెరిచాను. అందులోంచి మొన్నటి ఇండియన్ ఎక్స్ప్రెస్ తీసి చూపించాను. "ఈ ఫోటో చూడండి! వర్సింగ్ హోంలో ఎడిటర్ శర్మ పక్కనున్నదెవరు—పోల్చుకున్నారా?"

పాటిల్ ఫోటోని చూస్తూ చటుక్కున నన్ను చూశాడు. అతడి కళ్ళు నన్ను నమ్మాయి.

జూడ్లో ముఖం వెలవెలబోయింది.

"కాబట్టి మీవాడు చెప్పింది అబద్ధమని నమ్ముతారా?" అడిగాను పాటిల్ని, "బుకాయిస్తున్నాడు.... మా బాస్కేం కాలేదు. శర్మ రెండు కాళ్ళూ విరగలేదు. ఆఫీసును తగలబెట్టనూలేదు. పైపెచ్చు మాకు చిక్కిపోయి మీ గురించి అంతా కక్కేశాడు!"

"ఏమిటీ!"

"నమ్మకండి, బాస్! నమ్మకండి—"

నేను నవ్వి బ్రీఫ్ కేసులోంచి లాంకెట్ తీసి చేతిలో

వూపాను.

దాన్ని గుర్తుపట్టాడు పాటిల్. జూడోని చూసి కళ్ళు అగ్నిగోళాలయ్యాయి.

నేను బ్రీఫ్ కేసులోంచి టేప్ రికార్డర్ తీశాను. అందులో ఒక కేసెట్ వేశాను.

"మీవాడికి సంగీతం వచ్చు .... ఇందులో మీవాడి కీర్తనలూ, మధ్య మధ్యలో శ్లోకాలూ వున్నాయి.... మీరు సంగీత ప్రియులైతే ఇది మిమ్మల్ని బాగా ఆకట్టుకుంటుంది, వినండి!"

దాన్ని ఆన్ చేసి వదిలాను.

టేపు తిరుగుతూ అందులోంచి శబ్దాలు వెలువడుతూంటే, మధ్యలోనే పాటిల్ చివాలున లేచివెళ్ళి జూడో గొంతు పుచ్చుకున్నాడు.

"నువ్వేం చేశావ్ బాస్టర్డ్! ఏమిటిదంతా!"

"ఓహ్, బాస్! మీ రిదంతా నమ్మేస్తున్నారా! ఇతను బోగస్! ఆ టేపులో నా గొంతును ఫేక్ చేశాడు! ఆ మాటలు నావికాదు—"

పకపకా నవ్వాను, "నీవి కావూ?" అంటూ బ్రీఫ్ కేసులోంచి మూడు ఫోటోలుతీసి టీపాయ్ పైన విసిరాను. "చూడండి, మిస్టర్ పాటిల్, ఈ ఫోటోల్లో మీ వాడికేం గతిపట్టిందో చూడండి! వాడి ప్రక్కన నన్ను కూడా చూడండి....ప్రశ్నిస్తున్నాను."

పాటిల్ ఫోటోలు చూస్తోంటే, జూడో సన్నగా వణకసాగాడు. అతను పారిపోవడానికి సిద్ధంగా వున్నాడు. కానీ కాళ్ళు సహకరించడంలేదు.

"యూ బ్లడీ బాస్టర్డ్!" పాటిల్ ఒక్క కేకతోవెళ్ళి జూడో కాలరు పట్టుకొని చెంపమీద బలంగా కొట్టాడు.

"నూాశర్ కే బచ్చే! ఇంత మోసం చేస్తావా? నన్ను బుకాయిస్తావా? నువ్వింత ద్రోహం చేస్తావా, యూ కబడ్డీ బాస్టర్డు! నిన్నిక వదలను! నువ్విలా వుండకూడదు! పిరికిగొడ్డుని నా కళ్ళముందు సహించను-సహించలేను-"

విసురుగా కదిలి పాటిల్ కబ్బోర్డులోంచి రివాల్వర్ని తీశాడు. దానికి సైలెన్సర్ వుంది. అది చూసి జూడో తటాలున ప్రక్కకు దూకేయబోయాడు. కానీ అలో పే నిశ్శబ్దంగా దూసుకొచ్చిన బుల్లెట్ అతన్ని కదలనీయలేదు. నిల్చున్నచోటే పడగొట్టింది.

అతను మరి కదల్లేదు. మారు మాటాడలేదు.

"వెల్?" అన్నాను పాటిల్ని ఆసక్తిగా చూస్తూ, "ఇప్పుడు?"

అతను రివాల్వర్తో గబగబా వచ్చి, జూడో శరీరాన్ని తన్ని వెల్లకిలా తిప్పాడు. గుండె ప్రాంతం లోంచి కారుతున్న రక్తాన్ని కింద అదే రంగు కార్పెట్ పీల్చుకుంటోంది....

"నో డౌట్, వాడి పని పూర్తిచేశారు" అన్నాను.

అతను రివాల్వర్ గురిపెట్టి నా వైపు తిరిగాడు. "ఇప్పుడు నీ పని పూర్తిచేస్తాను...." కర్కశంగా వుంది అతని గొంతు. క్రూరంగా చూస్తున్నాడు.

నేను నవ్వాను. అతను కలవరపడేంత గట్టిగా నవ్వాను. "కూర్చోండి, మిస్టర్ పాటిల్!" అన్నాను వ్యంగ్యంగా, "ముందు రిలాక్సవండి! మాట్లాడుకోవల్సింది చాలా వుంది....బలాబలాలు తర్వాత తేల్చుకోవచ్చు. మీరా ఆవేశం మానండి. ఆవేశంలో ఒక హత్య చేసేశారు. ఆవేశంలో నేనూ కొన్ని పనులు చేశాను. ఆవేశం మనిషికి మంచిది కాదంటాను. కూర్చోండి మిస్టర్ పాటిల్!"

అతడింకా కలవరం చెందుతూ, రివాల్వర్‌ని దించేసి, వచ్చి కూర్చున్నాడు.

"ఇప్పుడు మీరు చట్టానికి పట్టుబడ్డారే అనుకోండి... ఏమవుతుంది? ఉరిశిక్ష పడదు. యావజ్జీవితమూ జైల్లో మగ్గరు. ఆఫ్టరాల్, మీ థగ్ సమాజానికి ఉపయోగ పడనివాడు. కొరగానివాడు. మీ డబ్బూ, పలుకుబడీ, సోషల్ స్టేటస్ యాథృచ్ఛికంగా మీకు శిక్షను తగ్గిస్తాయి.

మీరు బయటికొచ్చినప్పుడు బ్రతుకు తెరువు వెతుక్కో నవసరంలేదు. డబ్బే మీకు బంధువు. ఇక్కడంతా పోయినా, మరెక్కడో ఎంతో మిమ్మల్నప్పుడు ఆదు కుంటుంది, బంధువు కంటే మిన్నగా మీరక్కడ స్విస్ బ్యాంకిలో కూడబెట్టిన సొమ్మే మీకు రక్ష. ఆ పన్నెండు కోట్లూ పదహారు కోట్లవుతాయి. పదహారు యిరవై అవుతాయి. యిరవై పాతిక అవుతాయి.... పెరిగే దేకాని, తరిగేది కాదు. మీరు విడుదలై వచ్చి దర్జాగా బ్రతుకు వెలగబెట్టొచ్చు...."

అతను షాక్ తిన్నట్టు చూశాడు. "ఏమిటి? ఏమిటి నువ్వనేది?"

"ఫ్యాక్ట్స్, మిష్టర్ పాటిల్, వాస్తవాలు. అందుకే ఆవేశం వద్దన్నాను. శాంతంగా వినండి....యూసీ మిష్టర్ పాటిల్, మీ స్విస్ బ్యాంకి సీక్రెట్ అక్కౌంటులో పన్నెండుకోట్ల రూపాయల నల్లడబ్బు మూల్గుతోందన్న సంగతి ఇప్పుడు మీ ఒక్కరికే తెలిసిన రహస్యం కానే కాదు. స్విస్ బ్యాంకిల ఖ్యాతి ప్రపంచంలో ఎవరికీ తెలియనిదీ కాదు.

నిన్న మిష్టర్ జాన్ రోజర్స్‌తో మీ సమావేశాన్ని బట్టి, ఆ రొక్కాన్ని అతడి దేశానికి చెందిన అమెరికన్

బ్యాంకికి తరలించే ఆలోచనలో వున్నట్లు తెలుసు కున్నాను. అంతేనా? అతను మీ శ్యాషుకి సీక్రసీ గ్యారంటీ ప్లస్ స్విస్ బ్యాంకిలలోకంటే అధిక శాతం వడ్డీని ఆఫర్ చేస్తున్నాడు. అవునా? వెల్, సహజం గానే వాళ్ళ దేశంలో వడ్డీరేటెక్కువ. స్విస్ బ్యాంకిల క్లయంట్స్‌ని ఇలా తమ బ్యాంకికి ఆకర్షించే ప్రయ త్నంలో కన్విన్స్ చేస్తూ దేశంలో తిరుగుతున్నట్లు అనిపి స్తున్నాడు మిస్టర్ జాన్ రోజర్స్....అంతే కదూ?"

అతను స్తబ్ధుడైపోయి చూస్తున్నాడు. నెత్తురంతా తోడేసినట్టుంది ముఖం.

నేను బ్రీఫ్ కేసులోంచి మరికొన్ని ఫోటోలూ, మరో కేసెట్ తీసిచ్చాను. "మిస్టర్ జాన్ రోజర్స్‌తో మీ ఛాయాచిత్రాలు...సంభాషణాసారం..ఈ శబ్ద, ఛాయా ప్రమాణాలు మిమ్మల్ని కన్విన్స్ చేస్తాయి....వీటి మరో సెట్టు నా ఫ్రెండు వుంచుకుంది...."

"ఎందుకు! ఎందుకు చేశావీ పని!" తేరుకుంటూ బల హీనంగా అడిగాడతను.

"అర్థంలేని ప్రశ్న! మీ మనస్తితిని అర్థంచేసుకోగలను. మీరు దెబ్బకు దెబ్బతీయాలనుకున్నారు. మేం ఎదురు దెబ్బతీశాం, అంతే. నా బాస్‌ని బాస్టర్డు అన్నవాడు మనిషికి పుట్టినవాడు కాదు. తప్పులు బయటపెట్టారన్న కక్షతో పత్రికలపై దాడిచేసేవాడు భూమ్మీద వుండ తగ్గవాడు కాదు.

నా బాస్ వున్న వాస్తవాలే లోకానికి ప్రకటి స్తున్నాడు. ఎవరిమీదా ఏ కక్షతో అవాకులూ చెవాకులు అల్లడంలేదు. పత్రికా నిర్వహణ పవిత్రమైన బాధ్యత.

లోకంలో జరిగే అన్యాయాక్రమాలు తెలుసుకోవడానికి ప్రెస్‌ని మించిన మీడియాలేదు ప్రజలకి. దాన్ని గౌరవించడం మీలాంటి కొందరికి తెలియదు. దానివల్ల మీకే నష్టంవాటిల్లినా అందుకు కోర్టులున్నాయి, చట్టాలున్నాయి. అది మాని ఇలా అడ్డుమార్గాల ద్వారా మమ్మల్ని సాధించ పూనుకుంటే, అందుకు తగ్గ సమాధానం మేమూ ఇవ్వగలం!"

అతను నోరు తెరచుకుని చూస్తున్నాడు. రివాల్వర్ చుట్టు చెయ్యి బిగుసుకుంటోంది....

"సమాధానం — ఎలా వుంది మా సమాధానం?" అన్నాను కసిగా నవ్వి, "మమ్మల్ని తక్కువ అంచనా వేశారు. మాతో చెలగాటం చావుతో సమానం. ఇప్పుడు మిమ్మల్ని హంతకుడ్ని చేసి వదిలాను. రేపు కోర్టుకి దివాలా తీయిస్తాను! మీ బ్లాక్ మనీ బండారం మా పత్రికలో రావడమే తడవు — ఆ పన్నెండు కోట్లూ ఔట్లులా పేలిపోతాయి! ఔట్లులా! బూడిద! తట్టుకుంటారా? ఇప్పుడు మీ చేతులమీద శవం వుంది — రేపు నెత్తిమీద ఐ.టి. వాళ్ళుంటారు! ఇక ఎలా ఎదుర్కొంటారో ఎదుర్కోండి, మీ ఖర్మ! ఇదే మీకు శిక్ష!"

లేచి బ్రీఫ్‌కేసులో నేను తెచ్చిన వస్తువులన్నీ వేసుకుని, విజయగర్వంతో అతడ్ని చూశాను. అతనెటో శూన్యంలోకి చూస్తున్నాడు .... చేతివేళ్ళు రివాల్వర్ పై లెన్సర్ గ్రాక్కుని విప్పుతున్నాయి....

"గుడ్ బై, మిస్టర్ పాటిల్! ఇక వెళుతున్నాను...."

"ఆగు!" అతను గభాల్న లేచి నా ముందుకొచ్చాడు "నువ్వు—నువ్వు దీన్నాపలేవా? నన్ను కాపాడలేవా? ప్లీజ్ ...."

"మిమ్మల్ని కాపాడేకంటే ఎందులోనైనా దూకి చస్తాను!"

"నీ కెంత డబ్బయినా యిస్తాను, ఆలోచించు!"

"డబ్బు! ఎవరికి కావాలి డబ్బు! వెధవ డబ్బు! నేను నా బాస్‌ని తృప్తిపరచాలి! మీ సర్వ నాశనం చూడాలి! అర్థమవుతోందా! మీరు మమ్మల్ని నాశనం చేయాలనుకున్నారు—అది కక్ష. నేను మీకు గుణపాఠం చెప్పాను-ఇది శిక్ష! అనుభవించండి! దీన్నెలా ఎదుర్కొంటారో, ఏం చేసుకుంటారో నాకనవసరం! తెలిసిందా? నాకన వసరం పొండిక!"

ఆవేశంగా అని, నేనక్కడ్నుంచి వెంటనే బయట కొచ్చేశాను.

నా వెనుక ఏం జరుగుతుందో నేను గేటు దాటేవరకు తెలియదు. అప్పుడు వినిపించింది....లోపలినుంచి పెద్ద శబ్దం. ప్రేలుడు. అప్పుడూ నేను పట్టించుకోలేదు. అతడు చావే తనకు పరిష్కారమనుకుంటే నా కభ్యంతరం లేదు. పెద్ద చప్పుడుతో చావాలనుకుంటే మరీ సంతోషం!

దీంతో నా బాస్ నాపై వేసిన బాధ్యతను సక్ర మంగా పూర్తిచేశానన్న తృప్తి కలిగింది, నాకిది చాలు! ఈ తృప్తితో వెళ్ళి ఇప్పుడాయన ముందు ధైర్యంగా, గర్వంగా తలెత్తుకు నిలబడతాను. ఆయన అభినందన లందుకుంటాను. ఆ పైన నా శ్యామల చల్లని ఒడిలో వాలి సేద తీర్చుకుంటాను....

ఇంతకంటే ఏ మగవాడూ కోరుకునేది లేదు—తన బాస్ అభినందన, అర్థాంగి లాలన.

—:ఐపోయింది:—

# బస్సు దోపిడి

## టెంపోరావ్

ఫియట్ కారును ఆపి అతను కంపెనీ బోర్డువైపు చూశాడు. గోడపైన నేమ్ బోర్డు వుంది. ఎవరెస్టు డ్రయిక్లీనర్స్, ఆటోమేటిక్ మిషన్ వాషింగ్! ఇరవై నాలుగ్గంటల్లో దుస్తులు ఉతికి, యిస్త్రీచేసి ఇవ్వబడును.

అతడు పక్కన కూర్చున్న భార్యవంక చూశాడు.

"డార్లింగ్, ది రైట్ స్పాట్" అన్నాడతను.

"గెట్ గోయింగ్" అందామె.

వెనుక సీటుమీద ఐదేళ్ళ కూతురు కూర్చుని వుంది. కిటికీలోంచి ఆమె హుషారుగా బయటకు చూస్తోంది.

గేటు తలుపు తెరిచి వుంది. గేటు పక్కనే గూర్ఖా స్టూలుమీద కూర్చుని వున్నాడు. కారులో వున్న తెల్లవాడిని చూడగానే గూర్ఖా లేచి నిలబడి సలామ్‌చేశాడు.

"సాబ్, జాయియే!" అన్నాడు.

అతను కారును లోపలకు పోనిచ్చాడు. పెద్ద కాంపౌండ్. ఎదురుగా పెద్ద మేడ. పోర్టికోలో అతను

కారాపి దిగాడు.

"వస్తావా?" అన్నాడతను అద్దంలో భార్యవంక చూస్తూ.

"తొందరగా అవగొట్టి రండి" అందామె.

"నేనొస్తాను" అంది కూతురు.

"గివ్ కంపెనీ టు మమ్" అని ఒక పాకెట్ తీసుకుని అతడు వరండామీదకు నడిచాడు.

సాయిల్డ్ క్లోత్స్ కౌంటరు ముందుకు నడిచాడతను. అటువైపున్న యువతి అతడివంక నవ్వుతూ చూసింది.

"వెల్‌కమ్ సార్" అందామె.

పాకెట్‌ను అతను కౌంటరుమీద వుంచాడు.

"నాకివి తొందరగా కావాలి" అన్నాడతను.

పాకెట్ విప్పి ఆమె గుడ్డల్ని చూసింది. వివరంగా బిల్లురాసి అతడివైపు నవ్వుతూ చూసింది.

"మీ పేరూ, అడ్రెసూ చెప్పండి!"

"శ్రీనాడ్లు కాలగన్, 30, పామ్ స్ట్రీట్, లాస్ట్ బిల్డింగ్" అన్నాడతను.

అదంతా బిల్లుపైన రాసి ఆమె ఒరిజినల్ కాపీని చింపబోతూ ఆగింది.

"మీ యింటికి పంపమంటారా?" అందామె.

"ఫైన్, పంపండి!"

హోమ్ డెలివరీ అని రాసి ఆమె ఒరిజినల్ బిల్లును అతడికిచ్చింది. అతడు బిల్లు చూశాడు. 35 రూపాయలు!

"నాట్ మచ్" అనుకున్నాడు లోలోపల.

"మీరు యింగ్లండ్‌నుంచి వస్తున్నారా?" అడిగింది ఆమె.

"యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా" అన్నా

డతను నవ్వుతూ.

"హేపీ టు సి యు" అందామె.

అతడామెతో కరచాలనం చేశాడు.

"టూరిస్టు?" అడిగిందామె.

"ఇండియా బాక్‌గ్రౌండులో ఒక నవల రాస్తున్నాను. రోజంతా రాస్తూ వుంటాను. నా భార్యా, కూతురూ కార్లో వున్నారు" అని అతడామె వంక చూశాడు.

పొట్టిగా, పచ్చగా బొమ్మలా వుందామె. నుదురు మీద ఎర్రటి బొట్టు.

"మీ పేరు?" అడిగాడతను.

"మేనక" అందామె నవ్వుతూ.

"ఫైన్ నేమ్! ఐ లవ్ ఇండియా! గొప్ప దేశం. ఇక్కడి ప్రజలు మాలాంటి విదేశీయుల్ని చాలా ప్రేమగా చూస్తారు. బై బై" అని అతడు బయటకు పరుగెత్తాడు.

స్టీరింగ్ వీల్ వెనక కూర్చుని వెనుతిరిగి అతను చూశాడు. టోనీ లేదు.

"తోటలో తిరుగుతోంది" అంది భార్య.

అతడు హార్న్ నొక్కాడు. పరుగెత్తూ టోనీ వచ్చి కార్లో కూర్చుంది.

"డాడ్, మమ్, లుక్ ఎట్ దిస్!" అరిచిందామె.

ఇద్దరూ వెనక్కు చూశారు. ఆమె చేతిలో జామి పండు వుంది.

"ఫైన్ ఫ్రూట్! యాపిల్లా వుంది" అరిచిందామె.

"ఎవరిచ్చారు?"

"మై ఇండియన్ ఫ్రెండ్" అందామె.

నవ్వుతూ అతడు కారును బయటకు పోనిచ్చాడు.

## 2

ఏర్ కండిషండ్ గదిలో సోఫాలో కూర్చుని అతడు స్కాచ్ విస్కీ తాగుతున్నాడు.

పొడుగ్గా, బలంగా వున్నాడు. పైకి దువ్విన క్రాపు. సన్నటి మీసాలు. కళ్ళు ఎర్రగా మెరుస్తున్నాయి.

సోఫా పక్కనున్న బజ్జర్ అతడు నొక్కాడు.

ఒక యువతి గబగబా లోపలకు వచ్చింది. అతడి కెదురుగా నిలబడింది. అతడు టైము చూశాడు. పది దాటింది.

"ఎనీ న్యూస్, రీటా?"

"నో బాస్! వాళ్ళు తొమ్మిదింటికి బయల్దేరి వెళ్ళారు" అందామె.

"ఏ వార్తా మనకు రానంతకాలం అంతా సవ్యంగా సాగుతోందని మనం వూహించాలి" అన్నాడతను.

"వెల్ సెడ్!"

విశాలమైన ఆమె కళ్ళలోకి చూశాడతను. లైట్ బ్లూ నైలాక్స్ చీర ధరించింది. ఆమె శరీరం బంగారంలా మెరుస్తోంది.

"రీటా, యూ ఆర్ లవ్లీ!" అన్నాడతను.

బాస్ పొగిడేసరికి ఆమె వుప్పొంగిపోయింది. అతడంటే ఆమెకు చాలా భయం. అతడికి కోపం వస్తే అందరూ హడలిపోతారు. ఆ సమయంలో అతడి మొహం భయంకరంగా వుంటుంది.

అతడు ఖాళీ గ్లాసువైపు చూశాడు.

"విస్కీ పొయ్యి!"

ఆమె గ్లాసులో విస్కీ పోసింది. ఇగ్లూ తెరిచి ఐస్ క్యూబ్స్ పడేసింది. కొద్దిగా సోడా పోసింది. అతడు

గ్లాసును అందుకున్నాడు. సగంపైన తాగి ఆమెవైపు చూశాడు.

"తలుపు లాక్ చేసిరా!"

ఆమె గుండె వేగంగా కొట్టుకోసాగింది. మెల్లిగా వెళ్ళి ఆమె తలుపుకున్న గడియను వేసింది. వెనక్కి తిరిగొచ్చి అతడిముందు నిలబడింది.

ఆత్రంగా ఆమె కళ్ళు మెరుస్తున్నాయి. సోఫాలో అతను పక్కకు జరిగాడు. ఆమెను కూర్చోమన్నాడు. వినయంగా ఆమె కూర్చుంది.

తటాలున అతెడిచేయి ఆమె నడుమును చుట్టేసింది. క్షణకాలం ఆమె కళ్ళలోకి, ఎర్రటి పెదిమలకేసి చూశాడతను. పక్కకు వంగి ఆమెను ముద్దెట్టుకున్నాడు. ఆమె చేతులు అతడిని బలంగా చుట్టేశాయి.

"రీటా, యు ఆర్ స్వీట్!" అన్నాడతను.

ఆమె మాట్లాడలేదు. అతడి అప్యాయత ఆమెను మాట్లాడకుండా చేసింది. ఇంతవరకూ ఆమె భయపడే వ్యక్తి తనను దగ్గరకు లాక్కుని ముద్దాడాడు! ఇదొక కొత్త అనుభవం!

గ్లాసులోని విస్కీని తాగేశాడతను. కింగ్ సైజు సిగరెట్ వెలిగించి పొగ వదులూ ఆమెవంక చూశాడు.

"త్వరలో మనిద్దరం కాశ్మీర్ వెళ్దాం" అన్నాడు.

"ఎప్పుడు?"

"వీలు చూసుకొని."

అతడికేసి నవ్వుతూ చూసిందామె.

"బాస్, యింతవరకూ మీరు పిలిస్తే నేనెంతో భయపడేదాన్ని!"

"ఇప్పుడు భయం పోయిందా?" ప్రశ్నించాడతను

నవ్వుతూ.

ఆమె కనురెప్పలు చిల్లించింది. పొడుగాటి ఆమె జుత్తును నిమిరాడతను. కిలకిల నవ్వుతూ అతడి ఒళ్ళో పడిందామె.

"రీటా, నీకేం కావాలో కోరుకో!"

"ఎప్పుడూ నేను మీతో యిలాగే వుండాలి" అందామె మెల్లగా.

"వుంటావు, యిలాగే నా దగ్గరగా" అన్నాడతను.

నిమిషాలు గడుస్తున్నాయి. టైము పదకొండు దాటింది.

"రీటా, ఈ రాత్రి చాలా పనులున్నాయి. వెళ్ళి భోజనం చేద్దాం, పద" అన్నాడతను.

ఆమె లేచి నిలబడింది.

"రీటా, వెళ్ళి అన్నీ అమర్చమను! డిన్నర్ ముందు మరో పెగ్" అని గ్లాసులో విస్కీ పోసుకున్నాడు.

అతనివైపు చూసి నవ్వుతూ ఆమె హుషారుగా బయటకు నడిచింది.

అతడు గ్లాసులోని విస్కీని మెల్లిగా తాగాడు. సిగరెట్ వెలిగించి పొగ వదుల్తూ వెనక్కి వాలాడు.

అతడి మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. ఇంతవరకూ తను ఏం చేసినా నెగ్గుతూనే వుంది. ఈ అదృష్టం యింకా ఎంతకాలం వుంటుందో!

రీటా వుషారుగా గదిలోకొచ్చింది. "భోజనం సంగతి మర్చిపోయారా, బాస్?" ప్రశ్నించిందామె.

"లేదు, వస్తున్నా" అని లేచాడతను.

ఎదురుగా వున్న రీటాను అతడి చేతులు చుట్టేశాయి.

"మై డియర్ స్వీటీ!" అంటూ అతడామెను వుద్రే

కంతో ముద్దాడాడు.

"పదండి భోజనానికి" అందామె.

ఇద్దరూ డైనింగ్ గదివైపు అడుగులు వేశారు.

## 3

రాత్రి నాలుగు దాటింది. మరికొన్ని గంటల్లో తెల్ల వారుతుంది.

ఎత్తయిన కుర్చీలో అతడు కూర్చుని వున్నాడు. ఎదురుగా పదిమంది కుషన్డ్ కుర్చీల్లో కూర్చున్నారు. గదిలో ఫ్లోరసెంట్ ట్యూబులు ప్రకాశవంతంగా వెల్గు తున్నాయి.

అతడు క్షణకాలం ఎదురుగా కూర్చున్న వాళ్ళవైపు చూశాడు. రాయుడు, గజేంద్రన్, మస్తాన్, రాజు, పింటో, కణ్ణన్, గోపీ, చందర్, నాయుడు, రాజన్!

"బ్రదర్స్, అంతా మన ప్లాను ప్రకారం జరిగినందుకు సంతోషం. ఇవాళ మన అదృష్టం బాగుంది. రాత్రి పయనంచేసే బస్సులను దోచుకుంటే పెద్ద మొత్తాలు చేతికిరావు. కాని యివాళ మనకు ఐదు లక్షలు దొరికింది. ఇది గ్రాండ్ సక్సెస్! నా ప్లాన్ని సక్రమంగా నిర్వ హించిన మిమ్మల్ని అభినందిస్తున్నాను" అని ఆగాడతను.

జజ్జర్ నొక్కాడు. మిస్ కామిూ వయ్యారంగా అడుగులేస్తూ లోపలకు వచ్చింది. "కామిూ, షేంపేన్!" అన్నాడతను.

ఆమె బొంగరంలా తిరుగుతూ వెళ్ళిపోయింది. అందరి కళ్ళూ ఆమెమిూదే వున్నాయి. ఎర్రటి స్కర్టు, వైట్ జాకెట్ ధరించిందామె. బొడ్డు చుట్టూ రంగు పులుము కుంది.

కాస్సేపట్లో మరో వ్యక్తితో ఆమె గదిలోకొచ్చింది.

పదకొండు గ్లాసుల్లో షేంపేన్ పోసి, ఆమె వాటిని అందర్కీ అందించింది.

అందరూ గ్లాసులను ఎత్తి పట్టుకున్నారు.

"చియర్స్ టు ఆల్!" అన్నాడు బాస్.

అందరూ "చియర్స్!" అన్నారు.

అందరూ షేంపేన్ తాగుతూ వుండిపోయారు. బాస్ సౌజ్ఞ గుర్తించి మిస్ కామీ మళ్ళీ గ్లాసుల్లో షేంపేన్ పోసింది.

తన గ్లాసులో మూడోసారి షేంపేన్ పోస్తున్న కామీవైపు రాయుడు ఆకలిగా చూస్తూ ఆమె బుగ్గను నిమిరాడు. ఆమె నవ్వుతూ పక్కకు జరిగింది.

"ఆడవాళ్ళతో ఆడే సమయం కాదిది!" అన్నాడు బాస్ రాయుడువంక కోపంగా చూస్తూ.

"సారీ, బాస్, క్షమించండి!" అన్నాడు రాయుడు.

"ఇవాళ మీకు ఏ ఆటంకాలైనా ఎదురయినాయా?" అడిగాడు బాస్.

ఎదురుగా కూర్చున్న వాళ్ళకు నాయకుడైన గజేంద్రన్ సూటిగా బాస్‌వైపు చూశాడు.

గజేంద్రన్ పొడుగ్గా, లావుగా వుంటాడు. పేరుకుతగ్గ బలశాలి.

"పెద్దగా ఆటంకాలు లేవు. ఆ బస్సులో యిద్దరు యువకులు బెంగుళూరు వెళుతున్నారు. వాళ్ళ సూట్‌కేసులో నాలుగు లక్షల రొఖ్ఖం వుంది. వాళ్ళు మమ్మల్ని ఎదిరించడానికి ప్రయత్నించారు. రెండు దెబ్బలుతిన్నాక వాళ్ళు నోరు మూసుకుని సూట్ కేసును మాకిచ్చేసారు. బస్సులో వున్న తతిమ్మావాళ్ళు ఏమీ అనలేదు. తారెత్తి పోతూ వున్నదంతా మాకిచ్చేశారు" అన్నాడు గజేంద్రన్.

"బాస్, కత్తిని చూసినా, పిస్టల్ని చూసినా మన ప్రజలు మాట్లాడరు. వినయంగా తలొంచి అంతా యిచ్చేస్తారు" అన్నాడు నాయుడు.

"భయం మనుషుల్ని తొక్కేసి బానిసల్ని చేస్తుంది" అన్నాడు బాస్.

పింటో సిగరెట్ పొగ పీల్చి వదుల్తూ బాస్ వైపు చూశాడు.

"బాస్, మీది చాలా గొప్ప బుర్ర! ఒక కార్లొంచి అందరం బస్సు ముందు దిగాం. పనవగానే అదే కారులో పారిపోయాం. కొంత దూరం వెళ్ళాక దుస్తులు మార్చుకుని రెండు కార్లలో సర్దుకుని పట్నానికొచ్చేశాం. కారు నంబర్లను మీరు చెప్పినట్లు మార్చేశాం" అన్నాడు పింటో.

"గుడ్ వర్క్! బస్సు ముందు ఆగిన కారు నంబరు ప్రయాణీకులకు గుర్తుంటుంది. అందువలన నంబరు మార్చాలి! పదిమంది వుండే కారుకోసం పోలీసులు వెతుకుతారు. అందువలన వీలైనంత తొందరగా సర్దుకోవాలి" అన్నాడు బాస్.

ఐదు గంటలు దాటాక వాళ్ళ సమావేశం ముగిసింది. వారి గదులకు వాళ్ళు వెళ్ళిపోయారు అలసటతో.

## 4

హోటల్ గ్రీన్‌లాండ్‌లో తన గదిలో కూర్చుని డిటెక్టివ్ వాలి దినపత్రికను చదువుతున్నాడు. కొంచెం దూరంలో అద్దం ముందు నిలబడి గిరి గడ్డం గీసుకుంటున్నాడు.

బయటనుంచి ఎవరో తలుపుమీద తట్టారు.

"కమిన్" అన్నాడు వాలి.

ఇన్‌స్పెక్టర్ శంకరం నవ్వుతూ గదిలోకొచ్చి వాలికి నమస్కారించాడు.

"వాలిగారూ, పేపరు చూశారా?" అడిగాడతను.

"ఇప్పుడే చూస్తున్నాను" అన్నాడు వాలి.

"బస్సు డికాయిట్స్ గురించి చదివేరా?"

"చదివాను. శంకరం భాయ్, రాత్రి వెళ్ళే బస్సులను రెయిడ్ చేసి దొంగల ముఠా దోచుకుపోతూంటే మీరు ఏం చేస్తున్నారు?" అడిగాడు వాలి.

"వాలిగారూ, ఏం చెయ్యాలో తెలియడంలేదు. లక్షలాది ప్రజలు ఉద్యోగాలులేక, ఆకలికి బలై దొంగలుగా మారిపోతున్నారు" అన్నాడు యిన్‌స్పెక్టర్.

చుట్ట పొగ వదులుతూ వాలి యిన్‌స్పెక్టర్ వైపు చూశాడు. యిన్‌స్పెక్టర్ శంకరం సోఫాలో వోడిపోయినట్లు నిస్సహాయంగా కూర్చున్నాడు.

"శంకరం భాయ్, ఇటువైపు వెళ్ళే నైట్ బస్సులను చాలాకాలంనుంచి దొంగల ముఠా రెయిడ్ చేస్తూనే వుంది. ఈపాటికి పోలీసులు నైట్ బస్సులకు రక్షణ చేకూర్చి వుండవలసింది. అటువంటిదేమీ జరగకపోవడం శోచనీయం" అన్నాడు వాలి.

గడ్డం గీయడం ముగించి గిరి యిన్‌స్పెక్టర్ పక్కనే కూర్చున్నాడు.

"వాలిగారూ, నిన్న రాత్రి బస్ కండక్టర్ కోలార్ చేరాక పోలీసు రిపోర్టు యిచ్చాడు. దొంగల ముఠా కారులో మద్రాసువైపు వెళ్తోందని మాకు వార్త వచ్చింది. నేను జీప్‌లో ట్రంక్ రోడ్డుమీదకు వెళ్ళాను. కాని వాళ్ళు చెప్పిన నంబరున్న కారు కనపడలేదు.

దొంగల ముఠా పుంగనూర్ వైపు వెళ్ళి వుండొచ్చు అని భావిస్తూ, రెండు గంటలదాకా చూసి వెళ్ళిపోయాను."

"శంకరం భాయ్, నువ్వు ట్రంక్ రోడ్డుమీదవుండగా ఏ కార్లేనా మద్రాస్ వైపు వెళ్ళాయా?"

"ఒక ఫియట్, ఒక అంబాసిడర్, కొన్ని లారీలు వెళ్లాయి. దొంగల ముఠాలో పదిమందిపైన వున్నారని కోలార్ పోలీసులు మాకు చెప్పారు. ఫియట్ కారులో ఆరుగురు వున్నారు. అంబాసిడర్లో ఆరుగురున్నారు. ఆ కార్ల నంబర్లు వేరుగా వున్నాయి. అందువలన వాటిని ఆపి, చూసి పోనిచ్చాం" అన్నాడు యిన్స్పెక్టర్.

క్షణకాలం వాలి మాట్లాడలేదు. ఏదో తీవ్రంగా ఆలోచిస్తూ ఉండిపోయాడు.

అమాంతంగా పడకకుర్చీలో లేచి కూర్చున్నాడు.

"శంకరం భాయ్, నీ కళ్ళను వాళ్ళు చాలా తెలివిగా కప్పారు. నిన్ను పప్పులో అడుగేయించారు!" అని వాలి గంభీరంగా నవ్వాడు.

ఇన్స్పెక్టర్ అర్థంకానట్లు వాలివైపు చూశాడు. వాలి మాటలు పూర్తిగా అవగాహనవక గిరి సతమత మవుతున్నాడు.

"చూడు, శంకరం! బస్సు దగ్గరకు వాళ్ళు అదే కార్లో పారిపోయినట్లు ప్రయాణీకులు చిత్రిస్తారు. కొంత దూరం వెళ్ళాక అక్కడున్న మరో కారులోకి కొందరు మారివుంటారు. రెండు కార్లూ వేరువేరుగా మద్రాస్ వైపు వెళ్ళుంటాయి!"

"గుడ్ హెవన్స్! అయితే కారు నెంబర్లు...."

"దొంగలు సరైన నంబరున్న కారును వాడ్తారా? నంబరు ప్లేటును మారుస్తారు" అన్నాడు వాలి.

"మీరు చెప్పినట్లు కావచ్చుసార్" ఒప్పుకున్నాడు యిన్‌స్పెక్టర్ శంకరం.

"నువ్వు చూసిన ఆ రెండు కార్ల నంబర్లూ రాసుకున్నావా?"

"రాసుకున్నాను, సార్."

"ఆ నంబరున్న కార్లు ఎవరివో కనుక్కున్నావా?"

"లేదు, సార్."

"శంకరం భాయ్, సాయంత్రం నేనూ గిరీ మద్రాస్‌కు బయల్దేరుతున్నాం. ఈ లోపల ఆ కార్ల నంబర్లను గురించి తెలుసుకో. అవి నకిలీ నంబర్లయితే ఆ కార్లలో వెళ్ళినవాళ్ళు దొంగలని మనం అనుకోవచ్చు" అన్నాడు వాలి.

"మీరు చెప్పింది విన్నాక నేనెలా మోసపోయానో నాకు తెలుస్తోంది. అంబాసిడర్ కారులోని వాళ్ళు అరవంలో మాట్లాడుకుంటున్నారు. ఫియట్ కారులోని వాళ్ళు కన్నడం భాషలో మాట్లాడ్డం విన్నాను. వాళ్ళిద్దర్కీ సంబంధముందని నేను అనుకోలేదు."

"శంకరం భాయ్, వీటినిబట్టి వాళ్ళు చాలా తెలివైన వాళ్ళని మనం అనుకోవాలి. ఒకే ముఠా రెండు భాగాలుగా విడిపోయి రెండు కార్లలో వెళ్ళిపోయారు. నిన్ను మోసగించడానికి భాషలు కూడా మార్చారు."

"వాలిగారూ, ఈ ట్రంక్ రోడ్డు మీద యీ మధ్య చాల దోపిడీలు జరిగాయి. రాత్రి ప్రయాణమంటే ప్రజలకు భయం పట్టుకుంది. మరి కొంత కాలం యిలా సాగితే ఎవ్వరూ నైట్ బస్ ఎక్కరు. ప్రయివేట్ కార్లు రాత్రిళ్లు ప్రయాణం చేయడం యెప్పుడో మానేశాయి."

పడక కుర్చీలో వాలి వెనక్కు వాలాడు. ఆరిపోయిన చుట్టను లైటర్‌తో వెలిగించాడు.

"నిన్న రాత్రి వాళ్ళ బస్సును ఎక్కడ ఆపారు?"

"పల్మనేరు కోలార్ మధ్య, కొండ ప్రదేశంలో. దొంగలు పోగానే బస్సు ముందుకు కదిలింది. కోలార్ చేరగానే పోలీసు రిపోర్టు యిచ్చారు."

"ఎంత పోయింది?"

"నిన్న రాత్రి చాలా పోయిందట, సార్. ఐదారు లక్షలు ప్రయాణీకులు నష్టపోయారని పోలీసు యిన్‌స్పెక్టర్ చెప్పాడు. ఇద్దరు యువకులు సూటుకేసులో తీసుకు వెళుతున్న నాలుగు లక్షలు పోయిందట. బస్సు కండక్టర్ దగ్గర ఎక్కువగా డబ్బులేదు. ఈ దోపిడీ మూలంగా నష్టపోయింది ప్రజలు."

"సూటుకేసులో నాలుగు లక్షల రొఖ్ఖంగా ఆ యువకులు ఎందుకు పట్టుకెళుతున్నారు?"

"ఆ వివరాలు నేనడగలేదు."

"శంకరం భాయ్, కోలార్ ఇన్‌స్పెక్టర్‌కి ఫోన్ చేసి ఆ యువకుల పేర్లు, అడ్రెస్‌లు కనుక్కో! వాళ్ళతో నాకు పనుంది" అన్నాడు వాలి.

"ఈ దోపిడీతో వాళ్ళకు ఏదేనా సంబంధం వుందని అనుమానిస్తున్నారా?"

వాలి చిరునవ్వుతో యిన్‌స్పెక్టర్ వంక చూశాడు.

"శంకరం భాయ్, నీ భార్య కమల పోయాక నీ మెదడు ఆలోచించడం మానేసింది. కమల బతికున్నపుడు నువ్వు ఎంత హుషారుగా వుండేవాడివో జ్ఞాపకం తెచ్చుకో!"

ఇన్‌స్పెక్టర్ శంకరం రుమాలుతో కళ్ళు తుడుచు

కున్నాడు. గిరి అతని భుజంమీద చెయ్యి వేశాడు.

"వాలిగారు, ఆ రోజులు ఇంక రావు. మీరు అన్నది నిజమే. కమలతో నాలోని కొంత భాగం వెళ్ళిపోయింది. నీడలా జీవిస్తున్నాను" అన్నాడతను ఉద్రేకంతో.

వాలి సూటిగా అతడివంక చూశాడు. "నువ్వు పొర బడుతున్నావు. నీలోంచి కొంత భాగం కమలతో పోయిందని అనవసరంగా కృంగిపోతున్నావు. అది నిజం కాదు. తనలోని సగాన్ని నీలో వదిలి ఆమె వెళ్ళి పోయింది. అందువలన నువ్వు విచారంలో మునిగి జీవించ కూడదు. నీలో వున్న ఆమెను ఆనందపర్చాలి! అదే ఆమె కోరేది" అన్నాడు వాలి.

ఇన్‌స్పెక్టర్ శంకరం తలవంచి వాలికి నమస్క రించాడు.

"మీ మాటలు వింటూంటే కమల నిజంగా నాలో వుందనిపిస్తోంది."

ఇన్‌స్పెక్టర్ వాలివైపు చూశాడు.

"ఆ యువకుల పేర్లూ అడ్రెసూ కనుక్కొని మీకు చెప్తాను" అని శంకరం బయటకు పరుగెత్తాడు.

## 5

ఏర్‌కండిషండ్ గదిలోని ఫ్లోరసెంట్ లైట్లు ప్రకాశ వంతంగా వెలుగుతున్నాయి.

అతడు ఎదురుగా కూర్చున్న పదిమందివైపు చూశాడు. గదిలో నిశ్శబ్దంగా వుంది.

"బ్రదర్స్, ఈసారి పెద్దపెట్టున ఏదో చేయాలని నా ఆశ. ఇది పెద్ద పని. దీనిమూలంగా మన చేతిలోకి 50 లక్షలు రావచ్చు."

"బాస్, ఏమిటో చెప్పండి" అన్నాడు గజేంద్రన్.

"తొందరపడకండి! ఇటుపైన బస్సులవైపు మనం కొంతకాలందాకా వెళ్లొద్దు. డిటెక్టివ్ వాలి మన్ని గురించి దర్యాప్తుచేస్తున్నారని నాకు వార్త వచ్చింది. ఆయన ప్రస్తుతం మద్రాసులో వున్నారు. మనం ఎంత జాగ్రత్తపడినా, ఏ తప్పులూ చేయకపోయినా వాలిగారు మన్ని గురించి పసిగట్టగలరు."

"బాస్, వాలిని మీరు ఓవర్ ఎస్టిమేట్ చేస్తున్నారు. ఆయన బుర్రకంటే మీ బుర్ర గొప్పది!" అన్నాడు పింటో.

అతడు విచిత్రంగా నవ్వాడు.

"శత్రువు తెలివిలేనివాడని నేనెన్నడూ అనుకోను. అందులోనే వుంది నా బలం. నాకు తెలిసినంతగా వాలిగార్ని గురించి మీకు తెలియదు. మనం ఆవులించకుండానే పేగులు లెక్కపెట్టగల్గిన వ్యక్తాయన."

బాస్ చెప్పినది విని అందరూ మౌనం దాల్చారు. అందరూ బాస్ వైపు చూస్తూ కూర్చున్నారు.

"బ్రదర్స్, వెంకన్నరాజా పేరు మీరు విన్నారుగా?" ప్రశ్నించాడు బాస్.

"అతడి అసిధ్యాభైకోట్లపైన వుంటుందని పత్రికల్లో చదివాను" అన్నాడు గజేంద్రన్.

"అతనే, కోటీశ్వరుడు. అతడి మొదటి భార్య సంతానం లేకుండా మరణించింది. అతడి రెండో భార్య ఒకమ్మాయిని కని చనిపోయింది. అటుపైన అతడు మళ్లా పెళ్ళాడలేదు. ఆ అమ్మాయి వయసు యిప్పుడు పద్దెనిమిది సంవత్సరాలు వుంటుంది. ఆ అందాలరాశి పేరు కూడా మీరు పత్రికల్లో చూసుంటారు!"

"మిస్ ప్రమీల" అన్నాడు రాజన్.

"వెంకన్నరాజాకి యీ జీవితంలో సర్వస్వం ఆ కూతురే. ఆమెకోసం అతను ఏదేనా చేస్తాడు. ఆమెను వదిలి అతడు జీవించలేడు. నా ప్లాను మనుషులు సృష్టించుకునే ప్రేమబంధం మీద ఆధారపడింది."

అతడు ఆగాడు. క్షణకాలం అందర్నీ చూస్తూ వుండిపోయాడు.

"బ్రదర్స్ మనం ప్రమీలను ఎత్తుకుపోదాం!" అన్నాడతను బులెట్‌లా.

గదిలోని వాళ్ళు తృళ్ళిపడ్డారు.

"బాస్, వెంకన్న రాజా చాలా పేరున్న మనిషి. ప్రధానమంత్రి దగ్గరనుంచి రాష్ట్ర ముఖ్యమంత్రిదాకా అతడికి తెలుసు. గవర్నర్లు, మేయర్లు అతడి స్నేహితులు. అతడి కూతుర్ని మనం ఎత్తుకుపోతే ఊరుకుంటాడా? దేశంలోని పోలీసులందరూ మనకోసం వెతుకుతారు" అన్నాడు గజేంద్రన్.

"గజేంద్రన్, కూతురిమీదుండే ప్రేమ అతడి నోరును నొక్కేస్తుంది. ఎందరో తెలిసినా యెవరి దగ్గరకూ అతను వెళ్ళడు. మనం అడిగింది చెల్లించి అతడు కూతుర్ని వెనక్కి రప్పించుకుంటాడు. అతడిని భయపెట్టి మనం డబ్బు తీసుకోవచ్చు. కోట్లమీద ఆసి వున్నవాడు యాభై లక్షల కోసం మన్ని ఎదిరించడు. తన కూతురు కోసం ఏదైనా యిస్తాడు."

"వాలిగారు యీ పట్నంలో వున్నారని మీరే అన్నారు. వాలిగారు రంగంలోకి దిగితే మనకు ప్రమాదముంటుందేమో!" అడిగాడు రాజా.

"రంగంలోకి వాలిగారు రారు. వెంకన్న రాజా ఆయన్ని పిలవడు. ఎవర్నైనా పిలిస్తే అతడి కూతురు

ఆపదలో వుంటుంది. ఒక్కగానొక్క కూతురకోసం వెంకన్న రాజా కళ్ళు మూసుకొని డబ్బు యిచ్చేస్తాడు" అన్నాడు బాస్.

"బాస్, మీ ప్లాను ఫలిస్తుందనే నమ్మకం నాకు పూర్తిగా వుంది. ఇంతవరకూ మీ ప్లాన్‌లు ఏవీ ఫెయిల్ కాలేదు. తతిమ్మా విషయాలు గురించి వివరంగా చెప్పండి" అన్నాడు గజేంద్రన్.

"ప్రమీలను ఎలా ఎత్తుకుపోవడం? ఈ విషయంమీద చెప్తాను. ఆమెను ఎవరో ఎత్తుకుపోయినట్లు పబ్లిసిటీ రాకుండా మనం జాగ్రత్తపడాలి. ఆమెను మనం ఎత్తుకు పోయిన విషయం వెంకన్నరాజాకు మాత్రం తెలియాలి."

"గుడ్ ఐడియా", అన్నాడు పింటో.

"ఇది జాగ్రత్తగా వినండి. ప్రమీల ప్రతిరోజూ ఆరింటికి యంగ్ లేడీస్ క్లబ్‌కు వెళుతుంది. కారును ఆమే నడుపుతుంది. సరిగ్గా 6-15కి ఆమె కారు దేవిల్స్ రోడ్డమ్మట వెళ్తూవుంటుది. ఆ రోడ్డు మీద ఆ సమయంలో యెవ్వరూ వుండరు. చాలామందికి ఆ రోడ్డమ్మట వెళ్ళడం భయం. ఆ రోడ్డుమీద ఆమె కారును ఆపాలి. మన మనిషి ఆమె కారులో ఎక్కాలి."

అందరివైపు చూస్తూ బాస్ ఆగాడు.

"ఆమె కారులో మన మనిషి ఎలా యెక్కడం? దీనికొక మంచి పద్ధతిని నేను ఆలోచించాను. మేనక ఆ రోడ్డుమీద కుంటుతూ నడుస్తూ వుంటుంది. వికలాంగుల మీద ఆమెకు ఎంతో అభిమానం. కారులో వాళ్ళను యెక్కించుకొని కావలసినచోట దింపుతూ వుంటుంది. కుంటుతున్న మేనకను ఆమె కారులో ఎక్కించుకుంటుంది. అటుపైన మన పని సులువుగా సాగిపోతుంది"

అన్నాడతను.

గదిలోని వాళ్ళందరూ తీవ్రంగా ఆలోచిస్తున్నారు. కారులోకెక్కిన మేనక, ఒక యువతి మరో యువతిని ఏం చేయగలదు?

"బ్రదర్స్ కారులో కూర్చున్న మేనక పిస్టల్ని ప్రమీలవైపు గురిపెట్టి తను చెప్పిన ప్రకారం కారును పోనీయమంటుంది. ప్రమీల ఆమె చెప్పినట్లే చేస్తుంది. ప్రమీల కారు ఐదు నిముషాల్లో బరోస్ రోడ్డుకు చేరుకుంటుంది. అక్కడ మన కారు వుంటుంది. తన కారు నుంచి ప్రమీల మన కార్లోకి మారుతుంది. మేనక ఆమె పక్కనే వుంటుంది. మన కార్లో ముగ్గురు మాత్రం వుంటారు. గజేంద్రన్, రాయుడు ప్రమీల, మేనకలతో మన కార్లో వెళ్ళిపోతారు. మస్తాను ప్రమీల కారులో మహాబలిపురంవైపు వెళ్తాడు. కారును అక్కడ వదిలేసి, బస్సులో అతడు తిరిగి వస్తాడు."

బాస్ ఆగాడు. అందరి చూపూ బాస్ వైపు కేంద్రీకృతమైంది.

"గజేంద్రన్ వున్న కారు యిక్కడకు రాదు. అది తిన్నగా 30, పామ్ స్ట్రీట్ కు వెళుతుంది. పామ్ స్ట్రీట్ చివర 30 నంబర్ బిల్డింగ్ వుంది. అందులో రోనాల్డ్ కాలగన్ అనే అమెరికన్ ఉంటున్నాడు. అతడికి భార్యా, కూతురూ వున్నారు. బిల్డింగ్ చుట్టూ కాంపౌండు వాల్ వుంది. ప్రమీల అక్కడ ఉంటుంది."

"అదెలా సాధ్యం, బాస్? రోనాల్డ్ కాలగన్ తనింట్లో వాళ్ళను వుంచుకోక పోవచ్చు!" అన్నాడు మస్తాన్.

బాస్ గంభీరంగా నవ్వాడు.

"బ్రదర్స్, పనసకాయను కోసేకత్తి గుమ్మడికాయను కూడా కోయగలదు. ప్రమీలవున్న మన కారు అక్కడకు చేరుకునే ముందే రాజన్, గోపీ రోనాల్డు కాలగన్ యింటికి వెళ్తారు. ఆ ఇంట్లో వుండే ముగ్గుర్నీ ఒక గదిలో బంధిస్తారు. అమెరికానుంచి ఇంతదూరం వచ్చిన కాలగన్ భయపడి రాజన్, గోపీ చెప్పినట్లు చేస్తాడు. అలా చేయకపోతే ముగ్గురూ ఇండియాలో చావవలసివస్తుంది. బాగుందా?"

"టెర్రిఫిక్" అన్నాడు పింటో.

"ఫన్‌టాస్టిక్ ప్లాన్" అన్నాడు గజేంద్రన్.

"ప్రమీల ఆ యింట్లో చేరుకున్నాక నేను అక్కడికి వస్తాను. వెంకన్న రాజానుంచి డబ్బు కలెక్టు చేయడానికి నేనొక కొత్త పద్ధతి ఆలోచించాను. రోనాల్డు కాలగన్ యింటికి నేనొచ్చాక అదేమిటో మీకు తెలుస్తుంది. దీనితో యీ సమావేశం ముగిసింది" అన్నాడు బాస్.

## 6

సరిగ్గా ఆరింటికి రాజన్, గోపీ కార్లోంచి రోనాల్డు కాలగన్ యింటిముందు దిగారు.

ముందు తలుపు మూసివుంది. రాజన్ తలుపుమీద తట్టాడు. తలుపు తెరవబడింది. రోనాల్డు భార్య మేరీ వాళ్ళకెదురుగా నిలబడింది. "ఎవరు మీరు? ఏం కావాలి?" అందామె నవ్వుతూ.

రాజన్ పిస్టల్ తీసి ఆమెవైపు గురిపెట్టాడు. "కదలకిక్కడ! మమ్మల్ని ఎదిరించడానికి ప్రయత్నిస్తే అమెరికా వెళ్ళవు!" అరిచాడు రాజన్.

పొడుగ్గా లావుగా నల్లగా వున్న రాజన్ వైపు ఆమె భయంతో చూసింది.

"శోనాల్డు ఎక్కడ?"

"పక్క గదిలో రాసుకుంటున్నారు" అందామె.

"మీ కూతురెక్కడ?"

"తండ్రి గదిలో వుంది. బొమ్మలతో ఆడుకుంటోంది."

"ఫైన్, ఆదే గదిలోకి నువ్వూ పద!" గద్దించాడు రాజన్.

"రాసుకునేటప్పుడు డిస్టర్బ్ చేస్తే నా భర్తకు కోపం వస్తుంది. మీకేం కావాలో నాతో చెప్పండి!"

"ఆ గదిలోకి పద!" అర్చాడు రాజన్.

అతడివైపు ఆమె క్షణకాలం చూసింది. ఈ గూండాతో వాదించి లాభంలేదని ఆమె గ్రహించింది. మౌనంగా భర్త గదివైపు అడుగులు వేసింది. వెనకనే రాజన్, గోపీ వెళ్ళారు.

మెల్లిగా ఆమె తలుపును తట్టింది.

"ఎవరు?" అడిగాడు శోనాల్డు లోపలనుంచి.

"నేను, డార్లింగ్! నీకోసం యిద్దరు వ్యక్తులు వచ్చారు!" అందామె.

"వాళ్ళనిప్పుడు చూడలేను. 8-30కి రమ్మను" జవాబిచ్చాడతను.

పిస్టల్ కొనను రాజన్ ఆమె మెడమీద పెట్టాడు.

"వెంటనే తలుపు తీయమను!" అన్నాడు రాజన్.

ఆమె గాభరాగా తలుపును తట్టింది. తలుపు తెరిచి భార్య వెనక నిలబడిన వాళ్ళవైపు అతను చూశాడు. కోపంగా వాళ్ళవైపు వెళ్ళాడు.

"షాండి బయటకు! గెటవుట్!" అర్చాడు.

రాజన్ పిస్టల్ని అతడివైపు గురిపెట్టాడు. "మిస్టర్, చేతులెత్తి నిలబడు! పిచ్చివేషాలు వేస్తే బుర్ర పగుల్తుంది!"

అన్నాడు రాజన్.

చేతులెత్తి రోనాల్డు వాళ్ళవైపు చూసి నవ్వాడు.

"బ్రదర్స్, నేను విదేశీయుడిని. ప్రేమతో మీ దేశం వచ్చాను. ఇది గాంధీ పుట్టిన దేశం. ఇక్కడ ప్రశాంతంగా వుండొచ్చని కుటుంబంతో సహా వచ్చాను. ఈ దేశంలో దుష్టులు వుంటారని నేననుకోలేదు. ఇదొక గొప్ప దేశమని, స్వర్గంలా వుంటుందని వచ్చాను."

రోనాల్డు ఆగాడు. తన మాటల ప్రభావం ఎలా వుందో కనుక్కోవాలని వాళ్ళ మొహాలవైపు చూశాడు. మొద్దు మొహాలు!

"మిస్టర్ రోనాల్డు, నువ్వు వెళ్ళి ఆ గదిలో వుండు. నీ భార్యా, కూతురూ అక్కడే వున్నారు. నీకు యే ప్రమాదం రాదు" అన్నాడు రాజన్.

"ఎంతసేపు అలా వుండాలి?"

"అది మాకు తెలియదు. అదంతా మా బాస్ వచ్చి నీతో మాట్లాడతారు."

రోనాల్డు కాలగగ్ లోపలకు వెళ్ళాడు. రాజన్ గదిలోకి వెళ్ళి నలువైలా చూశాడు. టెలిఫోన్ లేదు. స్టీల్ రాక్స్‌లో పుస్తకాలున్నాయి. టేబుల్స్ కొన్ని కుర్చీలు వున్నాయి.

తల్లి పక్కనే టోనీ భయంతో నిలబడింది. "మమ్మీ ఎవరు వాళ్ళు?" అడిగింది.

"ఫ్రెండ్స్" అన్నాడు గోపీ.

రాజన్, గోపీ బయటకొచ్చారు. తలుపు మూసి, బయట తాళం వేశారు. హాల్లోకి వుషారుగా నడిచారు.

విశాలమైన హాలు.

"నువ్వు పైకివెళ్ళి చూసిరా! నేను కింద గదులను

చూస్తాను. వాళ్లు ముగ్గురూ తప్ప మరెవరూ యింట్లో వుండకూడదు" అన్నాడు రాజన్.

గోపీ మెట్లమ్మట పైకి పరుగెత్తాడు. రాజన్ తలిమ్మో గదులను చూస్తూ లోపలకు కదిలాడు.

కాస్సేపట్లో యిద్దరూ హాల్లోకి తిరిగి వచ్చారు.

"పై గదులు లాక్ చేయబడి వున్నాయి. వీళ్ళు కింద భాగంలో మాత్రం వుంటున్నారనుకుంటాను" అన్నాడు గోపీ.

రాజన్ మెల్లిగా ఫోన్ దగ్గరకు వెళ్లాడు. గ్లవ్స్ వేసుకుని రిసీవర్ ఎత్తి నంబరు తిప్పాడు. అటువైపు కంఠం వినపడగానే తన నంబరు చెప్పాడు.

"నేనే! అంతా ఎలా వుంది?"

"ఫైన్, బాస్."

"మీరు అక్కడే వుండండి. వాళ్ళు వచ్చాక నాకు ఫోన్ చేయండి."

"అలాగే."

రాజన్ రిసీవర్ని పెట్టేశాడు. నలువైపులా చూశాడు. టేబుల్ మీదున్న బాటిల్ని చూసి అటువైపు వెళ్లాడు. అమెరికన్ విస్కీ!

"లెటస్ డ్రింక్" అన్నాడు రాజన్.

# 7

వెంకన్నరాజా కూతురువైపు చూశాడు. "క్లబ్ కేనా?" అడిగాడు.

"అవును డాడీ" అందామె.

"డ్రయివర్ని తీసుకెళ్ళకూడదు?"

"వద్దు డాడీ! డ్రయివర్ కారును నడుపుతూంటే నాకు భయంగా ఉంటుంది. ఐ లైక్ టు గో ఎలోన్"

అందామె.

"పాపా, యెనిమిది లోపల వచ్చేయి. నువ్వు వస్తే గాని నేను భోజనం చెయ్యను" అన్నాడతను.

ఆమె తండ్రివైపు చూసింది.

"డాడీ, నాకోసం యెదురు చూస్తూ మీరు కూర్చోవద్దు. మీకు ఆకలివేసినప్పుడు భోజనం చేయండి" అందామె.

"నువ్వు నా ప్రక్కనుంటేగాని నాకు ఆకలివేయదు."

ఆమె తండ్రిని బుగ్గమీద ముద్దెట్టుకుంది. "యెనిమిది లోపల వస్తాను, డాడీ" అందామె.

వెంకన్నరాజా టైమ్ చూశాడు. సరిగ్గా ఆరయింది. వరండామీద నిలబడి టొయోటో కారులో వెళుతున్న కూతుర్కి అతడు బై బై చెప్పాడు.

హుషారుగా ఆమె కారును పోనిస్తోంది. చల్లగాలి వీస్తోంది. ఇంకా చీకటి పడలేదు. కాని షాపులోని లైట్లు వెలుగుతున్నాయి.

డెవిల్స్ స్ట్రీటమ్మట కారు వెళ్తోంది. జనసంచారంలేని స్ట్రీట్!

రోడ్డు వారగా కుంటుతూ నడుస్తూన్న యువతిమీదకు ఆమె చూపు వెళ్ళింది. కుంటుతూ ఆమె యెక్కడకు వెళ్తోందో!

కుంటుతూ నడుస్తూన్న యువతి కారువైపు చూసింది. ఆపమని సౌజ్ఞ చేసింది. ఆమె వెంటనే కారు ఆపింది.

"ఎక్కడికి కెళ్ళాలి?" అడిగిందామె.

"వచ్చే టర్నింగ్‌లో నన్ను దింపేయండి" అంది మేనక.

"గటిన్" అంది ప్రమీల.

ముందు సీటుమీద కూర్చుని మేనక తలుపు మూసింది.

"ఐ యామ్ లక్ష్మీ! అమ్మకు ఒంట్లో బాగాలేదు. డాక్టర్ కోసం వెళుతున్నాను" అంది మేనక.

"డాక్టర్ యింటి దగ్గర నిన్ను దింపుతాను" అంది ప్రమీల.

"అంత శ్రమ మీకెందుకు? పై టర్నింగులో దింపేయండి. నేను నడిచి వెళ్తాను."

"నీ యిష్టం" అంది ప్రమీల.

కారు వేగంగా వెళ్తోంది. తటాలున మేనక పిస్టల్ని పైకితీసింది. ప్రమీల వైపు గురి పెట్టింది.

"మిస్ ప్రమీలా, నేను చెప్పినట్టు కారును పోనీ! లేకపోతే నీ తల పగిలి ముక్కలవుతుంది" అరిచిందామె.

తన వైపు గురిపెట్టబడిన పిస్టల్ వంక ప్రమీల భయంతో చూసింది.

"నీకేం కావాలి? డబ్బా?" అడిగింది ప్రమీల.

"మాట్లాడకు! కారును బరోస్ రోడ్డువైపు పోనీ!" అంది మేనక.

కాస్సేపట్లో కారు బరోస్ రోడ్డమ్మట వెళ్తోంది.

"ఇంకా ఎంత దూరం వెళ్ళాలి?"అడిగింది ప్రమీల.

"షటప్ అండ్ కీప్ మూవింగ్" అరిచింది మేనక.

ధనవంతులంటే మేనక్కి పరమ అసహ్యం. ముందున్న ఫియట్ కారును చూసి, మేనక "స్టాప్!" అంది.

కారు ఆగింది.

"క్రిందకు దిగు!" అంది మేనక.

ప్రమీల దిగింది. వెనకనే దిగింది మేనక "వెళ్ళి ఆ కార్లో కూర్చో" అంది మేనక.

ప్రమీల మాట్లాడకుండా ఫియట్ కారులో వెనక

సీట్ మీద కూర్చుంది. ఆమె పక్కనే మేనక చతికిల బడింది. రాయుడు, గజేంద్రన్ ముందు సీట్లో వున్నారు.

మస్తాన్ కారు బయటనుంచి ప్రమీలవంక చూశాడు.

"నీ కార్ కీ!" అన్నాడు మస్తాన్.

"ఎందుకు?" అంది ప్రమీల.

"ప్రశ్నలు అడక్కు! చెప్పింది చెయ్యి!" అర్చింది మేనక.

మారుమాట్లాడకుండా ప్రమీల కారు కీని మస్తాన్‌కి యిచ్చింది. సమీపంలో వున్న టొయోటా కారువైపు మస్తాన్ వెళ్ళాడు.

రాయుడు ఫియట్ పోనిచ్చాడు.

"నన్ను ఎక్కడకు తీసుకెళ్తున్నారు?" అడిగింది ప్రమీల.

"కాస్సేపట్లో నీకు తెలుస్తుంది" అంది మేనక.

"ఎనిమిది లోపల నేను యింటికి వెళ్ళాలి. నేను యింటికి వెళ్తేగాని డాడీ భోజనం చేయడు. మీకు డబ్బు కావలిస్తే చెప్పండి! నాన్నకు ఫోన్ చేసి యివ్వమంటాను" అందామె.

"మాకేం కావాలో త్వరలో నీకు తెలుస్తుంది" అంది మేనక.

"మీరు ఎంత అడిగినా నాన్న యిస్తాడు. నన్ను మీరు వదిలేయొచ్చు" అందామె.

"నోరు మూసుకుని కూర్చో! వసపిట్టలా వాగకు!" అర్చింది మేనక.

గేటుదాటి 30 నంబర్ కాంపౌండులోకి ఫియట్ కారు దూసుకుపోయింది. ఇంటిముందు కారు ఆగింది.

రాజన్, గోపీ కారువైపు పరుగెత్తుకొచ్చారు.

గజేంద్రన్ కిందకు దూకాడు.

"మిస్ ప్రమీలా, కిందకు దిగు! మేం చెప్పినట్లు చేస్తే నీకు ఏ ఆపదా రాదు" అన్నాడతను గంభీరంగా.

# 8

అతడు గదిలో పచార్లు చేస్తున్నాడు. అప్పుడప్పుడు టైము చూస్తున్నాడు.

రీటా పొడుగాటి సోఫాలో వెల్లకిలా పడుకుంది. టీపాయిమీదున్న గ్లాసులోని స్కాచ్ విస్కీని పూర్తిగా తాగేసి అతడామె పక్కనే కూర్చున్నాడు.

ఎర్రటి ఆమె పెదిమలను ఆత్రంగా ముద్దెట్టుకున్నాడు.

టెలిఫోన్ మ్రోగింది. వెళ్ళి అతడు రిసీవర్ని అందుకున్నాడు.

"హలో!" అన్నాడు.

"నంబర్ 1 రిపోర్టింగ్, బాస్."

"ఎలా వుంది?"

"మేం అందరం 30లో వున్నాం."

"ఫైన్! నేను అరగంటలో వస్తున్నాను."

అతడు రిసీవర్ని పెట్టేశాడు. సోఫాలో పడుకున్న రీటా లేచింది. ఆమెను ఆప్యాయంగా కౌగలించుకున్నాడు.

"రీటా, నేను అలా వెళ్ళివస్తాను. నువ్వు యిక్కడే వుండు" అన్నాడతను.

"అలాగే" అందామె.

అతడు బయటకు వేగంగా నడిచాడు. అంబాసిడర్ కారులో ఎక్కాడు. సిగరెట్ వెలిగించి, పొగ పీల్చి వదుల్తూ కారును గేటువైపు పోనిచ్చాడు.

మద్రాసో రోడ్డువారగా వున్న ఒక టెలిఫోన్ బూత్

పక్కన కారాపి దిగాడు. ఇటూ, అటూ చూశాడు. సమీపంలో ఎవ్వరూ లేరు. అతడు లోపలకు వెళ్ళి గ్లాస్ డోర్ మూశాడు.

రిసీవర్ చేతిలోకి తీసుకుని ఒక నంబరు తిప్పాడు. అరరూపాయి కాసు చిల్లులో పడేశాడు.

"హలో, వెంకన్నరాజాగారి భవనం" అందో స్త్రీ కంఠం.

"ఆయనతో మాట్లాడాలి."

"మీ పేరు?"

"నేనెవరో ఆయనకు తెలియదు కాని ముఖ్యమైన విషయంమీద మాట్లాడాలి."

"ఆయనతో చెప్తాను. తర్వాత మళ్ళా ఫోన్ చేయండి."

"మళ్ళా ఫోన్ చేయను. నాతో యిప్పుడు మాట్లాడి తీరాలి! లేకపోతే నీ ఉద్యోగం వూడుతుంది."

"వుండండి, కనెక్షన్ యిస్తాను."

కాస్సేపట్లో కనెక్షన్ వచ్చింది.

"వెంకన్నరాజా స్పీకింగ్!"

"మిస్టర్ రాజా, నీ కూతురు మా దగ్గర క్షేమంగా వుంది. ఆమె గురించి బెంగపెట్టుకోవద్దు. ఆమె గురించి డిటెక్టివ్‌లతో, పోలీసులతో మాట్లాడకు! అటువంటి దేదైనా నువ్వుచేస్తే ఆమెను నరికి ఆ ముక్కల్ని నీకు పంపిస్తాం" అన్నాడతను.

"నేనెవరికీ చెప్పను. నా కూతుర్ని జాగ్రత్తగా చూడండి. మీకు యెంత కావాలి, దాన్ని వదిలిపెట్ట డానికి?"

పని తొందరగా ముగిసేటట్టువుంది అనుకున్నాడు

బాస్. డబ్బు పెంచడం మంచిది!

"కోటి రూపాయలు!"

"ఎలా యివ్వాలి?"

"తర్వాత ఫోన్ చేసి చెప్తాను" అని అతడా రిసీవర్ని పెట్టేశాడు.

బూత్‌లోంచి బయటకొచ్చి కారెక్కాడు. టైము చూశాడు. ఏడు అయింది. పనులు చాలా వేగంగా సాగి పోతున్నాయి. వెంకన్నరాజా ఎంతైనా యివ్వడానికి రెడీగా వున్నాడు.

అతడు కారును పోనిచ్చాడు. పదినిమిషాల్లో కారు కాలగన్ యింటిముందు ఆగింది.

గజేంద్రన్ కారు దగ్గరకు వచ్చాడు.

"కాలగన్, భార్య, కూతురు ఒక గదిలో వున్నారు. ప్రమీలను మరో గదిలో వుంచాం. మేనక అక్కడ కాపలా వుంది. రాజన్, గోపీ కాంపౌండులో గస్తీ తిరుగుతున్నారు. రాయుడు లోపలున్నాడు" అన్నాడు గజేంద్రన్.

"ఫైన్! కోనాల్దు కాలగన్‌తో రహస్యంగా మాట్లాడాలి" అన్నాడు బాస్.

"హాల్లో మీరు మాట్లాడొచ్చు. అతడిని అక్కడకు తీసుకువస్తాం."

"ఫైన్" అన్నాడు బాస్.

# 9

విశాలమైన హాల్లో యిరవై సోఫాలున్నాయి. గోడలకు చక్కటి ఆయిల్ పెయింటింగ్స్ అమర్చబడ్డాయి. ఫ్లోరసెంట్ ట్యూబులు వెలుగుతున్నాయి.

వెంకన్నరాజా ఎదురుగా వాలి, గిరి సోఫాలో

కూర్చున్నారు.

విచారవదనంతో వున్నాడు రాజా.

"రాజా భాయ్, ఈ మాత్రానికే అంతలా అయిపోవాలా? నువ్వు భయపడకు! అంతా వివరంగా చెప్పు!" అన్నాడు వాలి.

"మీరు నాకు హామీ యివ్వాలి, నా కూతురు ఇంటికి తిరిగివచ్చినదాకా ఏమీ చెయ్యనని" అన్నాడతను.

"అమ్మాయికి ప్రమాదం రాకుండా చూస్తాను" అన్నాడు వాలి.

"ఆమె వాళ్ళచేతుల్లో వుంది. వాళ్ళు ఏం చేస్తారో ఎవరకి తెలుసు?"

"నాకు తెలుసు! డబ్బుకోసం వాళ్ళు నీ కూతుర్ని ఎత్తుకుపోయారు. ఆమెను జాగ్రత్తగా చూస్తారు. ఆమెకేదయినా ప్రమాదం వస్తే నువ్వు తెగించి వాళ్ళ రక్తం కోసం వేటాడతానని వాళ్ళకు తెలుసు" అన్నాడు వాలి.

"సరిగ్గా ఆరింటికి అమ్మాయి ప్రమీల క్లబ్ కు తన టొయోటో కారులో వెళ్ళింది. తర్వాత అతడు ఫోన్ చేశాడు. ఆమెను వదిలిపెట్టడానికి కోటి రూపాయలు కావాలన్నాడు. డబ్బు ఎలా యివ్వవలసిందీ మళ్ళా ఫోన్ చేసి చెప్తానన్నాడు."

చుట్ట పొగ వదుల్తూ వాలి ఆలోచిస్తున్నాడు.

"ఈ విషయం మరెవరికి తెలుసు?"

"నాకు తప్ప మరెవ్వరికీ తెలియదు. నా సెక్రెటరీ నాన్సీకి నేనింకా చెప్పలేదు."

"ఎవ్వరికీ చెప్పకు!" అన్నాడు వాలి.

"టొయోటో కారు నంబరెంత?"

వెంకన్నరాజా చెప్పాడు. గిరి నంబర్ని రాసు

కున్నాడు. ప్రమీల ఫోటోను అతడు వాలికిచ్చాడు.

వాలి ఫోటోను పరీక్షగా చూసి పక్కనున్నన్న గిరికి యిచ్చాడు.

"రాజాభాయ్, నేను నా హోటల్ కి వెళ్ళి ఇక్కడకు పదేపదే వస్తూంటే వాళ్ళు గమనించవచ్చు. అందువలన నేనిక్కడే వుంటాను. ఇక్కడుండి చేయవలసింది చేస్తాను."

"వాలిగారూ, అమ్మాయి ఇంటికొచ్చిందాకా మీరు ఏమీ చేయొద్దు. వాళ్ళను గురించి మీకు ప్రమీల వివరంగా చెప్తుంది. అటుపైన మీరు వాళ్ళను పట్టుకోడానికి ప్రయత్నించండి."

"చూద్దాం" అన్నాడు వాలి క్లుప్తంగా.

వెంకన్నా రాజా స్వయంగా వాలినీ, గిరినీ కింద భాగంలో వున్న గెస్టు రూమ్‌లోకి తీసుకువెళ్ళాడు.

విశాలమైన పడగ్గది. యటాచడ్ బాత్‌రూమ్ వుంది.

"వాలిగారూ, మీకు ఏం కావలసినా బజర్ నొక్కండి. నాయర్ కుర్రాడు వస్తాడు. అతడు అంతా చూస్తాడు" అన్నాడతను.

"గుడ్" అన్నాడు వాలి.

వెంకన్నరాజా వెళ్ళిపోయాడు. పడక కుర్చీలో వాలి కూర్చున్నాడు. గిరివైపు సూటిగా చూశాడు.

"గిరీ, అమ్మాయి వెళ్ళిన కారు ఏమైంది? కారును అనేకమంది చూస్తారు. వాళ్ళు ఆమెను మరో కారులో తీసుకుపోయి వుండొచ్చు. నువ్వు వెంటనే వెళ్ళు. అమ్మాయి కారు కోసం వెతుకు!"

"ఎక్కడ వెతకను?"

"పట్నమంతా గాలించు! ఎక్కడో ఆ కారును

వదిలేసివుంటారు. యిన్‌స్పెక్టర్ నాయర్ని కల్సుకో!
ప్రమీలను ఎత్తుకుపోయిన విషయం చెప్పకుండా నువ్వు
వ్యవహరించాలి."

"అలాగే సార్."

"ఏదేనా తెలిస్తే వెంటనే ఫోన్‌చేసి నాకు చెప్పు!"
అన్నాడు వాలి.

గిరి కదలబోయాడు.

"మన కారులో వెళ్ళొద్దు. రాజా దగ్గర చాలా కార్లు
వున్నాయి. ఏదో కారు తీసుకో" అన్నాడు వాలి.

## 10

బాస్ హాల్లో సోఫాలో కూర్చున్నాడు. కాస్సేపట్లో
కోనాల్డు కాలగన్ అతడి ముందుకు వచ్చాడు.

"కూర్చోండి, మిస్టర్ కోనాల్డు" అన్నాడు బాస్.

కోనాల్డు సోఫాలో కూర్చున్నాడు. అతడిని తీసు
కొచ్చిన గజేంద్రన్ వెళ్ళిపోయాడు.

"మిస్టర్, ఏమిటిదంతా?" అడిగాడు కాలగన్.

బాస్ అతడివైపు సూటిగా చూశాడు.

"మీరు భయపడవలసిన అవసరంలేదు. మీరు మాకు
చిన్న సహాయం చెయ్యాలి. అటుపైన మేం వెళ్ళిపోతాం.
మీరు మీ రాతపని చూసుకోవచ్చు!"

"ఏమిటది?"

"ఒకమ్మాయిని ఎత్తుకొచ్చి, యిక్కడ వుంచాం.
ఆమె తండ్రి కోటీశ్వరుడు. అతడు డబ్బు యివ్వడానికి
సిద్ధంగా వున్నాడు. మీరు వెళ్ళి ఆ డబ్బు తెచ్చి నాకు
అందజేయాలి."

"నేను క్రిమినల్‌ని కాను!" అర్చాడు కాలగన్.

"నేను చెప్పిన పని చేయడానికి మీరు క్రిమినల్ అవ

నక్కరలేదు. తను దొంగిలించిన డబ్బును ఒక దొంగ పొరుగూరులో వున్న భార్యకు మనియార్డరు చేస్తాడు. పోస్టుమన్ ఆ డబ్బును యింటికి తీసుకెళ్ళి అందజేస్తాడు. మీరు చేయవలసింది పోస్టుమన్ పని."

"అది నేను చేయకపోతే?"

బాస్ మెల్లిగా నవ్వాడు.

"అమెరికా వదిలి మీరు చాలా దూరం వచ్చారు. భార్యా, కూతురూ మీతో వచ్చారు. క్షేమంగా తిరిగి అమెరికాకు వెళ్ళాలని మీరు ఆశిస్తున్నారుగా?"

"అఫ్‌కోర్స్!"

"నేను చెప్పింది చెయ్యకపోతే అది జరగదు. నా మనుషులు చాలా చెడ్డవాళ్ళు. మీ భార్యనూ, కూతుర్నీ కూడా రేప్ చేసి, చిత్రవధ చేస్తారు!"

కోనాల్డు కాలగన్ కొంతసేపు నిశ్శబ్దంగా వుండిపోయాడు. కోపంతో లేచాడు.

"నేనొక డర్టీ కంట్రీకి వచ్చాను!"

"మిస్టర్ కోనాల్డు, మా దేశం డర్టీ కంట్రీ కాదు. మీ దేశంలో కూడా నాలాంటి నేరస్థులు వున్నారు. అన్ని దేశాల్లోనూ వుంటారు!"

"నేను డబ్బు తెచ్చి మీకిస్తే పోలీసులు తర్వాత నన్ను అరస్టు చేస్తారు."

"ఈ విషయం పోలీసులదాకా వెళ్ళదు. ఒకవేళ మీరు భయపడేటట్లు జరిగితే బలాత్కారంగా ఆ పని మేం మీ చేత చేయించామని వాళ్ళకు చెప్పొచ్చు. మిమ్మల్ని వదిలేస్తారు!"

కోనాల్డు కాస్సేపు ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"ఆ డబ్బు ఎలా తీసుకురావాలో చెప్పండి."

"అది తర్వాత చెప్తాను. మీరు ఒప్పుకున్నట్లేగా?"

"యస్" అన్నాడు శాలగన్.

బాస్ విజిల్ వేశాడు. గజేంద్రన్ వేగంగా వచ్చాడు.

"అయన్ని గదిలోకి తీసుకుపో! ఆయనకూ, కుటుంబ సభ్యులకూ ఏ లోటూ రాకుండా చూడండి" అన్నాడు బాస్.

సోఫాలోంచి లేచాడు బాస్. గజేంద్రన్ వైపు సూటిగా చూశాడు.

"పదినిమిషాల్లో తిరిగొస్తాను" అని అతడు గబగబా బయటకు వెళ్ళిపోయాడు.

రోడ్డు లైట్లు వెలుగుతున్నాయి. కారును ఆపి అతడు దిగాడు. టెలిఫోన్ బూత్‌లోకి దూరి తలుపు మూశాడు. రిసీవర్ తీసి నంబరు తిప్పాడు. క్షణంలో వెంకన్నరాజా కంఠం వినపడింది. అతడు ఫోన్ దగ్గరే కూర్చున్నట్లు వున్నాడు!

"వెంకన్నరాజా స్పీకింగ్ !"

"డబ్బు ఎప్పుడు ఇవ్వగలవు?"

"ఏ క్షణంలోనయినా యిస్తాను. పాక్ చేసి వుంది. పాకెట్ బరువుగా వుంటుంది."

"మిస్టర్ రాజా రెడీగా వుంచినందుకు సంతోషం. రాత్రి పన్నెండింటికి వాలస్ రోడ్డు పోస్టు బాక్స్ దగ్గర నిలబడు. ఒక అమెరికన్ అక్కడకు కార్లో వస్తాడు. డబ్బు అతడికిచ్చి నీ యింటికి వెళ్ళిపోయి విశ్రాంతిగా కూర్చో! నాలుగు లోపల నీ కూతురు నీ ఇంటికి వస్తుంది."

"అలాగే చేస్తాను."

"మరోసారి హెచ్చరిస్తున్నాను. ఆ అమెరికన్ని ఎవరేనా వెంటాడితే నీ కూతురు నీకు దక్కదు."

"అటువంటి పనులేవీ చెయ్యను. నా కూతురు నాకు ముఖ్యం. డబ్బు మళ్ళా గడించగలను."

"ఫైన్, గెట్ రెడీ" అని అతడు రిసీవర్ని పెట్టేశాడు.

కారులో కూర్చుని తలుపు మూశాడు. కారును వేగంగా రోనాల్డు కాలగన్ ఇంటివైపు పోనిచ్చాడు.

కాలగన్ వైపు అతడు సూటిగా చూశాడు. "మిస్టర్ రోనాల్డు మీరు చేయవలసింది చెప్తాను. జాగ్రత్తగా వినండి!"

"ప్రొసీడ్!"

"సరిగ్గా పన్నెండింటికి వాలెస్ రోడ్డువైపు కారులో వెళ్ళండి. రోడ్డువారగా పోస్టు బాక్సు వుంటుంది. అక్కడ ఒకతను నిలబడివుంటాడు. అతడు మీకు పెద్ద పాకెట్ ఇస్తాడు. అది కారులో పెట్టుకుని వెంటనే హోటల్ పైలట్ కి రండి. రూం నంబరు 60కి వెళ్ళండి. అక్కడ మీకోసం మా మనిషి రెడీగా వుంటాడు. పాకెట్ అతడికి అందజేసి వచ్చేయండి. మీరు వచ్చేసరికి యీ ఇంట్లో మీ భార్యా, కూతురూ మాత్రం వుంటారు. అటుపైన మీ జీవితం మీది!" అన్నాడు బాస్.

"ఓ.కె. అలాగే చేస్తాను."

"మిస్టర్ రోనాల్డు, బయటకు వెళ్ళి మా గురించి ఎవరికేనా ఏదేనా చెప్తే మీ భార్యా, కూతురూ ఇక్కడ చిత్రవధ చేయబడ్తారు."

"అటువంటిదేదీ చెయ్యను" అన్నాడు రోనాల్డు.

బాస్ సోఫాలోంచి లేచి బయటకు నడిచాడు. గజేంద్రన్ కారు పక్కనే నిలబడ్డాడు.

"గజేంద్రన్, నేను హోటల్ పైలట్ నుంచి ఫోన్

చేసి నీతో చెప్తాను. మీరు వెంటనే యీ యిల్లు వదిలి వెళ్ళిపోండి."

"ప్రమీలను ఏం చెయ్యడం?"

"శోనాల్డు కాలగన్ చాలా మంచి మనిషి. అత డామెను కారులో తీసుకెళ్ళి ఇంటిదగ్గర వదిలేస్తాడు" అన్నాడు బాస్.

"ఫైన్" అన్నాడు గజేంద్రన్.

బాసు తన కారును బయటకు పోనిచ్చాడు.

## 11

టెలిఫోన్‌లో మాట్లాడి రిసీవర్ పెట్టేశాక వెంకన్న రాజా మొహం ఆనందంతో మెరిసింది.

"రాజా భాయ్, ఎలా ఇవ్వాలి డబ్బు?" అడిగాడు వాలి.

"అదంతా మీకు ప్రస్తుతం చెప్పను. క్షమించండి!" అన్నాడు రాజా.

"నేను ఏ విధంగానూ మీ అమ్మాయికి ప్రమాదం రానివ్వనని హామీ ఇస్తున్నాను. అంతా నాతో చెప్పు!" అన్నాడు వాలి.

"సరిగ్గా పన్నెండింటికి నేను వాలెస్ రోడ్డులోవున్న పోస్టు బాక్స్ దగ్గర నిలబడాలి. ఒక అమెరికన్ కారులో అక్కడికొస్తాడు. అతడికి పాకెట్ ఇచ్చి యింటికి వచ్చేస్తాను. నాలుగింటి లోపల అమ్మాయి ఇంటికి వచ్చేస్తుంది."

"గుడ్! డబ్బు పోయినా క్షేమంగా అమ్మాయి ఇక్కడకు తిరిగి వస్తుంది. సంతోషం" అన్నాడు వాలి.

వెంకన్నరాజా చేతికున్న వాచ్ వైపు వాలి విచిత్రంగా చూశాడు.

"ఆ వాచ్ చాలా బాగుంది. ఎక్కడ కొన్నావు" ప్రశ్నించాడు వాలి.

అతడు వాచ్‌ని తీసి వాలి చేతిలో పెట్టాడు.

"అమెరికాలో కొన్నాను. చూడండి!" అన్నా

టెలిఫోన్ మ్రోగింది. వెంకన్నరాజా ఫోను దగ్గ వెళ్ళాడు.

"మీకు!" అన్నాడు వాలివైపు చూస్తూ.

వాచ్‌ని అతడికిచ్చేసి వాలి రిసీవర్ అందుకున్నా

"హలో, వాలి హియర్."

"గిరిని సార్."

"ఏదైనా తెలిసిందా?"

"ప్రమీల వెళ్ళిన టొయోటో కారు దొరికి ఎవరో దాన్ని మహాబలిపురంలో వదిలేశారు. నలు స్టూడెంట్లు ఆ కారును ఇక్కడ వదిలిపోతుంటే వాళ్ పట్టుకున్నాను. వాళ్ళ ఐడెంటీ కార్డులు చూసి లేశాను."

"గిరి, నువ్వు వెంటనే ఇక్కడకు రా! పదినిమిష రావాలి" అన్నాడు వాలి."

"వస్తున్నా" అన్నాడు గిరి.

## 12

రోడ్డు లైట్లు వెలుగుతున్నాయి. వాలెస్ వారగా వున్న పోస్టు బాక్స్ ముందు వెంకన్న నిలబడ్డాడు.

తన వాచ్ చూశాడు. పన్నెండు కావస్తోంది. గుండె వేగంగా కొట్టుకుంటోంది.

జన సంచారం లేదు. రాజా ఇటూ, అటూ న్నాడు.

కారు హెడ్‌లైట్ల కాంతి అతడిమీద పడింది. క్షణాల్లో కారొచ్చి అతడి పక్కనే ఆగింది.

డ్రయివర్ కిటికీలోంచి బయటకు చూసి కిందకు దిగాడు. అతడివైపు రాజా పరీక్షగా చూశాడు. వైట్ మేన్! అమెరికన్ కావచ్చు!

"ఇదో పాకెట్!" అన్నాడు రాజా.

బరువైన పాకెట్‌ను అతడు కారు వెనుక సీటుమీద పడేసి తలుపు మూశాడు. వేగంగా వెళ్ళి కారులో కూర్చున్నాడు. కారు దూసుకుపోయింది.

సమీపంలో వున్న తన కారువైపు నడిచాడు వెంకన్నరాజా.

దూసుకుపోయిన కారు టర్నింగులో ఆగింది....ఒక వ్యక్తి చటుక్కున కారులో రెక్కాడు. "అంతా సవ్యంగా జరిగింది. పాకెట్ వెనుక సీటుమీద వుంది" అన్నాడు డ్రయివ్ చేసే వ్యక్తి.

"ఫైన్!" అన్నాడు కారులో ఎక్కినతను.

* * *

వుషారుగా వెంకన్నరాజా హాల్లోకి వచ్చాడు. వాలి సోఫాలోంచి లేచి నిలబడ్డాడు.

"చూశారా వాలిగారూ! సరిగ్గా పన్నెండింటికి డబ్బు చెల్లించి పదిహేను నిమిషాల్లో ఇంటికి చేరు కున్నాను. ఇటుపైన నా కూతురు రాకకోసం ఎదురు చూస్తూ కూర్చోవచ్చు" అన్నాడతను.

"గుడ్, నువ్వు వచ్చాక అలా వెళ్లాలని నేను చూస్తున్నాను" అన్నాడు వాలి.

"ఇటుపైన మీరు ఏంచేసినా నాకు బెంగలేదు. నా పని వాళ్ళతో చెప్పినట్లు చేశాను."

"రాజా భాయ్, నువ్వు కూర్చో! నేనలా వెళ్ళి వస్తాను" అని వాలి బయటకు నడిచాడు.

ఫియట్ కారును వాలి వేగంగా పోనిచ్చాడు. వాలెస్ రోడ్డు సమీపంలో మరో కారు పక్కనే వాలి కారు ఆపాడు. ఒక పెద్ద పాకెట్‌ను తెచ్చి గిరి ఫియట్ కారులో పెట్టాడు. గిరి కారులో కూర్చుని తలుపు మూశాడు. వాలి కారును పోనిచ్చాడు.

వాలెస్ రోడ్డు పోస్టు బాక్సుముందు వాలి దిగాడు. పాకెట్ తన పక్కనే వుంచుకున్నాడు. "గిరీ, కొంచెం ముందుకుపోయి కారాపు. ఆ కారు ఇక్కడికొచ్చి వెళ్ళిపోగానే కారులో రా!" అన్నాడు వాలి.

గిరి కారును వెనక్కు తిప్పి పోనిచ్చాడు.

వాలి వాచ్ చూశాడు. నల్లటి కళ్ళద్దాలను పెట్టుకున్నాడు. నోట్లో చుట్ట లేదు! వాలి రూపం కొంతవరకూ మారింది.

రోడ్డమ్మట ఏదో కారు వస్తోంది. కారు అతడి పక్కనే ఆగింది.

కారులోని వ్యక్తి కిందకు దిగలేదు.

"యూ దేర్, ఎనీ పాకెట్ ఫర్ మి?" అని అడిగాడు.

కొంచెం ముందుకు వెళ్ళి అతడి వంక చూశాడు. లోపల లైట్ వెలిగి ఆరిపోయింది. అమెరికన్!

పాకెట్‌ను వాలి కారులో పడేశాడు. తలుపు మూశాడు.

"యు కన్ గో" అన్నాడు వాలి.

కారు వెళ్ళిపోయింది. కారు వెనుక లైట్లు కనిపిస్తున్నాయి.

సడన్ బ్రేక్‌తో ఫియట్ కారు పక్కనే ఆగింది. వాలి తొందరగా కారులో కూర్చుని తలుపు మూశాడు.

కారు ముందుకు దూసుకుపోయింది.

"గిరీ, ఫాలో దట్ కార్! మరీ దగ్గరగా వెళ్ళకు!" అన్నాడు వాలి.

* * *

హోటల్ పైలట్ కాంపౌండులో ఆ కారు ఆగింది. కొంచెం దూరంలో గిరి ఫియట్ కారును ఆపాడు.

"గిరీ, నువ్వు అతడిని వెంటాడు! నేను కొంచెం దూరంలో నేను వస్తాను" అన్నాడు వాలి.

గిరి హోటల్ వైపు వెళ్ళాడు. కొంచెం దూరంలో వాలి అతడి వెనకనే వెళ్లాడు. పాకెట్ పట్టుకుని అమెరికన్ మేడమెట్లు ఎక్కుతున్నాడు. గిరి అతడిని వెంబడించాడు. హాల్లో నిలబడి నలువైపులా చూసి వాలి మెల్లెక్కాడు.

అమెరికన్ నడవమ్మట నడుస్తున్నాడు. టర్నింగులో గోడవారగా నిలబడి గిరి అతడిని గమనిస్తున్నాడు.

తలుపు తట్టి అమెరికన్ ఒక గదిలోకి వెళ్ళాడు— అప్పటికప్పుడే వాలి అతడి దగ్గరకు వచ్చాడు.

"ఎటు వెళ్లాడు?"

"ఆ గదిలోకి!" అని గిరి నడవమ్మట వేగంగా వెళ్లాడు.

అతడి వెనకనే పెద్ద అంగల్లో నడిచాడు వాలి.

"ఇదే గది!"

గది నంబర్ని చూశాడు వాలి. రూమ్ నంబర్ 60!

"లోపలకు వెళ్దామా?" అడిగాడు గిరి.

"వెళ్ళక తప్పదు" అన్నాడు వాలి.

"లోపల ఎక్కువమంది వున్నారేమో!"

"నీ దగ్గర పిస్టల్ వుందా?" అడిగాడు వాలి.

"వుంది" అన్నాడు గిరి.

వాలి తలుపును తట్టాడు. ఎవ్వరూ తెరవలేదు. మళ్ళీ తట్టాడు.

తటాలున తలుపు తెరవబడింది. వాలి, గిరి అమాంతంగా లోపలకు దూరారు.

బాస్ చేతిలో పిస్టల్ వుంది. గిరి చేతిలో పిస్టల్ వుంది.

"చేతులెత్తండి! ముందుకొస్తే కాల్చేస్తాను!" అరిచాడు బాస్.

"నువ్వు చేతులెత్తు!" అరిచాడు గిరి.

గిరి పిస్టల్ చూసి అమెరికన్ గాభరాగా బాస్ పక్కకు జరిగాడు.

"డోంట్ వర్రీ!" అన్నాడు బాస్.

బాస్ ఎదురుగా వున్న వాలి గిరివైపు చూశాడు. వాళ్ళను గుర్తించగానే అతడి గుండె దడదడ కొట్టుకుంది.

"మీకేం కావాలి? ఈ గదిలోంచి వెళ్ళండి!" అరిచాడు బాస్.

"మిష్టర్, మేం కస్టమ్స్ ఆఫీసర్స్! ఆ పాకెట్‌లో ఏముందో చూడాలి! ఈ అమెరికన్ ఏదో మన దేశంలోకి స్మగుల్ చేస్తున్నాడు" అన్నాడు వాలి.

బాస్ పక్కనున్న అమెరికన్ వైపు తిరిగాడు. ఆ క్షణంలో వాలి చిరుతపులిలా ముందుకు దూకి చేతిలో పిస్టల్ని పైకి ఎగరగొట్టాడు.

బాస్ వెనక్కి జరగబోయాడు. కాని వాలి అతడిని

బలంగా పట్టుకున్నాడు.

అతడివైపు వాలి కోపంగా చూశాడు.

"బాస్టర్డ్, ప్రమీల ఎక్కడ?" గర్జించాడు వాలి.

అతడు మాట్లాడలేదు. అతడి చంపలు డప్పుల్లా మోగాయి.

"రాస్కెల్ చెప్పు!"

"నాకు తెలియదు."

అతడి చేతుల్ని వెనక్కి లాగి పట్టుకుని కుడిచేత్తో మూతిమీద కొట్టాడు వాలి. అతడు బాధతో అర్చాడు. నోట్లోంచి రక్తం కారింది.

"చెప్పకపోతే తోలు వల్చేస్తాను" అర్చాడు వాలి.

"నన్ను మీరు ఏం చేసినా లాభంలేదు. ఇప్పుడు 12-30 అయింది. ఒంటిగంట లోపల నేను తిరిగిరాక పోతే మా వాళ్ళు ప్రమీలను నరికి చంపేస్తారు" అన్నాడతను.

"గిరీ, షూట్ హిమ్" అన్నాడు వాలి.

పిస్టల్ కొనను అతడి నుదురుమీద గిరి అదిమి పెట్టాడు. ట్రిగ్గర్ వైపు అతడి వేళ్ళు కదిలాయి.

"నన్ను చంపకండి! చెప్తాను" అన్నాడతను.

"ప్రమీల ఎక్కడుందో చెప్పు!"

"ఇతని పేరు గోనాల్డు కాలగన్. ప్రమీల యితని ఇంట్లో వుంది."

"ఇతనితో నాకు సంబంధంలేదు. నా ఇంట్లో ఇతడి మనుషులు జొరబడి, నన్నూ, నా భార్యా పిల్లనీ ఒక గదిలో బంధించారు. నా భార్యనీ, కూతుర్నీ చంపు తానని బెదిరించి నన్నీ పాకెట్ మోసుకొచ్చి తనకిక్కడ

ఇమ్మన్నాడతను" అన్నాడు రోనాల్డు.

"రోనాల్డు ఇంట్లో నీ మనుషులు ఎందరు ఉన్నారు?"

"ఐదుగురున్నారు."

అతడిని వాలి ఫోన్ దగ్గరకు తీసుకెళ్ళాడు. రోనాల్డు తన ఇంటి నంబరు కావాలని హోటల్ ఆపరేటర్ కి చెప్పాడు.

"డబ్బు ముట్టిందని చెప్పు! వాళ్ళను వెంటనే వెళ్ళి పోమను! ప్రమీలను అక్కడే వుండమను" అన్నాడు వాలి.

కనెక్షన్ వచ్చింది. రోనాల్డు రిసీవర్ని అతడి చెవి దగ్గర పెట్టి పట్టుకున్నాడు.

"హాలో, నేను! డబ్బు ముట్టింది. మీరు వెంటనే వెళ్ళిపొండి! ప్రమీలను అక్కడే వుండమను" అన్నాడతను.

"గుడ్ బాస్, వెళ్ళిపోతాం" అన్నాడు గజేంద్రన్.

రోనాల్డు రిసీవర్ని పెట్టేశాడు. వాలి చుట్ట వెలిగించి గిరివైపు చూశాడు.

"గిరీ, ఇన్స్పెక్టర్ నాయర్ కి ఫోన్ చేసి వెంటనే ఇక్కడకు రమ్మను" అన్నాడు వాలి.

గిరి బయటకు పరుగెత్తాడు. వాలి అతడిని రోనాల్డుకు అప్పగించాడు. చుట్ట కాలుస్తూ ఎదురుగా నిలబడ్డాడు.

"నీ మనుషులు ఎక్కడకుపోతారు?"

"ఎవరెస్టు డ్రయ్ క్లీనర్స్ కంపెనీని నేను నడుపుతున్నాను. పెద్ద భవనం.... అందరూ అక్కడుంటారు."

"నీ ముఠాలో ఎంతమంది వున్నారు?"

"ఆడా, మొగా మొత్తం ఇరవైమంది వున్నారు."

"రోనాల్డు యిక్కడికొచ్చిన కారు నంబరు, కొంత

కాలం క్రితం పల్మనేరు ప్రాంతంలో బస్‌ను దోచుకు పారిపోయిన ముఠా కారు నంబరులా వుంది. బస్సును రెయిడ్ చేసింది నీ మనుషులేనా?" అడిగాడు వాలి.

"అవును" అన్నాడతను.

గిరి, ఇన్‌స్పెక్టర్ నాయర్ డజన్ కాన్‌స్టేబుల్స్‌తో లోపలకు వచ్చారు.

"గిరీ, ఆ పాకెట్‌ను మన కారులో పెట్టి అక్కడ వుండు" అన్నాడు వాలి.

ఇన్‌స్పెక్టర్ నాయర్ వైపు చూశాడు వాలి.

"నాయర్ భాయ్, అరస్టు హిమ్! ఎవరెస్టు డ్రయ్ క్లీనర్స్ భవనంమీద దాడిచేసి అక్కడి వాళ్ళను అరస్టు చేయి! నైట్ ప్రయాణంచేసే బస్సులను రెయిడ్ చేసి దోచుకుంటున్న ముఠా అధిపతి ఇతను" అన్నాడు వాలి.

"వాలిగారూ, మీకు నా ధన్యవాదాలు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

వాలి, రోనాల్డు కాలిగన్ గదిలోంచి బయటకు నడిచారు.

• • •

వెంకన్నరాజా ఇంటిముందు ఫియట్ కారు ఆగింది. రాజా బయటకు పరుగెత్తుకొచ్చాడు. కారులోంచి దిగిన ప్రమీల నవ్వుతూ తండ్రిని కౌగలించుకుంది.

"రాజా భాయ్, నువ్వు మాకిచ్చిన పాకెట్ ఇది!" అన్నాడు వాలి.

వెంకన్నరాజా ఆశ్చర్యంగా వాలివైపు చూశాడు.

"మీకు నేను పాకెట్ ఇవ్వలేదే!" వాలి గంభీరంగా నవ్వాడు.

"రాజా భాయ్, నీ వాచ్‌ని అరగంట ముందుకు తిప్పారు. అది నీకు తెలియదు. నువ్వు పన్నెండు అనుకుంటూ 11-30కే వాలెస్ రోడ్డు పోస్టుబాక్స్ దగ్గర నిలబడ్డావు. నీముందు వచ్చి ఆగిన కారు నా ఫ్రెండ్ విలియమ్స్‌ది. అతడు ఆ పాకెట్‌ను నాకు అందించాడు. సరిగ్గా పన్నెండింటికి ఆ పాకెట్‌ను వాళ్ళ మనిషికిచ్చి, గిరీ నేనూ ఆ కారును వెంటాడాం!" అన్నాడు వాలి.

వెంకన్నరాజా అమాంతంగా వాలిని కౌగలించుకున్నాడు.

"వాలిగారూ, యు ఆర్ రియల్లీ గ్రేట్!" అన్నాడతను ఉద్రేకంతో.

—:సమాప్తం:—

# రక్తపుటేర్లు

## వసుంధర

(గత సంచిక తరువాయి)

"నాతో ఏం పని నీకు సురేష్!" అన్నాడు ప్రతాప్.

"చాలా ముఖ్యమైన పనిమీదే కబురు పెట్టాను...." అన్నాడు సురేష్ సాలోచనగా.

"ఏమిటది?"

"ఒక ప్రమాదకరమైన రహస్యాన్ని తెలుసుకున్నాను...."

ప్రతాప్ నవ్వాడు—"అది నాకు చెప్పొచ్చా?"

"మామూలుగా అయితే నీకు చెప్పివుండేవాణ్ని కాదు. కానీ ఇది జాహ్నవికి సంబంధించిన విషయం...."

ప్రతాప్ ఉలిక్కిపడి—"అంటే?" అన్నాడు.

"ఇటీవల చచ్చిపోయిన పెళ్ళికొడుకు సుబ్రహ్మణ్యం విజయబాబు మనిషి—తెలుసా?" అన్నాడు.

ఈ సమాచారాన్ని ప్రతాప్ పెద్దగా పట్టించుకోలేదు...."అయితే అవనీ—అందువల్ల మన కేమిబ్బంది?"

"విజయబాబుకు తెలుసు — జాహ్నవిని పెళ్ళాడదలచిన వాడు బ్రతకడని. అందుకే అన్ని ఏర్పాట్లూ పటిష్టంగా చేసి సుబ్రహ్మణ్యాన్ని పెళ్ళికి సిద్ధం చేశాడు. నిజానికి సుబ్రహ్మణ్యంగానీ, అతడి బంధువులుగానీ అసలైన పెళ్ళివారు కాదు. అందర్నీ అద్దెకు తెచ్చి ఓ చోట కలిపాడు...."

"అదన్న మాట సంగతి....ఎన్ని ఏర్పాట్లు చేస్తేనేం ఆ సుబ్రహ్మణ్యం కూడా బ్రతకలేదుగా."

"వాడో చవట దద్దమ్మ కాబట్టి బ్రతకలేదు...."

"అదేం కాదు....జాహ్నవిని ప్రేమించినవాడి ప్రేమ బలం అటువంటి...." అన్నాడు ప్రతాప్.

"ఆ ప్రేమబలం యెంతటిదైనా విజయబాబుని ఏమీ చెయ్యలేదు. ఆ విషయం ఒప్పుకుంటావా?"

"మధ్య విజయబాబు ప్రసక్తి ఎందుకు?"

"అసలు సంగతి తెలుసుకోవడం లేదు నువ్వు. జాహ్నవిని తన మనిషికిచ్చి వివాహం చేయాలనుకుం టున్నాడు విజయబాబు. ఇప్పుడది ఫెయిలయ్యేసరికి తనే ఆమెను వివాహం చేసుకుందుకు ముందుకొస్తు న్నాడు...."

"వచ్చినా—వివాహం ఇప్పట్లో జరిగేది కాదు...."

"అలాగనుకోకు. జాహ్నవిని వీలైనంత వెంటనే చేపట్టడానికి విజయబాబు బ్రహ్మాండమైన పథకం ఒకటి వేస్తున్నాడు...."

ప్రతాప్ అసహనంగా చేతులతో నుదురు మీద రాసుకున్నాడు. ఆవేశాన్ని అదుపులోకి తెచ్చుకుందుకు ప్రయత్నిస్తున్నట్లు తెలిసిపోతోంది — "నీ మాటలు తిన్నగా లేవు. విజయబాబుకు జాహ్నవిమీద ఆసక్తి ఎప్పట్నించి? అతడికామెపై ఆసక్తి వున్న పక్షంలో తనే పెళ్ళిచేసుకోక — మరొకడినెవరినో ఎందుకు పురమాయిస్తాడు?" అన్నాడు నెమ్మదిగా.

"ఎందుకంటే — విజయబాబు జాహ్నవి శరీరాన్ని వ్యాపారానికి ఉపయోగించాలనుకుంటున్నాడు—" అన్నాడు సురేష్.

"ఏమన్నావ్?" ప్రతాప్ ఆవేశాన్నదుపుచేసుకోలేక పోయాడు.

సురేష్, అతడికి విజయబాబు తన వద్దకు రావడమూ, జాహ్నవిని పెళ్ళిచేసుకోమని అడగడమూ గురించి చెప్పాడు.

ప్రతాప్ నుదుటిమీద చేతులతో బలంగా రాకున్నాడు. ఆవేశం అదుపులోకి రావడానికి కొంత సేపు పట్టింది.

"ఇప్పుడు విజయబాబు చేసిన పథకం గురించి వింటే ఇంకా దెబ్బతింటావ్!" అన్నాడు సురేష్.

"ఏమిటది?"

"సరిగ్గా రెండు రోజుల్లో విజయబాబుకూ, జాహ్నవికీ పెళ్ళవుతున్నట్లు ఊళ్ళో పెద్దలకూ, రఘురాం బంధువులకూ శుభలేఖలు అందుతాయి. అది చూసి కలవరపడి విజయబాబు రఘురాం ఇంటికి వెడతాడు. ఇది తనకు తెలియకుండా జరిగిందని ఆయన దగ్గర వాపోతాడు. జాహ్నవిని వివాహమాడాలనుకున్నవాడి ప్రాణాలకు ప్రమాదమని తనకు తెలుసునంటాడు. కానీ వ్యవహారం ఇంతవరకూ వచ్చింది కాబట్టి — ఆ ఇంటి మార్యాద కాపాడ్డం కోసం — తను జాహ్నవిని పెళ్ళాడ్డానికి సిద్ధంగా వున్నా నంటాడు. రఘురాంగారు కాదనే సితిలో వుంటాడని నేననుకోను...."

ఈ పథకం విని ప్రతాప్ తెల్లబోయాడు.

"ఇది నీకు ఎలా తెలిసింది?" అన్నాడతను.

"ఎలాగో తెలిసింది! ప్రస్తుతం విజయబాబుకూ నాకూ కేవలం జాహ్నవి కారణంగా వ్యవహారం చెడిపోయింది. నేనే ఇప్పుడు ప్రమాదంలో వున్నాను...."

"అయితే ఇదంతా నాకెందుకు చెప్పావు?"

"జాహ్నవికి కాబోయే వరుడి అడ్డంకి తొలగిస్తావని!"

ప్రతాప్ ఆశ్చర్యంగా అతడివంక చూసి—"ఆ విష యంలో నువ్వే కదా—ఇంతకాలం నాకు సాయపడు తున్నావు...." అన్నాడు.

సురేష్ ప్రతాప్ వంక చురుగ్గా చూసి—"తల్లి పుట్టిల్లు గురించి మేనమామ దగ్గర చెప్పకు. జాహ్నవి పెళ్ళి కొడుకులెలా అంతమవుతున్నారో నీకు తెలుసు...." అన్నాడు.

"నువ్వు నటిస్తున్నావా? నిజం చెబుతున్నావా?" అన్నాడు ప్రతాప్ నమ్మలేనట్లు. అతడి కళ్ళలో ఏదో ఆశ్చర్యం కనబడుతోంది.

"ఇదే ప్రశ్న నేనూ నిన్ను అడగాలనుకుంటున్నాను" అన్నాను సురేష్.

ఇద్దరూ కాసేపు మౌనంగా వున్నారు.

జాహ్నవిని ప్రతాప్ ప్రేమిస్తున్న విషయం సురేష్‌కు తెలుసు. అతడామెను పెళ్ళిచేసుకోడనీ తెలుసు. సురేష్‌ని మాత్రమే జాహ్నవికి కాదగ్గ వరుడిగా అంగీకరించాడు ప్రతాప్. అయితే అందుకు కొన్ని షరతులున్నాయి. సురేష్ తన చెడు అలవాట్లన్నీ విడిచిపెట్టాలి. సురేష్‌కు జీవితం కొంత ఎంజాయ్ చేయాలని వుంది. రెండు సంవత్సరాలు అన్ని ఆనందాలూ చవిచూశాక అప్పుడు జాహ్నవిని పెళ్ళిచేసుకొని ప్రశాంతమైన జీవితం గడుపుతాడు. ఈలోగా జాహ్నవికి పెళ్ళి సంబంధం కుదరడానికి వీల్లేదు. కుదిరితే వరుణ్ని మట్టుపెడతానని సురేష్ ప్రతాప్‌కు చెప్పాడు.

అయితే ప్రతాప్‌కు జాహ్నవిని వేరొకడు వివాహం

చేసుకోనడం ఇష్టముండదు. అసలు సురేష్ వివాహం చేసుకోవడం కూడా ఇష్టముండి వుండదు. సురేష్ కార్య రంగంలోకి దూకేవరకూ ఆగకుండానే అతనే వ్యవహారం పూర్తిచేస్తున్నాడు—ఇదీ సురేష్‌కు తెలిసిన విషయం.

"నే నలాగనుకోవడంలేదు. నువ్వు నిజంగానే రంగం లోకి వెంటనే దిగిపోతున్నా వనుకుంటున్నాను—" అన్నాడు ప్రతాప్.

అతడి కళ్ళలో అమాయకత్వాన్ని చదవగలిగాడు సురేష్— "అయితే ఆ హత్య లెవరు చేశారంటావు?"

"నిన్ను గాక నేను నమ్మినదింకొకటుంది. బహుశా ఆ చావులకు కారణం అదేనేమో!" అన్నాడు ప్రతాప్.

"ఏమిటది?"

"బేతాళ పూజ...."

"బేతాళ పూజా?" ఏదో కొత్తమాట విన్నట్లు అన్నాడు సురేష్.

"అవును.... బేతాళ పూజ!" అన్నాడు ప్రతాప్.

"అంటే?"

ప్రతాప్ కళ్ళు తృప్తితో మెరుస్తున్నాయి—"ఇంత కాలం అంతా నీ కారణంగానే జరుగుతున్నదనుకున్నాను. ఏదో మానవాతీత శక్తి నాకు సాయపడుతున్నదన్న నమ్మకం ఇప్పుడే కలిగింది. బేతాళ పూజపై ఎలాంటి సందేహాలున్నా ఈ క్షణంలో తీరిపోయాయి. విజయబాబు కాదు....అతడి తలదన్నినవాళ్ళు వచ్చినా నాకెదురు లేదు. నా బేతాళ పూజ నన్ను రక్షిస్తుంది. అడ్డువచ్చిన వాళ్ళను భక్షిస్తుంది. నాలోని లోపాల్ని సవరిస్తుంది."

"ఏమిటా పూజ ప్రతాప్!" కుతూహలంగా అడిగాడు సురేష్.

"చెప్పను. చెప్పలేను! ఎట్టొచ్చీ-నీ వింక విజయబాబు గురించి ఏ విధమైన బెంగా పెట్టుకోకు...." అన్నాడు ప్రతాప్.

• • •

"సావిత్రీ—ఇంక మనం ఒకే ఒక్కసారి పూజచేయ బోతున్నాం. ఆ తర్వాతనుంచి నీ కష్టాలూ, నా కష్టాలూ పూర్తిగా తీరిపోతాయి..." అన్నాడు ప్రతాప్.

"అంటే?" అంది సావిత్రి.

"నా పూజా విధానంలో చాలాసార్లు నిన్ను బాధిం చానుకదూ!" అన్నాడు ప్రతాప్ జాలిగా.

"లేదు ప్రతాప్ ....నీ పూజ గురించి నాకు బాధ లేదు. నాకు నువ్వు కావాలి...." అంది సావిత్రి.

"నిజంగా నీకు నేనంటే అంత ఇష్టమా?" అన్నాడు ప్రతాప్.

"ఊఁ."

"నాకోసం ఏమైనా చెయ్యగలవా?"

"ఊఁ."

"ప్రాణాలైనా ఇవ్వగలవా?"

"ఊఁ" అంది సావిత్రి ఏ మాత్రమూ తటపటా యించకుండా.

"ఊరికే అలాగంటున్నావు. ఇవ్వాల్సి వస్తే తటపటా యిస్తావు...."

సావిత్రి అదోలా నవ్వింది — "నన్ను మనిషిగా గుర్తించి, మనిషిలా కాంక్షించావు. నాలాంటి ఆడది కోరుకునేది నీలాంటి మగవాణ్ని. నీలాంటివాడికోసం ప్రాణాలు ఇవ్వడమే కాదు ...ఎలాంటి నరకమైనా భరి స్తుంది...."

"ఈ మాటలు గుర్తుంచుకో సావిత్రీ! బహుశా నా కోసం నువ్వు ప్రాణాలు ఇవ్వాల్సి వుంటుందేమో— నరకాన్ని భరించాల్సి వుంటుందేమో!" అన్నాడు ప్రతాప్.

సావిత్రి అతడివంక చూసింది. అతడి ముఖంలో ఎలాంటి భావాలూ లేవు. ఏదో ఆలోచిస్తున్నాడని పిస్తుంది—"నీతో జీవితం తప్ప నాకింకే కోరికా లేదు. నీ సమక్షంలో వుంటే—అది నరకమైనా స్వర్గమే నాకు. నీ చేతుల్లో పోయే పక్షంలో ప్రాణాలు పోయినా సంతోషమే నాకు!"

"చాలా సంతోషం సావిత్రీ!" అన్నాడు ప్రతాప్— "ఇందాకనే చెప్పానుగదా — మనం కలిసి ఇంక ఒకే ఒక్క పూజ చేస్తాం. దాంతో అంతా ఆఖరు...." అని "సావిత్రీ! ఒకటినుంచి పది అంకెలు చెబుతాను.... వాటిలో నీ కిష్టమైనది కోరుకో...." అన్నాడతను.

అతడడిగింది సావిత్రికి వెంటనే అర్థంకాలేదు. అతడు వివరించాక—"నాకెంతో ప్రియమైన అంకె నాలుగు!" అంది.

ప్రతాప్ ఆ తర్వాత నిర్మలను కలుసుకున్నాడు. ఒకరొక్కరుగా తనకు పరిచితమైన పదిమంది స్త్రీలనూ కలుసుకొన్నాడు. అందరూ సావిత్రికిలాగునే మాట్లాడారు.

తెలిసినా ఎంతోమంది ఆచరించలేని సృష్టిలోని మూల సూత్రమిది!

సౌందర్యం, మంచితనం అనబడేది మిథ్య.

ప్రపంచంలో తనకు నచ్చిన కొన్ని లక్షణాలను మనిషి అందంగానూ, మంచితనంగానూ నిర్వచించి—ఆ

నిర్వచనాలు సరైనవన్న భ్రమలో జీవిస్తున్నాడు. దశాబ్దాలుగా, శతాబ్దాలుగా, తరతరాలుగా ఆ భ్రమను కొనసాగిస్తున్నాడు.

అందంపట్ల ఆకర్షణనూ, అందవికారంపట్ల ద్వేషాన్ని సృష్టిస్తున్నాడు.

నిజానికి ఏది అందం? ఏది అందవికారం? ఏది మంచితనం? ఏది చెడ్డతనం?

అందం, మంచితనం అన్నవి వేర్వేరు పదాలు కావు. మనిషికి అందాన్నిచ్చేది మంచితనం. ప్రతి మనిషిలోని అందాన్ని గుర్తించడమే మంచితనం.

మనిషి మనిషినుంచి ఆశించేది మనిషిగా గుర్తింపు! అన్ని విధాలా తనూ అందరితో సమానమని అంతా భావించాలన్న ఆశ!

ఈ విషయం గ్రహించక మనిషి మనిషిని డబ్బుతోటీ, అధికారంతోటీ, వంచనతోటీ గెలవాలని ప్రయత్నిస్తాడు. అదే సర్వానర్థాలకూ మూలమవుతోంది.

ప్రతాప్ చేరదీసిన యువతులందరూ సమాజంచేత ఏదో విధంగా వేటాడబడ్డవారే! అతడినుంచి లభించిన ఓదార్పు వాక్యాలు, నిష్కల్మషమైన అభిమానం వారి నతడికి దాసోహం చేసింది. ప్రతాప్ వారినుంచి ఏదో ప్రయోజనమాశిస్తున్న మాట నిజం. అయితే అతడి ప్రేమలో చిత్తశుద్ధి వుంది. మనస్ఫూర్తిగా వారినతడు కాంక్షించడంవల్ల వారతనికోసం ఎటువంటి నరకాన్నయినా భరించేస్థితికి వచ్చారు.

ప్రతాప్ స్వార్థపరుడు. తనకోసం ఆ యువతులనతడు చేరదీశాడు. అందులో ఏమీ సందేహంలేదు. అయితే అతడెన్నుకున్న పద్ధతి కారణంగా—తనకోసం ప్రాణా

లర్పించే యువతులు తయారయ్యారు.

ఇదే పద్ధతిని — సాంఘిక సేవాతత్పరులు, స్వచ్ఛంద సేవాసంస్థలు, రాజకీయ నాయకులు, అధికారులు, తల్లిదండ్రులు — అనుసరిస్తే దేశంకోసం ప్రాణాలను తృణప్రాయం చేయగల ఆదర్శ పౌరులు తయారుకారా?

"నాకెవ్వరూ వద్దు. ఏమీ వద్దు. నువ్వు వద్దంటే ఈ ప్రాణాలతో కూడా నాకు పనిలేదు—" అని ప్రతి ఒక్కరూ ప్రతాప్‌తో అన్నారు.

"ఒకటినుంచి పదివరకూ అంకెలు చెబుతాను. నాలుగు మినహాయించి వాటిలో ఏదో ఒకటి కోరుకో—" అన్నాడు ప్రతాప్.

నిర్మల ఎనిమిది కోరుకుంది.

ఒక్కొక్కరే ఒకో అంకెను కోరుకున్నారు.

ప్రతాప్ ఒకొక్క అంకెనే ఓ కాగితంమీద వేసుకుని—పక్కన పేర్లు రాశాడు. అందరికంటే ముందు దమయంతి పేరుంది. ఆమె ఒకటిని కోరుకుంది. ప్రతాప్ ఆమెకు చెప్పాడు—"పంచమినాడు రాత్రి....మరిచిపోవు కదూ?"

"మరిచిపోను—" అన్నప్పుడు దమయంతి కనులలో తన్మయత్వం కనిపించింది.

• • •

అది పంచమినాడు రాత్రి....

పాడుబడిన శివాలయంలో ఇద్దరే ఇద్దరున్నారు.

అఘోరీబాబా....ప్రతాప్....

గుడికి కాస్త దూరంగా నేలమీద పదిగోతులు తవ్వబడివున్నాయి. ఒకొక్కటీ నాలుగడుగుల వెడల్పు, ఏడడుగుల పొడవు, మూడడుగుల లోతు....వున్నాయి.

"ఇవన్నీ స్వయంగా చేసే తవ్వాను. తెలుసా?" అన్నాడు బాబా గర్వంగా. అతడి కళ్ళలో అదో రకమైన క్రూరత్వం మెరుస్తోంది.

ప్రతాప్ గోతులవంక చూడడంలేదు — "ఆమె వస్తుందంటావా, బాబా!" అన్నాడతను.

"వస్తుంది — బేతాళుడే ఆమెనిక్కడికి రప్పిస్తాడు. బేతాళుడి ఆజ్ఞను ఆమె కాదనలేదు—" అన్నాడు బాబా.

అప్పుడు చూశాడు ప్రతాప్.

గుడిలో శివుడు లేడు. బాబా ఏర్పరచిన బేతాళ విగ్రహం వుంది. విగ్రహం భయంకరంగా వుంది.

"ఆమె వస్తోంది!" అన్నాడు బాబా. అని పక్కకు తప్పుకున్నాడు.

ప్రతాప్ చూశాడు.

ఆమె వస్తోంది....వడివడిగా త్వరత్వరగా వస్తోంది. ఆమె నడకలో ఆత్రం వుంది. ప్రతాప్ ఆమెకు ఎదురు వెళ్ళాడు.

"నువ్వేనా?" అందామె సంతోషంగా.

ప్రతాప్ ఆమెను బలంగా కౌగలించుకున్నాడు. ఆమెకు ఎంతో సంతోషంగా వుంది.

"ఎలా వచ్చావ్?" అన్నాడతను.

"పుట్టింటికి పోతున్నానని ఆయనకు చెప్పాను. మొదటి ఆట సినిమాకు వెళ్ళాను. తర్వాత నువ్వు చూపిన సందులగొందుల దారిలో ఎవరికళ్లా బడకుండా ఇక్కడకు వచ్చాను...."

ఇద్దరూ బేతాళ విగ్రహం ముందుకు వెళ్ళారు. విగ్రహాన్ని చూసి ఆమె అదిరిపడింది...."ఇంట్లో అయితే

చిన్న విగ్రహం....కానీ ఇది చాలా పెద్దదిగా కనబడు తోంది...."

"అవును.... ఈ విగ్రహం పెద్దది. పూజ కూడా అందుకు తగ్గట్లుగానే వుంటుంది" - అన్నాడు ప్రతాప్.

దమయంతి భయపడింది — "అందుకు తగ్గట్లుగా అంటే?" అందామె. అప్పుడే ఆమె తన చుట్టూ వున్న వాతావరణాన్ని పరిశీలించింది. అంతసేపూ వున్న మైకం ఆమెనుంచి దిగిపోయింది. అదొక భయానక ప్రదేశం!

"భయపడకు. ఈసారి పూజకు కత్తులుండవు. నిమ్మ కాయలుండవు...."

దమయంతి తేలిగ్గా నిట్టూర్చి — "అన్నట్లు ఇదే ఆఖరు పూజ అన్నావు కదూ-" అంది. మళ్ళీ సంతోషం ఆమెకు కలిగింది.

"అవును—ఇదే ఆఖరు పూజ...." అని అతనంటూ అప్రయత్నంగా దూరంగా చూశాడు. బాబా స్వయంగా తవ్విన పది గోతులూ అతడికి కనబడ్డాయి.

"అయితే ప్రారంభించు...." అందామె.

ఆఖరి పూజకోసం ఆమె ఆత్రపడుతున్నట్లు గ్రహించాడతను.

"నాలో పూజావేశం కలగాలి. అందుకోసం నన్ను రెచ్చగొట్టేలా నృత్యం చేయి. నృత్యం పూర్తయేసరికి నీ ఒంటిమీద దుస్తులుండకూడదు...."

అతడి వినోదమే ఆమె వినోదం. ఆమె నర్తకి కాదు. వేశ్య కాదు. ఒక సాధారణమైన ఆడది. అయితే ఆ క్షణంలో ఆమె అతడికోసం—నర్తకులను మించి నాట్య మాడుతోంది. వేశ్యకన్న మిన్నగా ఆడుతోంది.

అతడు కోరిన విధంగానే నాట్యం పూర్తయింది.

ప్రతాప్‌లో ఆవేశం రగిలింది. అతడామెను ఆవేశంగా సమీపించి—చేయి పట్టుకున్నాడు.

అతడి చేతిలో వేడి వుంది. ఆమె శరీరంలో వేడి వుంది. వాతావరణం చల్లగా వుండి ప్రేమికుల మనసుల్లో వేడి పుట్టిస్తోంది. భేతాళ విగ్రహం కళ్ళు చూసే క్రూరమైన చూపుల్లో వేడి ఉంది.

అంతా వేడిమయం!

"ప్రతాప్!" అందామె ఆనందంగా.

ప్రతాప్ పెదవులు అస్పష్టంగా కదిలాయి. అతడి మాటలు అతికష్టంమీద ఆమెకు అర్థమయ్యాయి.

"దమయంతీ!" అన్నాడతను. కొద్దిక్షణాలాగి—"ఇప్పుడు మనిషిని కాదు. పశువును...." అన్నాడు.

అతడి మాటలర్థమైనా ఆ మాటల కర్థం తెలియలేదు ఆమెకు. అయితే కొద్దిసేపటిలోనే అతడిచేతులామెకు ఆ మాటల అర్థాన్ని తెలియజెప్పాయి.

ప్రతాప్ ఆమెతో మనిషికాక పశువులా ప్రవర్తిస్తున్నాడు. అది అనుభవం కాదు....హింస....

ముందామె సహించింది. తర్వాత సహించడానికి ప్రయత్నించింది. ఆ తర్వాత సహించలేకపోయింది. ప్రతిఘటించడం ప్రారంభించింది. కొంతసేపటికి ప్రతిఘటించే శక్తి నశించింది. అతన్ని మాటలతో దూషించసాగింది. దూషిస్తున్నకొద్దీ అతడు రెచ్చిపోయాడు. ఆఖరికామెలో మాట్లాడే శక్తికూడా నశించిపోయింది. నిస్సహాయంగా అతడిని చూస్తోందామె. ఆ చూపులు అంటున్నాయి...."నువ్వు....మనిషివి కాదు....పశువ్వి."

కాసేపటికి ఆ చూపులకూ శక్తి తగ్గిపోయింది. ఆమె కనులు మూతపడ్డాయి. ఒక విధమైన పైశాచికావేశంలో

ప్రతాప్ ఆమెను అనుభవించి అక్కణ్నించి కదిలాడు. బాబా అతడి భుజంతట్టి — "అంతా చూశాను. పూజా విధానం సక్రమంగా ఉంది—" అన్నాడు.

ప్రతాప్ ఏదోలా బాబావంక చూశాడు.

"నిన్ను మెచ్చుకోవడం మరిచిపోయాను. శభాష్!" అన్నాడు బాబా మళ్ళీ.

"ఆమెకిప్పుడు ఏం జరుగుతుంది బాబా!" అన్నాడతను.

"నీ ఊహాకలాలతో నే అలా అనుకో — నన్నేమీ అడక్కు. అది పూజా విధానానికే వ్యతిరేకం.... ఇంక వెళ్ళు...." అన్నాడు బాబా.

"ఫలితం వుంటుందంటావా?" అన్నాడు ప్రతాప్.

"ఫలితాన్ని సందేహించకు. నీకు అంతా శుభమే జరుగుతుంది. వెళ్ళు...." అన్నాడు బాబా.

అప్పుడు ప్రతాప్ కదిలాడు.

"రేపు కూడా ఇదే విధంగా...." అన్నాడు బాబా.

ప్రతాప్ వెళ్ళిపోయాడు.

బాబా దమయంతిని సమీపించాడు.

బేతాళ విగ్రహానికి ముందు రక్తసిక్తమైన దేహంలో నగ్నంగా పడి వుందామె. బాబా వంగి ఆమె నాడి చూశాడు. అది బలహీనంగా కొట్టుకుంటోంది.

వున్నట్లుండి దమయంతి కళ్ళు తెరిచింది. ఎదురుగా బాబా కనిపించాడు. కెవ్వుమని అరవాలనుకుంది. కానీ ఓపిక లేదు.

ఆమెకంటికతను శవాలను పీక్కుతినే పిశాచంలా కనిపించాడు.

• • •

మర్నాడు తెలవగానే ప్రతాప్ జాహ్నవి ఇంటికి వెళ్ళాడు. అతడిని రఘురాం సాదరంగా ఆహ్వానించాడు.

"ఏదైనా పెళ్ళి శుభలేఖ వచ్చిందా?" అన్నాడు ప్రతాప్.

"ఎవరిది—నీదా?" అన్నాడు రఘురాం నవ్వుతూ.

"కాదు—జాహ్నవిది...." అన్నాడు ప్రతాప్ గంభీరంగా.

రఘురాం ముఖం అదోలాగై పోయింది — "దాని పెళ్ళికి శుభలేఖ వేయించే అవకాశం ఈ జన్మకుందో లేదో!"

"అదేం మామయ్యా—అలా దిగాలు పడిపోయావు."

రఘురాం మాట్లాడలేదు. కొన్ని ప్రశ్నలకు మౌనమే జవాబు.

తనకు తెలిసిన విషయం మామయ్యకు చెప్పాలా కూడదా అని ఆలోచిస్తున్నాడు ప్రతాప్. చెబితే ఎలా చెప్పాలి?

ఇద్దరూ ఆలోచిస్తూండగానే ఆ ఇంటిముందు స్కూటరొకటి ఆగింది. దానిమీంచి ఓ యువకుడు దిగాడు. అతడి చేతిలో పెద్ద కట్టవుంది. అందులోంచి ఒకటి తీసి పట్టుకుని అతడు రఘురాంని సమీపించాడు.

రఘురాం కార్డు అందుకున్నాడు.

అది జాహ్నవి పెళ్ళి శుభలేఖ. ఉలిక్కిపడి అంతా చదివి—"ఎవరయ్యా—ఈ విజయబాబు!" అన్నాడు రఘురాం కంగారుగా.

ప్రతాప్ నాలుగడుగులు ముందుకు వేసి-వెళ్ళిపోతున్న ఆ యువకుడి కాలరు పట్టుకుని — "ఎవరిచ్చారు—నీకీ కార్డులు...." అనడిగాడు.

"ప్రతాప్ గారండి...." అన్నాడా యువకుడు.

ప్రతాప్ ఉలిక్కిపడి—"ఏ ప్రతాప్?" అన్నాడు. అతడు చెప్పిన ఇంటి పేరు, వివరాలు తనకే సరిపోయాయి.

"నేనే ప్రతాప్ ని-ఈ కార్డులు నేనే ఇచ్చావా నీకు!"

"మీరు కాదండి...."

ఎవరో ప్రతాప్ పేరు చెప్పి ఆ కార్డులు ఇంటింటా పంచిపెట్టమన్నట్లు అర్థమయింది ప్రతాప్ కి.

"ఈ కార్డులు ఇంకా ఎక్కడైనా ఇచ్చావా?"

"లేదండి—ఈ ఇంటినుంచే ఆరంభించమన్నారు...."

ప్రతాప్ ఆ కార్డులన్నీ లాక్కున్నాడు. ఆ యువకుణ్ణి పొమ్మన్నాడు. రఘురాం వంక తిరిగి—"ఈ విషయంలో నేను విన్నది నిజమేనన్నమాట....ఇంక ఆ విజయబాబు బ్రతకడు...." అన్నాడు.

విషయం పూర్తిగా అర్థంచేసుకోడానికి రఘురాంకు కొంతసేపు పట్టింది. అంతా విని ఆయన—"ఒక్కగా నొక్క కూతురు. పాపిష్టి వెధవల కళ్ళన్నీ దీనిమీదే పడుతున్నాయి...." అన్నాడు.

"అదృష్టవశాత్తూ ఈ కార్డుల తతంగంనుంచి బయట పడ్డాము. మనకూ మంచిరోజులు వస్తాయి మామయ్యా.." అన్నాడు ప్రతాప్.

"ఏం మంచిరోజులో!" అని రఘురాం నిట్టూర్చిన సమయంలో రామకృష్ణ ఇంట్లో ప్రవేశించాడు. అతను ప్రతాప్ ని చూస్తూనే — "చిరకాల దర్శనం — నా మందారనూనె ఎలా పనిచేస్తోంది?" అనడిగాడు.

"మీరే చూసి చెప్పాలి—" అన్నాడు ప్రతాప్.

రఘురాం రామకృష్ణకు శుభలేఖ అందించి—జరిగింది చెప్పాడు.

"విజయబాబు ఈ ఏర్పాట్లెలా చేశాడు? అతణ్ని

నేనిప్పుడే లాకప్పులో౦చి పలకరి౦చి వస్తున్నాను...."
అన్నాడు రామకృష్ణ.

"విజయబాబు లాకప్పులోనా?" ఆశ్చర్య౦గా అన్నాడు ప్రతాప్.

"అవును మరి—చేసిన పాప౦ ప౦డి౦ది...." అన్నాడు రామకృష్ణ.

"ఏమిటా పాప౦?" అన్నాడు రఘురా౦.

"విజయబాబు ఓ కొత్త పద్ధతిలో స్మగ్లి౦గ్ కొనసాగిస్తున్నాడు—" అన్నాడు రామకృష్ణ.

క్యాబరే డ్యాన్సరు మధురిమ స్మగ్లి౦గులో ఒక కీలక పాత్ర వహిస్తో౦ది. సరుకు ఎక్కడెక్కడ ఎవరెవ్వరికివ్వాలీ అన్న వివరాలన్నీ ఆమె దగ్గరే వు౦టాయి. స్మగ్లర్స గ్యా౦గులో వున్న వివిధ ప్రా౦తాల మనుషులు, ఆఫీసులు వగైరా వివరాలన్నీ కోడ్ లా౦గ్వేజిలో కొన్ని కాగితాలలో వ్రాసుకుని ఆమె వాటిని ఎన్నడూ తన ఉడుపులలో వు౦చుకు౦టు౦ది. వాటికి స౦బ౦ధి౦చిన రికార్డు వేరే ఎక్కడా వు౦డదు.

ఆమెకు రక్షణగా భీమసేనుడు ఉ౦టాడు. నిజానికి భీమసేనుడు రక్షి౦చేది ఆమె అ౦దాన్ని కాదు.

ఆమె దాచిన కాగితాల్ని, ఆకాగితాలామె లోదుస్తుల్లో దాసు౦దని స్ఫురి౦చడ౦ కష్ట౦. ఆమె క్యాబరే నృత్య౦ ప్రార౦భి౦చగానే సరుకు కావలసిన వార౦దరూ ఆమెకు డబ్బు ఇస్తారు. ఆ నోట్లమీద, చెక్కులమీద కోడ్ లా౦గ్వేజిలో తమ పేరు, చిరునామాలతో పాటు కావలసిన సరుకు వివరాలు౦టాయి. బ౦గార౦, వజ్రాలు, మత్తుపదార్థాలతో పాటు — అత్య౦తాధునికమైన ఎలక్ట్రానిక్ పరికరాలు కూడా ఆ ముఠా స్మగుల్ చేస్తో౦ది.

మధురిమ తన గదికి వెళ్ళేక తను సేకరించిన డబ్బు, చెక్కులతో పాటు—తను భద్రంగా దాచిన కాగితాలు కూడా విజయబాబుకివ్వాలి.

విజయబాబు ఈ ఊరికి గ్యాంగులీడరు వంటివాడు. అతడు అన్ని ఏర్పాట్లూ ఆ ప్రకారం చేసేస్తాడు. ఈ కార్యక్రమానికి మధురిమ ఒక పెద్ద ఆకర్షణ.

రామకృష్ణ ఈ స్మగ్లింగ్ గ్యాంగు అంతు చూడాలనే ఈ ఊరొచ్చాడు. ప్రభుత్వం అతడిని నియమించింది. మధురిమ వద్దనుంచి ఆ కాగితాలూ, డబ్బు కూడా అతను సంపాదించాడు. అయితే వాటిలోని భాషను డీకోడ్ చేయడం చాలా కష్టమయింది.

ఈలోగా కాగితాలు పోగొట్టుకున్న కారణంగా మధురిమను గ్యాంగు లీడరు చంపేశాడు. ఆ గ్యాంగు లీడరు విజయబాబు అని నిన్ననే తెలిసింది. మధురిమను అతడే హత్య చేసినట్లు ఆధారం దొరికింది. వెంటనే అతణ్ని లాకప్పులోకి తీసుకోనడం జరిగింది.

"ఉన్నట్లుండి హఠాత్తుగా ఏ ఆధారం దొరికింది?" అన్నాడు ప్రతాప్ ఆశ్చర్యంగా. ఇది బేతాళ పూజ మహాత్మ్యం కాదుగదా అని అతడికి మనసులో అనుమానంగా వుంది.

"ఈ ఊళ్ళో డేంజర్ అని ఒక కిరాయి గూండా వున్నాడు. అతడారోజు మధురిమను కలుసుకున్నట్లు తెలిసింది. ఆ రోజునుంచీ అతడికి తెలియకుండా అతడినో కంట కనిపెట్టడం ఆరంభమయింది. అతడు తరచు మధుసూదనరావు ఇంటికి వెడుతున్నాడు. నిన్న విజయబాబు, మధుసూదనరావు, డేంజర్ ఒకచోట కలుసుకుని మాట్లాడుతున్నది నేను విన్నాను...." (ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతితోపాటు 5 నెలలు "సప్లిమెంట్" కూడా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును. •





# ప్రేమలో తమాషా

## శ్రీవారి పరిచయం!

సునీత సోఫాలో కూర్చుని పేపరు చదువుతోంది.

"హలో సునీతా!" అంటూ రీటా హాల్లోకి ప్రవేశించింది.

సునీత కూర్చోమని సోఫావైపు చూపెట్టింది.

"పెళ్ళెప్పుడు చేసుకున్నావ్ నన్ను పిలవకుండా? పోనీ ఆ అందాల సుందరు డెవరో కాస్త పరిచయమయినా చెయ్యవే" అంది రీటా.

"ఆయన బాత్‌రూంలో స్నానం చేస్తున్నారు. రాగానే పరిచయం చేస్తాను," చెప్పింది సునీత.

"పెళ్ళి చేసుకోనని కాలేజీలో వుపన్యాసాలు ధంచే నీవు యింత త్వరగా ఎందుకు చేసుకున్నావే?"

"అదో పెద్ద కథ లేవే! మా ఆయన పెళ్ళికాక మునుపు మెడిసన్ చదివేవాడు. ఎప్పుడూ చదవడంవల్ల కొద్దిగా పిచ్చిపట్టింది. ఆ షాక్‌తో వాళ్ళ అమ్మా నాన్న చచ్చిపోయారు. అనాధగా మిగిలిపోయాడు. పైగా మేనబావ. అలాంటి పరిస్థితిలో బావను ఒంటరిగా ఎలా వదిలేది? పెళ్ళి చేసుకుంటే పిచ్చి కుదురుతుందని డాక్టర్లు చెప్పడంతో పెళ్ళి చేసుకున్నాను. మేమున్న ఆ పరిస్థితుల్లో పెళ్ళికి ఎవర్నీ పిలవలేక పోయాను."

"అయ్యో! అలాగ. పాపం! అరిటాకు లాంటి నీ జీవితంలో ఎన్ని ముల్లులాంటి కష్టాలే తల్లీ."

బాత్‌రూం నుంచి వీళ్ళ సంభాషణంతా వింటున్న రాజా

రావుకి వొళ్ళు మండింది. ఇంగ్లీషు సెక్స్ చిత్రం నడుస్తున్నప్పుడు నిశ్శబ్దంగా వుండే హాలు లాగా వుండే తన యింటిని తెలుగుపిక్చర్ నడుస్తున్న హాలులాగా చేసిన ఆ చరిత్రహీనుల పైన చెప్పరాని కోపం వచ్చి, స్నానం చేస్తున్నవాడల్లా వున్నపళంగా బయటికి వచ్చి—

"ఎవరండి మీరు? మా యింట్లోకొచ్చి నన్ను గురించి చెడ్డగా మాట్లాడుతారా?" ఆవేశంతో వొంటిమీద గుడ్డ లేవన్న సంగతే మరిచి ఊగిపోతూ అన్నాడు.

"అదేంటండీ? నేను మీ భార్యని" అంది భయంగా సునీత.

"రామ! రామ! బ్రహ్మచారిని పట్టుకొని భర్త అంటారా!? పైగా నాకు పిచ్చి అంటారా? వుండండి పోలీసులకు ఫోన్ చేసి మీరెవరో తేల్చిపారేస్తాను" అంటూ అగ్గిపెట్టె తీసి "హలో, హలో!" అని అరవసాగాడు.

"మీవారి పరిచయం చాలే తల్లీ!" అంటూ రీటా వేగంగా వీధిలోకి పారిపోయింది.—యన్. శివానంద్, బెల్లంపల్లి.

## "ప్రతి రోజు - పది రూపాయలు"

ఆరోక్లాసు పిల్లలకి డబ్బు విలువల్ని బోధిస్తున్నాడు మేష్టారు. ఒక అబ్బాయిని లేపి ఇలా అడిగాడు.

"ఒరేయ్....మీ నాన్న నీకు ఎప్పుడైనా వో పదిరూపాయలు ఇచ్చాడట్రా....?"

"ఎప్పుడైనా ఏంటి సార్! ప్రతిరోజు పది రూపాయలు ఇస్తాడు!" చెప్పాడు అబ్బాయి.

"అబ్బో! అబ్బో! మీ నాన్న చాలా మంచోళ్లాగున్నాడే. అయితే ఆ పది రూపాయల్ని యేం చేస్తుంటావురా?"

"ఏం చేస్తాను. సారాకొట్టు కెళ్ళి మా నాన్నకు సారా తెచ్చిపెడ్తుంటాను!" —యం. వీరాస్వామి, మల్కాజిగిరి.

